47వ పూజా పుష్పము

శ్రీరామ కథా సుధాలహరి

# అయోధ్యా కాండము

## మొదటి భాగము

(శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి - గీతికలలో)





దుర్గాప్రసాద్

ప్రథమ ముద్రణము 500 ప్రతులు



శిశిరము-ఫాల్గుణము
ప్రమాధినామ సంవత్సరము
2000 - మార్చి

వెల : ముప్పది రూపాయలు

ముద్రణము :
డి. బి. ప్రింటర్స్, విజయవాడ-2.

ప్రతులకు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవనము, బ్యాంకు స్ట్రీటు,
హైదరాబాదు-500 001.

పి. దుర్గారావు, యం.ఓ.యల్., తెలుగు పండిట్ (రిటైర్డ్)
అడవిదేవులపల్లి గ్రామం (పోస్టు) 508 207
(వయా) మిర్యాలగూడ, నల్లగొండజిల్లా.



# సమర్పణ :

కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరమ్ !
ఆరుహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలమ్!

పుష్పాంజలులతో

# దేవతా వందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప! విమలచరిత! అక్షరరూపిణీ భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణీ!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధ సేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

లలితకళా నందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధాకలశహస్త!
శివరూపిణీ! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! నందిత జన సకలలోక!

అయోధ్యా కాండాంతర్గతమగు

# విషయసూచిక

14. కైకేయి దశరథుని సత్యమును దప్పకుమని నిర్బంధించుట - దశరథుడు స్పృహదప్పుట -

15. సుమంత్రుడు రాజాజ్ఞచే రాముని దీసికొని వచ్చుటకు బోవుట

16. సుమంత్రుడు రామునకు రాజాజ్ఞను దెలుపుట - శ్రీరాముడు సీత యనుమతి బొంది లక్ష్మణునితో తండ్రి దగ్గఱకు వచ్చుట

17. శ్రీరాముడు రాజమార్గపు శోభను గనుగొనుచు తండ్రి యొద్దకు బోవుట

18. కైకేయి రామునకు దాను గోరిన రెండు వరములను దెలుపుట - రాముని వనవాసమునకు బొమ్మనుట

19. కైక కోరిన ప్రకారము రాముడు వనవాసమునకు అంగీకరించుట- కౌసల్యాదేవి యనుమతిని బొందుటకై యామె భవనమునకు బోవుట

20. రాముడు తల్లికి తన వనవాసమును గుఱించి తెలుపుట - తల్లి శోకించుట

21. లక్ష్మణుని క్రోధము - తండ్రి యాజ్ఞను బాలించుటయే ధర్మమని రాముడు దెలుపుట

22. శ్రీరాముడు లక్ష్మణునకు నచ్చజెప్పుట - దైవమే తన వనవాసమునకు గారణ మనుట

23. లక్ష్మణుని ప్రతాపోక్తులు - రాముడు శాంతింపజేయుట

24. విలపించుచున్న తల్లిని శ్రీరాము డోదార్చుట - తల్లి యనుమతిని బొందుట

25. వనవాసమునకు బోవుచున్న శ్రీరాముని కౌసల్యాదేవి యాశీర్వదించుట

26. శ్రీరాముడు దిగులుగా నుండుట గని సీత ప్రశ్నించుట- శ్రీరాముడు విషయమును జెప్పి తాను వనవాసమునకు

బోవుచుంటిననియు నీ వయోధ్యలో నుండుమని సీతకు దెలుపుట
27. సీతాదేవి తననుగూడ వనమునకు దీనికొని పొమ్మని రాముని బ్రార్థించుట
28. శ్రీరాముడు సీతాదేవికి వనవాసమునందలి కష్టములను వివరించి వనమునకు రావలదని వారించుట
29. తానుగూడ వనమునకు రామునితో కలిసి వెళ్ళుట యుక్తమని సీత వాదించుట
30. సీత వనముకు వచ్చుటకు రాము డంగీకరించుట- గృహములోని వస్తువులను బ్రాహ్మణాదులకు దానము జేయుట
31. రామ లక్ష్మణుల సంవాదము – లక్ష్మణుడు దివ్యాయుధములు ధరించి వనమునకు బయలుదేరుట
32. శ్రీరాముడు సీతాసమేతుడై వసిష్ఠ పుత్రుడు సుయజ్ఞుని బిలిపించి సర్వసంపదలు దానము జేయుట
33. సీతాలక్ష్మణులను గూడికొని శ్రీరాముడు తండ్రిని జూచుటకు కైకేయీ భవనమునకు బోవుట
34. సీతాలక్ష్మణ సమేతుడై శ్రీరాముడు దశరథ మహారాజు నొద్దకు బోయి వనవాసమునకు సెలవడుగుట - దశరథుడు శోకముచేత మూర్ఛ నొందుట
35. సుమంత్రుడు ఎంత బ్రతిమాలినను కైక వినకుండుట - కేకయరాజు వృత్తాంతము
36. దశరథుడు శ్రీరామునితో ధనమును, సేనను బంప గోరుట- కైక వ్యతిరేకించుట
37. రామలక్ష్మణులు నారచీరలను ధరించుట - అంతఃపుర స్త్రీలు రోదించుట- వసిష్ఠుడు కైకను నిందించుట
38. సీత నారచీరలను ధరించుట యనుచితమని దశరథుడు కైకను నిందించుట

39. దశరథుని విలాపము - సుమంత్రుడు రథమును గొని వచ్చుట- కోశాధిపతి సీతకు అమూల్య వస్త్రములు, ఆభరణములు నిచ్చుట- కౌసల్య సీతకు పతిసేవ నుపదేశించుట- రాముడు తల్లిని తండ్రికి శుశ్రూష జేయ మనుట- తల్లులందఱిని సెలవడుగుట

40. సీతారామ లక్ష్మణులు దశరథునకు ప్రదక్షిణ మొనరించుట- సుమిత్రాదేవి లక్ష్మణునకుపదేశించుట - సీతారామలక్ష్మణులు రథమెక్కి వనమునకు బోవుట - పౌరజన సంతాపము- రాజు రాణులు శోకించుట

41. శ్రీరాముని యరణ్య గమనముచే నంతఃపురస్త్రీల విలాపము - నగరపౌరుల వ్యాకులత

42. దశరథుడు నేలపై బడి రామునికై విలపించుట — కైకగృహమును వీడి దశరథుడు కౌసల్యాగృహమునకేగుట అచటగూడ రామునికై దుఃఖ మనుభవించుట

43. కౌసల్యాదేవి విలాపము

44. సుమిత్రాదేవి కౌసల్యాదేవిని యోదార్చుట

45. శ్రీరాముడు పౌరులతో అయోధ్యకు మఱలిపొండని దెలుపుట - వృద్ధ బ్రాహ్మణులు శ్రీరాముని మఱల యయోధ్యకు రమ్మని గోరుట
రాముడు వారలతో తమసా నదీ తీరమును జేరుట

46. శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై తమసానదీ తీరమున నిదురించుట- అయోధ్యను గుఱించి చింతించుట - పురవాసులు నిదురించుచుండగా వారిని విడిచి యరణ్యము వైపు బోవుట

47. అయోధ్యా పురవాసులు ఉదయమున లేచి రాముని గానక విలపించుట — అయోధ్యకు నిరాశతో మఱలిపోవుట

48. అయోధ్యా నగరవాసులగు స్త్రీలు విలపించుట
49. రాముడు నగరవాసుల మాటలను వినుచు కోసలదేశ మును దాటిపోవుట
వేదశ్రుతి, గోమతి, స్యందికా నదులనుదాటి సుమంత్రు నితో భాషించుట
50. మార్గమున రాముడు అయోధ్యను వనవాసమునకు అను మతి గోరుట- గంగాతీరము జేరి శృంగజేరి పురమున రాత్రి యచట నిదురించుట - అచ్చట నిషాద రాజు గుహుడు రాముని సత్కరించుట
51. గుహుని సమక్షమున లక్ష్మణుడు విలపించుట
52. రాముని ఆజ్ఞచే గుహుడు నావను దెప్పించుట సుమం త్రుని యయోధ్యకు బొమ్మనుట - తల్లిదండ్రులు మున్నగు వారికి దెలుపుటకై సందేశమిచ్చుట- సుమం త్రుడు దానును వనమునకు వత్తునని బలుకగా రాముడు వారించుట- సీతారామ లక్ష్మణులు నావయందు గూర్చొ నుట- సీతాదేవి గంగను బ్రార్థించుట - వారు గంగా నదిని దాటి వత్సదేశమును జేరుకొనుట - సాయంకా లము వారు ఒక చెట్టుక్రింద నిలుచుటకు బోవుట
53. రాముడు, లక్ష్మణుని అయోధ్యకు బంప బ్రయత్నిం చుట- లక్ష్మణుడు దిరస్కరించుట- తిరిగి రాముడతనిని వనవాసమునకు అంగీకరించుట
54. శ్రీరాముడు బ్రయాగలలోగల భరద్వాజాశ్రమమునకు బోవుట- భరద్వాజముని వారిని సత్కరించుట - చిత్ర కూటమున రాముని నివసింపుమని జెప్పి దాని మహాత్మ్య మును వర్ణించుట.

విషయసూచిక సమాప్తము

# వినయ వాక్యము

శ్రీమద్రామాయణము మహాకావ్యము. సంస్కృత భాషలో రచింపబడినది. రచించినది శ్రీ వాల్మీకులవారు. ఐదు వేల సంవత్సరముల క్రిందట వ్రాయబడినదని పెద్దలు జెప్పుదురు.

శ్రీమద్రామాయణమును భారతీయ భాషలలో ప్రపంచ భాషలలో ఎందరో మహానుభావులు ననువదించిరి. ఆంధ్ర భాషలో గూడ గద్య పద్య గీతికా రూపాలలో ఎందరో మహా కవులు గానముజేసిరి.

శ్రీమద్రామాయణము భారతీయ సాహిత్యమునకును, సంస్కృతికిని మూలము. ప్రతీక. రామాయణ కావ్యములోని నాయకుడైన శ్రీరామచంద్రుడు భారతీయులకు పరమదైవము పరబ్రహ్మ స్వరూపము. ఋషితుల్యుడు, ఆదర్శ మానవుడు.

తమ పుట్టిన బిడ్డలకు తెలుగుదేశములో శ్రీరాముని పేరు పెట్టుకుందురు. రామ మందిరము లేని గ్రామము తెలుగు దేశములో లేదని చెప్పవచ్చును. అట్టి శ్రీరామ చరిత్రమును తెలుగులో, తేలిక భాషలో, సామాన్యులు పాడుకొనుటకు వీలుగా గీతికా రూపమున వ్రాయుటకు బూనుకొంటిని.

వృత్తిచేత ఉపాధ్యాయుడ నైనప్పటికినీ, సంస్కృత భాషా పరిజ్ఞానము స్వల్పమైనప్పటికినీ, శ్రీరామునిపై గల భక్తి భావముచేతను, శ్రీమద్రామాయణమునందు గల ప్రీతి చేతను ఇట్టి మహత్కార్యమునకు బూనుకొంటిని. శ్రీరామ చంద్రుడే నా చేత యీ కార్యమును జేయించుచుండెనని నా భావన.

ముందుగా సుందరకాండమును, తరువాత బాలకాండ మును ప్రచురించితిని. ప్రస్తుతము అయోధ్యకాండమును రెండు భాగములుగా విభజించి మొదటి భాగమును ప్రచురించు

చున్నాను. రెండవభాగమును త్వరలో ముద్రింపగలని ఆశించు చున్నాను.

మిగిలిన రామాయణ కాండములనుగూడ ముద్రింపవలె నని నా యాకాంక్ష. నా కోరిక సఫలముజేయవలెనని పరబ్రహ్మ స్వరూపమైన శ్రీరామచంద్రుని వేడుకొనుచున్నాను.

ఈ గ్రంథములోని విశేషములు :

1. శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి, తేలిక భాషలో బాలుర కర్థమగు రీతిలో పాడుకొనుటకు వీలుగా రచించుటకు యత్నించితిని.

2. గీతికలుగా వ్రాయుటవలన స్వేచ్ఛానువాదమని భావింప వచ్చును. చేర్పులు, మార్పులు లేకుండా మూలము ననుసరించి వ్రాయబడినది.

3. 119 సర్గలలోనున్న అయోధ్యకాండను దాదాపు 2500 గీతికలలో బూర్తిచేయబడినది. రెండు భాగ ములుగా విభజింపబడినది.

4. ఇందలి ఛందస్సు చతురస్రగతి. మధ్యాంతరమున యతిగాని ప్రాసగాని యుంపబడినది. పాడుకొనుటకు వీలుగా పాదాంతమున గురువుంపబడినది. నాలుగేసి పాదములు మూడు లేక రెండు ఒక గీతికగా గుది గ్రుచ్చబడినది.

5. ఏ సర్గమున కాసర్గ విడదీయబడి, విషయసూచిక జేర్చ బడినది.

6. మూలమునందలి రెండు మూడు శ్లోకములను ఒక గీతి కగా గూర్చబడినది.

7. మున్యాశ్రమములో మహర్షి వాల్మీకి దగ్గఱ నేర్చుకొని వీధి గాయకులుగా గానముజేసిన లవకుశులే నా కాదర్శము.

ఈ గ్రంథ రచనయందు భాషలో, భావనతో, అచ్చులో కథా గమన పుష్టిలో ఎన్నియో దోషములుండవచ్చును. సహృదయులు తెలియబఱచిన సరిదిద్దుకొందును.

గీతికా రచనలోగాని, ప్రచురించుటలోగాని ఎట్టి యాటంకములు గలుగనందులకు శ్రీరామచంద్రునకు నా నమోవాకములు. తక్కిన రామాయణకాండలను గూడ యిదే రీతిగా ప్రచురింపవలెనని నా యాకాంక్ష.

శ్రీ వాల్మీకులవారు శ్రీమద్రామాయణ కావ్యమును రచించి ముద్దుగా కుశలవులచే బాడించిరి. అదే విధముగా విద్యార్థులుగూడ యీ రామాయణమును ముద్దుగా బఠించి గానముచేసి సంగీత సాహిత్యములను సంపాదించుకొనవలెనని నా కోరిక.

శ్రీ రామాయణ గ్రంథము భారతీయులకు బూజనీయమైనది. ఆది కావ్యము. అట్టి గ్రంథముయొక్క ఆత్మీయతను, వాల్మీకులవారి కవితా హృదయమును రామాయణములోని మహోజ్జ్వలమునైన పాత్రలను స్పృశించుటయే గాక, రామాయణములోని శిఖరాయమానమైన సుందరకాండ, బాలకాండ, అయోధ్యకాండలను బ్రచురింపగలుగుట నా పూర్వపుణ్య సుకృతమని భాగ్యమని భావించుచున్నాను. సహృదయులకు నమస్కారములు.

—రచయిత

# కృతజ్ఞతలు

ఆర్ష విజ్ఞానట్రస్టు, హైదరాబాదువారు ప్రచురించిన రామాయణ గ్రంథము నా యీ యయోధ్యాకాండము గీతికా రచనకు మిక్కిలి తోడ్పడినది. వారికి నా హృదయపూర్వక నమస్కృతులు.

అదే విధముగా ఆ గ్రంథమును టీకా తాత్పర్య సహితముగా వ్యాఖ్యానించిన ఆచార్య పుల్లెల శ్రీరామ చంద్రుడుగారికి నా వినయపూర్వక నమోవాకములు.

# శ్రీ రా మ క థా సు ధా ల హ రి

(బాలకాండ - గీతికలలో)

## ని వే ద న

శ్రీరామాయణ పుణ్యగథను జనచిత్తము హర్షము రంజిలగా!
మధుర పదములను మధుర భావముల మల్లెమాలగా నలరింపన్!
శ్రీగణేశ్వరుని జిన్మయభక్తిని జిత్తము బొంగగ స్మరియింతున్!
శ్రీభారతి గిరిజామ తల్లులను సిద్ధిని గోరుచు బ్రార్థింతున్!

ఆదికవులు శ్రీవాల్మీకులకిదె యలరి జేయుదును వందనముల్!
పూర్వకవులకును బుణ్యమతులకును బూర్ణభక్తి నే నర్పింతున్!
రామ కథను వ్రాసిన ఘనులకు నిదె రమ్య నమస్కృతు లర్పింతున్!
సీతారాముల భజించువారిని జేరికొలుతు నే నడుగడుగున్!

ఆసేతుహిమాచల పర్యంతంబును నలరెడి భారతదేశమునా!
భారతీయులకు బర మాదర్శము భవ్యరామ సీతాకథయే!
వారి మార్గమే యాధర్మము మఱి వారి చరిత దిగ్దర్శనమూ!
వారు నడిచినా మధుర మార్గమే వన్నెదెచ్చు జీవనధర్మం.

ముందుగ సుందర కాండను వ్రాసితి మోదమలరగా గీతికలన్!
బాలకాండమును బూర్తిచేసితిని వన్నెలు జిన్నెలు జిందగనూ!
చిన్ని మాటలను జిఱుత బాలురకు తీయని తీయని రాగములన్!
తెలియ జేయగను బూనుకుంటినీ తేనె లొలికెడీ గీతికలన్!

రామాయణమది మహాసముద్రము రంజిలు హిమగిరి శిఖరమదీ!
తేట తెలుగులో మహాత్ములెందరొ తెలియగ వ్రాసిరి విశదముగా!
సకల శాస్త్రములు విననేలా? మఱి సర్వగ్రంథముల శ్రమయేలా?
రామాయణమది విన్నజాలు! భువి రాజమార్గమగు జీవనమున్!

అందులకే నే నఖిల దేవతల యారాధనలను జేసితినీ!
పదములు నిమ్మని భావము లిమ్మని భారతాంబ నర్థించితినీ!
ఇష్టదైవమగు నిందిరారమణు నిహపరమిచ్చెడి రఘుపతినీ!
భక్తిభావమున శిరమును మోడ్చితి భావమునందున నిలువమనీ!

ఎట్టి పుణ్యమును జేసితినో మఱి యెట్టి సుకర్మలు జేసితినో!
గట్టిగ యా శ్రీరాముని చరితము బట్టువడెను నా మనసునకున్!
మధురాక్షరములు పదురపదములై మంజుల గీతముగా వరుసన్!
లయతాళములను నృత్యము చేసెను లలితరాగ మధురోక్తులతోన్!

అల వాల్మీకులు వ్రాసినదానిని యా శ్రీరాముని సభయందున్!
వీధిగాయకులుగా కుశలవులును విమలగానమును జేసినదీ!
ఆ పాటను నే దెనుగున బాడితి నమరగానమును జేయంగన్!
తెలుగు బాసలో తేటతెలుగులో దెలుగు బాలకులు బాడుటకున్!

కఠిన పదములకు దూరముగా నే కఠిన భావముల జొరనీకన్!
బాలకులగు నా కుశీలవులనే భవ్యాదర్శముగా గొనుచున్!
శ్రీరాముని మహనీయ చరితమును జేయగ బూనితి గేయముగా!
బాలురు వృద్ధులు బాడుకొనుటకై భవ్యరాగలయ తాళములన్!

భారతదేశమునం దణువణువును భవ్యరామ శుభచరితంబున్!
పాడుకొనును శ్రీరామరామ యని భవ్యరాగలయ తాళములన్!
గాలికదలికల వినిపించును నా కమ్మని రాముని నిస్వనముల్!
అట్టి కథను నే రచింప బూనితి ఎట్టిసుకృతినో యీ జన్మన్!

సుందరకాండను బ్రచురించితినీ సురుచిరమగు నిదె చందనమున్!
బాలకాండ బ్రచురించితి నిప్పుడు బాలకులందఱు బాడుకొనన్!
మిగిలిన కాండల నైదును బాడగ సాగిలబడి సీతారమణున్!
కోరుచుంటి నాయువు నారోగ్యము గూర్మి భావనా శక్తియునూ!

శ్రీకరమగు శ్రీరామ కథను నే శ్రీలు జిందగను లిఖియింపన్!
పూనుకొంటి నో దేవతలారా పూర్ణమైన కరుణను జూపి!
చిక్కని మక్కువ సురచిర భాషను చక్కని భావము లందించి!
అందుకొనగ నే ననదృశ కీర్తిని యా శ్రీరాముని జేరుకొనన్!

సిద్ధివినాయక! చిత్తము రంజిల శిల్పి వోలె నా మదియందున్!
శ్రీరామాయణ చిత్రమందిరము జేయుచుంటి శక్తిన్ రక్తిన్!
ఒక్కొక్క చరణము నందియిమ్ము నే మక్కువ తోడను నిర్మింతున్!
మధురాక్షరములు మధురభావములు మానసంబు జిందులు ద్రొక్కన్!

కన్నతల్లివని కలల యందునను గాంచుదుకద! భారతి! వాణీ!
అంధకారమును దొలగజేసి న న్నాదరింపు వీణాపాణీ!
హృదయకమలమున నడుగిడి దయతో హృదివెన్నెలను గావించీ!
కావ్యకన్యకను గమనీయముగా కాంచన కుసుమము గావింపూ!

ముందుగ సుందరకాండను వ్రాసితి మోదమలిరగా గీతికలన్!
బాలకాండమును బూర్తి జేసితిని బ్రకటించితి గీతికలందున్
అయోధ్యకాండను వ్రాసితినిప్పుడు నలరుచు బ్రకటించుచు నుంటిన్
చిన్నిగీతికల జిఋత బాలురకు తీయని తీయని రాగములన్!

మిగిలిన నాలుగు కాండలగూడను మెత్తని మధురాక్షరములలో
తెలుగు భాషలో వ్రాయబూనితిని తీయగ బాడగ బాలకులున్!
కోరుచుంటి నాయువు నారోగ్యము కూర్మి భావనా శక్తియునూ
సాగిలబడి నే మ్రొక్కుచుంటినీ చక్కని సీతారాములకునూ!

★ ★ ★

# శ్రీరామకథా సుధా లహరి

## అయోధ్యాకాండము – ప్రథమ భాగము

## (శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి గీతికలలో)

### మొదటి సర్గము

[దశరథుడు శ్రీరాముని యువరాజుగా జేయ నాలోచించుట]

శ్రీవాల్మీకుల రామాయణమున శ్రీమదయోధ్యా కాండంబున్
సేయుదు తెనుగున జిన్మయ భక్తిని జిరశాంతిని కైవల్యంబున్
బొందునటుల నే సర్వదేవతల బొలుపుగ ప్రార్థనలను జేసీ!
శ్రీగణేశ్వరుని మదిని దలంచుచు సీతారాముల కథ వ్రాతున్!

శ్రీరాముని హృదయానుభావుడును ప్రీతిపాత్రు డా భరతుండున్
మేనమామలా గృహమున కేగుచు మేలిమి దమ్ముడు శత్రుఘ్నున్!
ప్రేమపూర్వకముగా దన వెంటను బ్రీతినిగొని చనె మాతులతోన్!
రామలక్ష్మణులు ననునట్టుల యా రమ్య యాత్ర శోభింపంగన్! 1

తాతచేతనూ, మామచేతనూ తగు సత్కృతులను నందుచునూ!
పుత్రభావమున లాలన నందుచు భూరి తేజు డా భరతుండున్!
సుఖసౌఖ్యములను ననుభవించుచును సోదరుడగు శత్రుఘ్నునితో
సరససాహితీ సంగీతంబుల సత్పురుషుల సాంగత్యముతో! 2

తాత దీవెనల నందుచు రోజును సద్గోష్ఠులలో దేలుచునూ!
సుఖసౌఖ్యంబుల దేలుచు నున్నను శుభకరులగు నా సోదరులున్!
వృద్ధుడైన తమ తండ్రిని దలచుచు సిద్ధులైన దపసులకు వలెన్!
మనసున దలచుచు మటిమటి భక్తిని మాదుర్యము లరి బొంగారన్! 3

మహాతేజుడగు దశరధుండునూ మహిమాన్వితులును, విక్రములా!
ఇంద్రవరుణ సములగు దనపుత్రుల సాంద్ర దీప్తులును సాహసులా!
అల భరతుని శత్రుఘ్నుని దలచుచు నలరుచుండె దన మనసుననూ!
దేశాంతరమున నున్నవారిసీ ధీరులైన యరి భీషణులన్! 4

ప్రాణులందు నా బ్రహ్మదేవువలె ప్రజ్ఞావంతుడు ధీనిధియున్!
రామునందు నా దశరథరాజుకు రమ్యమైన ప్రీతియు నుండెన్!
రాక్షసవధకై పుట్టినాడుగద రమ్య శీలు డా రాఘవుడున్
విష్ణుమూర్తి యంశమున జనించెను వేదవిదుల ప్రార్థనమీదన్! 5

తేజోవంతుడు శ్రీరాముని గని తేజస్విని కౌసల్యయునూ!
వజ్రపాణినీ కన్న యదితివలె వన్నెలు జిందెను సుశ్రీలన్!
సుందరుడును శుభకరుడు విక్రముడు శుభశీలుడు సత్పురుషుండున్
సాటిలేని కొమరుండుగదా మఱి సరస గుణాఢ్యుడు లోకమునన్! 6

ప్రసన్న చిత్తుడు, మృదు భావకుడును బల్లవింప సంభాషించున్!
పరుష వాక్యములు బరులు బలికినను బలుకడు ప్రత్యుత్తరములతో!
మంచి మనసుగల రాము డెపుడునూ మది సంతోషించుచు నుండున్
ఇతరులు జేసిన యపకారంబుల నెంచడు మదిలో క్రోధమునన్! 7

అస్త్రాభ్యాసము జేయు సమయమున యలరెడి యవకాశమునందున్!
శీల వృద్ధులను, జ్ఞాన వృద్ధులను, వయోవృద్ధులను వలనొప్పన్!
సజ్జన గోష్ఠుల జరుపుచుండు నట సాధు జనుల దర్శించుచునూ!
ఆత్మీయతతో నలర జేయుచును నానందము గలిగించుచునూ 8

మధురభాషి, బహుబుద్ధిశాలి మఱి మాటాడును దా ముందుగనే!
ప్రియముతోని భాషించు నొరులతో ప్రీతిని జేయును సత్కర్మన్!
అనంతవిక్రమ పరాక్రముండును నైన వినయమును గనబఱచున్!
అతిశయ విక్రమమును జూచుకొనీ యలరడు గర్వమునను మిగులన్! 9

అసత్యమాడడు నన్ని విషయములు నాత డెఱుంగు, విద్వాంసుడున్!
వృద్ధుల కెపుడును ప్రతిపూజకుడను వృద్ధి గోరు ప్రజలందఱికిన్!
ప్రజల నెంత ప్రేమించెడినో మఱి ప్రజలుగూడ శ్రీరాఘవునీ!
అంతప్రేమ గనబఱతురు వారును నంతరంగమున సత్ప్రీతిన్! 10

దయాంతరంగుడు, క్రోధ మెఱుంగడు ధార్మికులను సన్మానించున్!
బ్రాహ్మణులను నెదురేగి గొలుచు దా బాధజెందు దీనుల గనుచున్!

ధర్మజ్ఞుండును, బరిశుద్ధుండును ధార్మిక విషయంబుల నెఱుగున్!
ఆత్మ సంయమము గలవా డాతడు నలరును సద్విషయము లందున్!

కులోచితంబగు క్షాత్రధర్మమును గూరిమి పాలింపగ నిష్ఠన్!
విశ్వసించు నదె స్వర్గఫలంబును విమల కీర్తి ప్రాప్తించుననీ!
అశ్లీలములగు కార్యము లందున నాసక్తింతయ జూపడుగా!
ధర్మవిరుద్ధములగు మాటల దా దత్త చిత్తుడును గాడుగదా! 14

వరుసగ మధురోక్తులచే నాతడు వచించు వాచస్పతి వోలెన్!
ఆరోగ్యము గల యువకు డాతడును అతి వాక్చతురత గలవాడున్
అందమైన దేహముతో నలరును వన్ని విషయముల గుర్తెఱుగున్!
దేశకాలముల దెలిసిన వాడును ధీరమానసుడు లోకమునన్! 15

అట్టి గుణములను గూడిన వాడై యా రాముడు ప్రజలకు ప్రియుడై
బహిఃప్రాణమై వర్తిలుచుండును భళియని జేజేలను బలుకన్!
విద్యాభ్యాసము బూర్తి చేసికొని విమల సాంగవేదము నందున్
ఆరితేరె నా భరతాగ్రజుడును నల తండ్రిని దా మించినటుల్! 16

సద్వంశంబున బుట్టిన రాముడు సాధుస్వభావుడు ధీరుండున్!
దీనత్వంబును లేనివాడునూ దివ్య ప్రవర్తన గలవాడున్
ధర్మార్థంబుల దెలిసిన విప్రుల దగు శిక్షలచే దెలిసికొనెన్!
మఱువక యాచరణంబు జూపుచును మహితాత్ముడు శ్రీ రాఘవుడున్! 17

ఆ రాముడు నణకువ గలవాడును నలరి దాచు నాలోచనలన్!
సమయస్ఫూర్తిని మాటలాడునూ సాయము జేయును నితరులకున్!
క్రోధ హర్షముల వ్యర్థము జేయడు గూర్మి జూపు ప్రజ కెల్లరకున్!
దాన మెపుడు జేయగవలెనో యది ధర్మనిదుడు రాఘవు డెఱుగున్! 18

పెద్దల దృఢభక్తిని సేవించును ప్రీతి జూపు జిన్నలయందున్!
మొండి బట్టుదల లేదాతనికివి మోసపు మాటలు బలుకడుగా
ఏమరు పాటును సోమరితనమును నించుక లేదాతని యందున్
పరుల దోషమును తన దోషములను బరికించును దా సద్బుద్ధిన్! 19

శాస్త్రజ్ఞుండును స్థిరప్రజ్ఞుండును జపలము నించుక గనరాదూ!
చేసిన మేలును మఱువకుందునూ చెలగి తారతమ్యంబులనూ
యథా న్యాయముగ దుష్టశిక్షణము శిష్ట రక్షణము గావించున్!
సత్పురుషుల దా జేరదీయునూ సన్మార్గుల సంరక్షించున్! 20

సంపాదింపను వ్యయము జేయగను శాస్త్రోక్తముగా నత డెఱుగున్!
శాస్త్రసమూహము లన్నియు నెఱుగును! సరసత ప్రావీణ్యము నెఱుగున్!
అర్థ ధర్మముల నాచరించు ముందామీదట భోగములందున్!
అలసత్వంబుల నంటడు ముట్టడు నందును స్ఫూర్తి వివేకములన్! 21

సంగీతంబున సాహిత్యంబున సరస గీత నృత్యాదులలో!
చిత్రకళల నెఱిగిన వా డాతడు స్థిర ప్రజ్ఞా పరిపూర్ణముగన్!
అర్థ విభాగము జేయగ నెఱుగును నన్ని విషయముల నాసక్తిన్!
గజ తురగంబుల లొంగదీసికొను కర్మల నెఱిగెడి చతురతయున్ 22

ధర్మము కొఱకును కీర్తి కొఱకునై దగ లౌకిక వ్యవహారములన్!
తన కొఱకును దన స్వజనము గొఱకును దా జేయగ వలె భాగములన్!
ఐదు భాగముల వ్యయము జేయు దా నాత దందు నిహపరములనూ!
విజయములను సాధించు నాత డిల విమలకీర్తి దిక్కులు వెలయన్! 23

ధనుర్వేదమున శ్రేష్ఠుడైన యా ధర్మజ్ఞుని శ్రీ రాఘవుని!
అతిరథు లందఱు ప్రశంసించెందరు నా రాముని నేర్పును గనుచున్!
సేనావాహిని నడిపి శత్రువుల భేదించెడి నేర్పును గలుగన్!
విజయములను సాధించెడి వా డిల విమల కీర్తి దిక్కులు వెలయున్! 24

అనిలో నిలిచి గెలువజాలరుగ యా సురా సురులు క్రోధమునన్!
అసూయ యించుక లేదాతనికిని నల్పక్రోధంబును నట ద్రుంచెన్!
గర్వము మత్సరమును లేకయునూ కాలము నెఱుగుచు వర్తించున్!
ఏ ప్రాణిని గూడను హింసింపడు నెంచు దనదు ప్రాణము వోలెన్ 25

ఇట్టి శ్రేష్ఠ గుణముల వర్తిల్లును నిల ప్రజలకు హితయుక్తుండై
మూడు లోకములకును ఋజ్యుండై మునులు ఋషులు మది మెచ్చగనూ।

క్షమాగుణము భూదేవి తోడుతను క్షాత్రంబున దేవేంద్రునితో!
బుద్ధిని బృహస్పతికి సమతుల్యుడుతే జమునందున సూర్యువలెన్! 26

రాఘవు డీ విధి దశరథునకునూ రహి ప్రజాళికిని ప్రీతుండై!
ఉన్నత గుణముల రాజిలుచుండెను నుర్వియు గోరెను నాధునిగా!
శత్రుమర్దనుండగు దశరథుకును సౌమ్యవర్తనుని సుతు గాంచి!
ఈ విధముగ తా నాలోచించెను నింపుగ తన హృదయము నందున్! 27

నే జీవముతో నే బ్రతికుండగ నిర్మలుడగు నా రాఘవుడున్!
రాజగునా? కనులార జూతునా రహి యభిషిక్తుగ కోసలకున్!
ఈ యానందము బొందుదునా నే యీ నా కోరిక దీరెడినా!
అని యీ విధముగ మధుర చింతనలు మానసమందున నుదయింపన్ 28

ప్రజాభి వృద్ధిని గోరువాడునూ ప్రాణికోటి దయ దర్శించున్!
వర్షమేఘమునకును వలె నందఱ హర్షమునను దేల్చెడి వాడున్!
యమదేవేంద్రులవలె బరాక్రముడు నలరు బృహస్పతితో బుద్ధిన్
ధీరత బర్వత సము డా రాముడు ధీనిధి నా కంటెను గూడన్! 29

నా తనయుడు నా ప్రియతమ సుతుడూ నా రాముడు నీ రాజ్యమునూ!
బరిపాలింపగ కనుల జూతునా బన్నుగ స్వర్గము నందుదునా?
రాముని శీలము వర్తనలను గని రయమున యువరాజును జేయన్
మంత్రులతో మంతనము జేయగా మహీపాలు డాలోచించెన్! 30

భూమ్యాకాశములందు గాన్పడెను బొంకమైన యపశకునములున్!
వృద్ధాప్యంబును దాపురించినది మొద్దుబారె నా బుద్ధియునూ
అని మంత్రులతో జెప్పి దశరథుడు నా శ్రీరాముని యువరాజున్!
జేయగా దనదు జింతయు. శోకము జెదిరిపోవునని దలపోసెన్! 31

ధర్మాత్ముడునగు దశరథ భూపతి తనదు బ్రజల శ్రేయస్సునకై!
తగిన కాలమును బ్రాప్తించెననీ తన మనసున యాలోచన జేసీ!
రాముని యువరాజుగ జేయుటకై రాజుల నందఱ బిలిపించెన్!
నగర గ్రామముల యధికారులనూ యధిపతులను వే కబురంపెన్! 32

కీర్తివిస్తరుడు దశరథు డంతట కేకయరాజును జనక విభున్!
ఆహ్వానింపగ బేదు దూరమని యతి తొందరలో వారలనూ!
ఈ శుభవార్తను దదుపరి విందుకు నింపుగ ననుచును మదితలచెన్!
వచ్చిన రాజుల యధిపతులందటి మచ్చిక సత్కృతు లొనరించెన్! 33

అంతట దశరథు దలంకరించుకు నలరి ప్రజాపతికిని బోలెన్!
వచ్చిన రాజుల నందణి జూచెను వరుసగ సంభావించుచునూ!
ఆరాజులు భయ యాసనంబులను నభిముఖులై గూర్చుని రపుడూ!
ఆలకింపగా నరేంద్రు బలుకులు నాత్మీయత బొంగారంగన్! 34

తగువిధమున సత్కారములందీ దగ నగర ప్రముఖ్యుల చేతన్
పౌర జానపదముఖ్యుల చేతను బన్నుగ సత్కృతులను బొందీ!
వినయాన్వితులగు రాజుల మధ్యను నిమల భావమున దశరథుడున్
దేవతాగణము మధ్యన యుండిన దివిజేంద్రుని వలె భాసించెన్!

అయోధ్యకాండము, 1వ సర్గము సమాప్తము

* * *

# అయోధ్యకాండము-1వ భాగము

## 2వ సర్గము

[రాముని పట్టాభిషేకమును గూర్చి దశరథుడు సభాసదులకు
విన్నవించుట—వారు హర్షముతో ఆమోదించుట]

అంతట వసుధాధిపుడగు దశరథు డా మంత్రితులగు నృపతులనూ!
సంబోధించుచు ప్రథిత వచనముల స్పష్టార్థముగా నిటు లనియెన్!
దుందుభి స్వనమున మేఘధ్వనినిలె మృదువుగ తన కంఠము నెత్తీ!
గ్రామ నగర పుర యధికారులతో కరము ప్రీతి నిటులను బలికెన్! 2

ఉత్తమ మగు నా రాజ్య భాగమున యుత్తములగు నా పూర్వులునూ!
ఎటు బాలించిరొ సౌఖ్య వర్తనను నింపొందగ మీ రెఱుగుదురూ!
ఇక్ష్వాకులు బాలించిన పుడమిని నింకను సుఖముల గూర్పగనూ!
ప్రజాభ్యుదయమును సమకూర్చగ నే పండిన మనసున గోరెదనూ! 3

పూర్వ నరేంద్రులు నడచిన బాటను బొలుపుగ నేనును నడిచితినీ!
యథాశక్తి నావలనను గూడను నభిరక్షితులును నైరి ప్రజల్!
లోకహితంబును నాచరించుచును శోక రహితముగ జేయగనూ
రాజ్యభారమున నా జీవితమును రహి జీర్ణమునై పోయినదీ! 3

వేల వర్షములు బరిపాలించితి విమల యశస్సును బొందితినీ!
జరా జీర్ణమగు నీ శరీరమును శ్రాంతిని బొందగ కోరెదనూ!
రాజ్యభార మది ధర్మభార మది రహి మోయుట యతి దుర్లభమూ!
శౌర్యధైర్య విక్రమము జేతనే సాధ్యమగును నది నిలుపుకొనన్! 4

జితేంద్రియులు మాత్రము భరింతు రీ స్థిరమగు ధర్మసుభావమునన్
ధర్మభారమును మోసి మోసి నే తగ నలసితి నో ప్రియులారా!
అంత రంగికులు వసిష్ఠాదులను నంగీకారములను బొందీ!
పుత్రుని రాజుగ జేసి పొందెదను బూనికతో విశ్రాంతి యిలన్! 5

మహాత్మజుండగు శ్రీరఘు రాముడు మహితాత్ముడు శుభకాముడునూ!
అవక్రవిక్రమ పరాక్రముండును నసదృశ తేజో బలుదతడున్!
అతని రాజుగా జేతు నయోధ్యకు నలరి ప్రజల బరిపాలించున్!
అనుజాతుడు నాగుణము లన్నిటిని యధిగమించినా వాడుసుమా! 6

పుష్యమి నక్షత్రముతో గూడిన పున్నమి చంద్రునివలె నుండున్!
ధర్మరక్షకుడు పురుషశ్రేష్ఠుడు దగ నతనిని రాజుగ జేతున్!
మూడులోకముల మోదమునందును మునులు ఋషులు మఱి దేవతలున్!
అట్టి రాముడే యీ రాజ్యంబును గట్టిగ నేలగ దిట్ట సుమా! 7

రాజ్యభారమును నప్పగించెదను రాముని కిపుడే ముదమందన్!
లోకమునకు హితకార్యము జేసెద లోకప్రజలు నను గొనియాడన్!
ఆలోచించుచు దెలుపుచుంటినీ యరమర లేకను స్పష్టముగా!
మీకు దోచినది తెలుపుచు మీరలు మిగుల హర్షమగు బలుకులనూ! 8

రాజేంద్రుడు బలికిన పలుకులు విని రయమున రాజులు ప్రముఖులునూ!
మేఘములను గని మయూరములు వని మిగుల హర్షమును జెందునటుల్!
భవనమంతయును ప్రతిధ్వనించెను 'బాగు!' 'బాగు!' నను వాక్యములన్!
అభినందించిరి రాజు లందఱును నాదశరథునీ బొగడుచునూ! 9

బ్రాహ్మణులును మఱి నరేంద్రులందఱు బరగ గ్రామ పుర వాసులునూ!
ధర్మార్థములను నెఱిగిన వారలు ధార్మికులగు వారందఱునూ!
భూవల్లభు డట జెప్పినదానిని బొంకముగా నాలోచన జేసీ
ఏకాభిప్రాయమున రాజుతో నిట్లని బలికిరి మోదమునన్! 10

'నేల వర్షములు బాలించితివీ విమల ధర్మభావము తోడన్!
రాముని యువరాజుగ కోసలకును నయముగ జేయుము నభిషిక్తున్!
మహాబాహువులు గల యారాముడు మహాగజముపై గూర్చుండీ!
శ్వేత ఛత్రమున బోవుచుండగా శీఘ్రము జూడగ మా కాంక్షల్! 11

వారి మాటలను విని దశరథుడును వరుసగ వారలతో ననియెన్!
తెలిసియు వారల మనోభీష్టమును దెలియని వానిగ యిటు లనియెన్!

నామాటలు విని నామాటలనే నయముగ బలికిరి యని దోచెన్!
మనసునందుగల యభిప్రాయమును మఱి బలుకుడు నతి నిర్భయతన్! 12

ధర్మమార్గమున నే బాలింపగ ధార్మికుదగు నా రఘురామున్!
రాజుగ జేయగ కోరుచేల మఱి రహి నామది సందేహమునూ!
దీర్పుడంచు నారాజు బలుకగా దీయని మాటల ప్రజలనిరీ!
రాముడు సుగుణుడు! అనంతగుణుడును యఖిలప్రజల ప్రియపాత్రుడునూ!

దేవసముడు ధీమంతుడు సుగుణుడు దీరోదాత్తుడు విక్రముడూ!
అతని గుణము లందఱికి నచ్చినవి యానందము గలిగించునవీ!
దివిజేంద్రునితో సము డాతడు సుమ ధీరసత్వ వాగ్వినయుండున్!
ఇక్ష్వాకుల భూవిభు లందఱిలో వినయ తేజుడా రాఘవుడున్! 14

సత్యధర్మ పరిపాలకు డాతడు సత్పురుషునిగా బేరువడెన్!
ధర్మార్థములను వేఱు జేయకను దా జూచును శ్రీరాఘవుడున్!
సుఖము గూర్చుటను చంద్రుని తోడను సుగుణములను బృధివిని బోలున్!
బుద్ధికి బృహస్పతితో బోలును భూరి బలంబున శక్రునితో! 15

ధర్మజ్ఞుడు సత్యము బాలించును శీలవంతు దనసూయకుచున్!
క్షాంతుడు సాన్త్వయనాపకుండునూ సరస మృదుల పరిభావకుడున్!
కృతజ్ఞుడును మఱి విజితేంద్రియుడును మతిమంతుడు మంగళప్రదుడున్!
స్థితప్రజ్ఞుండును ప్రాణిహితుండును బిందించును ప్రియవాక్యములన్! 16

బహుశ్రుతుఁడును నగు వృద్ధ బ్రాహ్మణుల బహుసేవలు జేయుచు నుండున్!
ఆ విధమగు సేవలచే నాతని నలరె యశస్సులు నలుదిశలున్!
దేవాసురులకు దెలిపిన యస్త్రపు దీప్తులన్నియును నత డెఱుగున్!
విద్యలన్నియును బూర్తి చేసికొని వేద విద్యలను దా నెఱిగెన్! 17

సంగీతమునం దాతడు శ్రేష్ఠుడు సరస లలిత కళలందుననూ!
అభిజనమంతయు నుత్తమమైనది యత డెన్నడు దీనత గొనడూ!
వేదవిదులచే శిక్షణ నందీ వినుతికెక్కినా వా డతడున్
దైన్యము నెప్పుడు బొందడు మనసున ధీరత నెన్నడు బాయడుగా! 18

యుద్ధమందు విజయము సాధించును సిద్ధిబొందు నే కార్యమునన్!
పౌరులందఱిని గుశలము అడుగును బంధువునకు వలె సంప్రీతిన్!
స్నేహితులకువలె క్షేమము అడుగుచు చిరస్నేహితముగ సరసముగా!
లక్ష్మణు డెపుడును వెంటనె యుండును లాలితముగ బహిప్రాణముగా !19

భార్యా పుత్రుల అన్నదమ్ములను నతి ప్రేమను గుశలము అడుగున్!
శిష్యగణములను భృత్యకోటులను స్థిర కల్యాణములను గోరున్!
అగ్నిహోత్రముల యనుష్ఠాదులను నలరి మంచి చెడుగుల నడుగున్
అందఱు తమ తమ కార్యములన్నియు చందముగా జేయుట యరయున్!

జను లాపదలను నుండ జూచి దా సరగున గుందును దుఃఖమునన్!
అభ్యుదయమునం దానందించును నయ్యా వోలె సంతోషమునూ
సత్యవాది మఱి మహావీరుడును నిత్యము బెద్దల బూజించున్!
చిఱునవ్వుల జిందించుచు బలుకును జితేంద్రియుడు శ్రీరాఘవుడున్! 21

ధర్మము నెప్పుడు సంరక్షించును దగ కాపాడును నాశ్రితులన్!
కలహము బెంచెడి మాటల నాడడు, గాంచును సమముగ సర్వులనూ!
యుక్తికి పైనీ యుక్తి జూపుచును రక్తిని జక్కగ బలుకుచునూ!
బృహస్పతిని మఱిపించును రాముడు సహనము జూపును నన్నిటిలో! 22

లోకమునకు నభిరాముడు రాముడు లోక ప్రజల శుభకాముండున్!
అందమైన కనుబొమలను నొప్పును చందమైన శుభ నేత్రములన్!
శౌర్య వీర్యములచే శ్రీరాముడు సాక్షాద్విష్ణువు ననిపించున్!
ప్రజాపాలనము జేసిన వాడును ప్రజ్ఞానిధి సర్వజ్ఞుడునూ! 23

చెడు మార్గమును బోడు రాఘవుడు జెదిరిపోదు మన సెప్పుడునూ!
సత్యపథమునను జరించు నెపుడును సాహస మెపుడును విడువడుగా!
మూడు లోకముల బాలింపగ దగు ముదితాత్ముడు శ్రీరాముండున్
భూలోకంబును బాలించుట యది భూరి విక్రమున కెంత యదీ! 24

క్రోధమునందును బ్రసాదమందును గూరిమి నొదలడు ధర్మమునూ!
యథావిధిని ధర్మాచరణంబును యథారీతి దా నొనరించున్!

రాము డెవనిపై దయగొనునో మఱి రయమున బొందును సంపదలన్!
రవిబింబమువలె సర్వ ప్రజలకును రహిశాంతిని కాంతిని గూర్చున్! 26

అట్టి గుణాఢ్యుడు నమృత సమానుడు నా రాముని దమ ప్రభువునుగా
ప్రజలుగోరుచున్నారలు నదిగో ప్రజల వాంఛితము మన్నింపు!
మహారాజ! నీ పూర్వ పుణ్యమున మానుగ రాముడు దనయుడుగా!
జన్మించెను సుమ! లోకరక్షణకు సాక్షాత్ విష్ణువు నంశముతో!
మరీచిమునికి కౌశ్యపునకువలె మఱి నీకును బుత్రుండయ్యెన్!
పుత్రలక్షణము లన్నియు గలవూ పుడమికి రాజుగ జేయు మికన్! 27

ఆయువు నారోగ్యములు గలుగగా నా రాముని శుభమును గోరీ
రాష్ట్రప్రజలు గోరుచు తమ మదిలో! రమ్య నమస్కృతు లొనరించీ!
సకల దేవతలకును మ్రొక్కుచునూ సరసమైన తమ కోరికతో
రాముని రాజుగ జేయు మనుచునూ రామరాజ్యముగ జేయమనీ! 28

వృద్ధ మహిళలును, యువతులు గూడను వృద్ధిని గోరుచు రామునకున్!
సకలదేవతల నారాధింతురు సాయం ప్రాతః సంధ్యలలో!
మహారాజ! ఓ దశరధరాజా! మధురమైన ప్రజ గోరికనూ!
నీ కృపచేతను దీరును గావుత! నీ మది కోరిక నెఱవేరన్! 29

సర్వశత్రు సంహారకుడైనా సాక్షాత్ విష్ణువు నంశముతో
రాముడు రాజుగ నుండగా ధరను రహి ప్రజ చూచెడు గాత! యికన్!
సర్వలోక హితుడైన రామునీ సరగున జేయుము! రాజుగనూ!
మా హితమును, సంతోషము కొఱకై మహితాత్ముని శ్రీ రాఘవునీ! 30

(2వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము - మొదటి భాగము

## 3 వ సర్గము

[రాముని రాజ్యాభిషేకమునకు సన్నాహము
రామునకు దశరధుడు హితోపదేశము చేయుట]

పౌర జానపద శ్రేష్ఠు లా విధము బలికి కృతాంజలితో నున్నన్
వారల ప్రియహిత వచనములను విని వారల కీ విధి దశరథుడున్!
పలికెనహో! నాభాగ్యము! భాగ్యము! బన్నుగ మీరందఱును నిటుల్
రాముని రాజుగ జేయ గోరగా రహి నే సంతస మందితినీ! 1

వారి నీ విధము ప్రత్యర్చనలను వరుసగ వారందఱు వినగన్!
వసిష్ఠాది బ్రాహ్మణులను మఱియును వామదేవునీ బరికించీ!
చైత్ర మాస మిది! పుణ్యప్రద మిది! చిరసౌభాగ్యము గూర్చునదీ
యువరాజుగ వే జేతము రాముని సర్వము జేయుచు సిద్ధముగన్! 2

రా జీ విధముగ బలుకగ పౌరులు రయమున సంతోష ధ్వనులన్ః
ఆకసంబు జిల్లులుబడ జేసిరి యానందము బెల్లుబుకగనూ!
జనఘోషము శాంతించిన బిమ్మట వినయముతో నా దశరథుడున్
వసిష్ఠమునితో నిట్లని బలికెను వావిరి ప్రజలందఱు వినగన్! 3

భగవంతుడ! మన రామచంద్రునకు దగ యభిషేకము సేయుటకున్
సర్వకార్యములు జేయుట కొఱకై సరగున దగువారిని యాజ్ఞన్!
నియమింపుం డన వసిష్ఠు డంతట నిలిచిన రాజుల నందఱినీ!
అధికారులతో నిట్లని పలికెను నతి ప్రేమాదర ములతోడన్! 4

సువర్ణమును, రత్నములు, వెండియును సర్వౌషధములు, పూమాలల్,
పేలాలను. నేతిని, తేనియనూ పేరిమి నూతన వస్త్రములున్!
రథము, సకల యాయుధముల తోడను రహి చతురంగ సుసైన్యమునూ
శుభలక్షణములు గల యేనుంగును శుభకర వింజామరలు నికన్! 5

ధ్వజము శ్వేతఛత్రము నిక తెండీ! దగ బంగారపు కుంభములున్!
బంగరుకొమ్ముల వృషభంబును మఱి రంగుగ వ్యాఘ్రపు చర్మంబున్!
అగ్న్యాగారము నందు నుంపుడూ రయమున ప్రాతఃకాలమునన్
అభిషిక్తమునకు వలసిన వస్తువు లన్నియు గూర్పుడు నీ రాత్రిన్! 6

అంతఃపుర ద్వారముల నన్నిటిని నలరి కడిగి పన్నీరులతో!
చందనాదులను పసుపు కుంకుమల చారు సుగంధ సుమాల్యములన్!
అలంకరింపుడు నందఱు జూడగ యానందింప సువాసనలన్
వీధులన్ని జల్లింపుడు నీరము విమల సువాసనలును గలుగన్! 7

వేలకొలది బ్రాహ్మణులకు సరిపడు విమలాన్నము బాలును బెరుగున్!
సిద్ధము జేయుడు నట్టియన్నమును స్థిరమగు శ్రద్ధాభక్తులతోన్!
వేదవిదుల కర్పణము జేయవలె విమల ప్రభాతము సమయమునన్!
పాలు, పెరుగు, పేలాలు, ఘృతంబును బన్నుగ దక్షిణలను గూడన్! 8

సూర్యోదయమున స్వస్తివాచకము శుభకరముగ జరుగును గానన్
బ్రాహ్మణోత్తముల బిలిపింపగవలె బన్నుగ యాసనములు గూడన్!
పురమున దోరణములు గట్టింపుడు బురవీధులు నీరము జల్లన్!
రమ్య నర్తకీమణులు రావలెను రాజభవన ద్వారము గడకున్! 9

దేవళముల యందును జైత్యములను దేవతలను బూజింపవలెన్!
అన్న భక్ష్యములు పూమాలలతో నట సిద్ధముగా నుండవలెన్!
యోధులందఱును గవచధారులై సాయుధులై తగ శిక్షితులై
మహారాజ ప్రాసాదము ముంగిట మానుగ నిలిబడి యుండవలెన్! 10

అటుల వసిష్ఠుడు వామదేవుడును నాజ్ఞాపించిరి సకలంబున్!
ఆ విషయంబును రాజుకు దెలిపిరి యటుపై జేసిరి సకలంబున్!
వసిష్ఠ దేవుల యాజ్ఞప్రకారము వరుసగ పనులన్నియు జరుగన్!
దశరథరాజుకు దెలిపిరి మంత్రులు దగనన్నియు సిద్ధంబనుచున్! 11

అంత దశరథుడు నా సుమంత్రుతో నలరి బలికె మృదు మధురముగా!
కృతాత్ముడగు శ్రీరాముని వేగము బ్రీతినిటకు దోడ్కొనిరమ్మా!

తాజాజ్ఞను నా సుమంత్రు డంతట రయమున రాముని బిలుచుటకై
రథమునెక్కి వేగముగా బోయెను రాముకడకు గొని తెచ్చుటకై! 12

సుమంత్రు డటులను బోయిన పిమ్మట సురుచిరముగ యా దశరధునీ!
తూరుపు పడమర దక్షిణ దేశపు దొరముగా నృపు లందఱునూ
ఉత్తర దేశపు రాజులుగూడను యొనరగ సకలాధీశులునూ
దేవేంద్రుని దివిజలు గొలిచినటుల దీనిధి దశరథు గొలిచి రటుల్! 13

సురల మధ్య దేవేంద్రునకును వలె సురుచిరముగ యా దశరథుడున్!
ఆరదము నెక్కి వచ్చుచున్న యా యాత్మ తనూజుని గనుగొనియెన్!
రూపంబున గంధర్వ రాజువలె రూఢి వెలయు పౌరుషశాలిన్!
ఘన భుజ శాలిని వినయమూర్తినీ కావ్య నాయకుని శ్రీరామున్! 14

దీర్ఘబాహునీ మహాసత్త్వునీ యరవిందాక్షుని రఘురామున్!
రథమునుండి దింపగ సుమంత్రుడును రయమున యంజలి ఘటియించీ!
తండ్రి దశరథుని కడకు జనియెనూ తగ భక్తిని వినయము తోడన్
రాము ననుసరించుచు సుమంత్రుడును రయమున నరేంద్రు కడకు జనెన్!

నరశ్రేష్ఠుండగు నా శ్రీరాముడు నర్మిలి సుమంత్రు సహితుండై
తండ్రి దర్శనము జేయగా జనియె దగ యున్నత పీఠము గడకున్!
అంజలి ఘటించి తండ్రి పాదముల నలర్మ్రొక్కి యిటులను బలికెన్!
తండ్రీ! రాముడు నమస్కరించుచు దగ నీయాజ్ఞను గోరుచునూ
నిలిచినా డిదే! యాజ్ఞాపింపుము! నీ మదిలోగల భావమునూ! 16

అంతట దశరథు డా శ్రీరాముని యఁదరుచు నున్నత పీఠముపై!
గూర్చుండగ జేసెను నాదరమున కూర్మి ప్రేమ యుప్పొంగగనూ!
ఉదయభానునీ కాంతుల జేతను నురుమేఱువు విలసిల్లునటుల్
తన కాంతులచే నా యాసనమును దగ ప్రభామయము జేసెనటుల్! 17

శ్రీరఘురాముడు దీప్యమానమగు దివ్యకాంతులను నా సభలో
శరత్కాల చంద్రుని వలె నింగిని చారుచంద్రికల వెలుఁగొందెన్!
అద్దమందు దనరూపు జూచుకొని యలరు నటుల నా దశరథుడున్
ప్రేమ పాత్రుడగు రాముని జూచుచు ప్రియమారగ సంతస మందెన్! 18

రామునివంటి కుమారుడు గలిగిన రాజేంద్రుడు దశరథుడంతన్!
కాశ్యపుండు దివిజేంద్రుని తోడను కమనీయముగా బలికినటుల్!
రామునితో నా దశరథేశ్వరుడు రమ్యముగా నిటులను బలికెన్
అంతరంగికులు నాత్మీయులు నట యలరి వినగ మధురోక్తులనూ! 19

యోగ్యురాలు నా జ్యేష్ఠ పత్ని కభియోగ్యత జన్మించితి నింకన్!
గుణశ్రేష్ఠుండవు కావున మఱియును గుర్తించితి నీ యుత్తమతన్!
రామా! ప్రజ రంజిల్ల జేసితివి రమ్యమైన నీ గుణములచేన్!
యువరాజుగ నిన్నభిషేకించెద యుర్విజనులు సంతసమందన్! 20

వినయవంతుడవు! గుణవంతుంపు! విమలభావ సంయోజితుడవున్!
అయిన కుమారా! స్నేహభావమున యలరి దెలుపు చుంటిని హితమున్!
వినయము నింకను బెంపుజేసికొను! వికసించిన విజ్ఞానముతోన్!
కామక్రోధముల నిగ్రహింపుమా! కార్యభారమున నలయకుమా! 21

వేటాడుట, బరివాదము, ద్యూతము స్త్రీ సంభోగము, నృత్యమునూ!
గీతవాద్యములు, మద్యపానమును నీతి దప్పి వర్తించుటయున్!
పగటి నిద్రయును, బనిలేకుండగ పరదేశములను దిరుగటయున్!
కామము వలనను గలుగు వ్యసనములు గడగి దూరముండుము పుత్రా! 22

సత్పురుషుల హింసించుట మఱియును జాడీలను వెలి బలుకుటయున్!
ఈర్ష్యాసూయలు వ్యర్థ దూషణము నేహ్య ద్రోహ బుద్ధియును నింకన్!
వాక్పారుష్యము దండనాదులను వర్జింపుము నీ వ్యసనములన్!
క్రోధముచేతను జనించు గావున క్రోధము త్యజింపు మున్ముందున్! 23

ప్రత్యక్షముగా బరోక్షమందును బన్నుగ జ్ఞాన సుశీలుడవై
అమాత్యులను మఱి యాంతరంగికుల ఆనందింపగ జేయు మికన్!
రాజు, అమాత్యులు, దుర్గ, నగరమును రమ్యదేశ ధనకోశమునూ!
సేనాబలమును మిత్రసత్తముడు సిద్ధ ప్రకృతులు నేడింటన్!
తెలిసి ప్రవర్తింపగవలె రాజును తీరుగ వర్తింపుము రామా! 24

కోష్ఠాగారాయుధ కోశములను గూర్మి నింపి బహు చతురతతోన్!
మిత్రులు, ప్రజలును సంతసింపగా మేలు గూర్పు సజ్జనుల కిలన్!

నిగ్రహవంతుడవై చరింపుమా యఖిల కార్య పరిశీలుడవై!
అట్టి నిన్ను బ్రజ యభిమానించును నఖిల మిత్రతతి ముదమందున్! 25

ఆమాటలు విని రామునిమిత్రులు నలకౌసల్యకు శుభవార్తన్!
ప్రియము గూర్పగా వినిపించుటకై ప్రీతిబొంగ వివిపించి రటన్!
ప్రమదోత్తమయగు నా కౌసల్యయు విమలవార్త విని వారలకున్!
బంగారము, రత్నములు, గోవులును బహూకరించెను సంప్రీతిన్!

రాము డంతటను దశరథరాజుకు రమ్య నమస్కృతు లొనరించీ!
జనులందఱు బూజించుచుండగా జనె తన సుందర గృహమునకున్!
పౌరులందఱును రాజు మాట విని కోరిక సఫలం బాయెననీ!
సెలవును గైకొని గృహముల కేగిరి చేసిరి పూజలు దివిజులకున్! 27

అయోధ్యకాండము 3వ సర్గము సమాప్తము

★ ★ ★

# అయోధ్యకాండము 1వ భాగము

## 4వ సర్గము

(రాముడు కౌసల్యా భవనమునకుబోయి తల్లి యాశీస్సులను బొందుట)

పౌరు లందరును బోయిన పిమ్మట ప్రభు దశరథుడును మంత్రులతో!
మరల మంతనములను మరి జేసెను మానుగ నిశ్చయమున కొచ్చెన్!
పుష్యమి రేపే రాజీవాక్షుడు భూరి తేజుడగు రామునికిన్
యౌవరాజ్యమున కభిషేకించెద భువన మంతయును సంతసిలన్! 1

అని మది దలచీ దశరథేశ్వరుడు నంతఃపురమున కేతెంచీ!
రాము నిప్పటికి గొని రమ్మనుచును రయమున సుమంత్రు వే బంపెన్!
రాజునాజ్ఞ శిరసావహించి మది రయమున నా రథ సారథియున్!
రాముని బిలుచుటకై వే జనియెను రాముని వాసమునకు ద్వరన్! 2

సారథి సుమంత్రు డొచ్చినటుగా సరగున సేవకులును దెలుపన్!
రాముని మనసున శంకగలిగి మరి రయమున సుమంత్రు బిలిపించెన్!
మరల యెందుకొచ్చితివి సుమంత్రా! మనసు మాట దెలుపుము బూర్తిన్
మరల బిలుచుటకు కారణమేమీ? మహారాజు తన గృహమునకున్! 3

ఆ మాటలు విని సుమంత్రుడంతట యలరుచు రామునితో బలికెన్!
రాజు నిన్ను రమ్మని కబురంపెను రయమున జూడగ గోరుచునూ!
ఆ మాటయె నే జెప్పితి రామా! యంతయు నీ నిశ్చయము సుమా!
అని పలుకగ విని రాఘవు డంతట యా సుమంత్రునీ జతగూడీ!
మరల తండ్రినీ దర్శింపగ జనె మనసు భక్తి నిండారగనూ! 4

రాఘవు డొచ్చిన వార్తను వినుచును రయమున నా దశరథు డంతన్!
ప్రియమగు మాటను జెప్పదలచి మరి ప్రేమమీర దన గృహమునకున్
రప్పించెను శ్రీరాము డంతటను రంగు మీర కృత్యంజలినీ!

నమస్కరించెను భక్తి శ్రద్ధలను నయముగ తండ్రికి వినయముగన్! 5
నమస్కరించెడి బుత్రుని లేపుచు నాసరి యెవ్వరు లేరనుచున్!

శిరమాఘ్రాణించుచు దశరథుడును శ్రీరాముని శాసన మిచ్చెన్!
మఱియు నిటుల బలికెను దశరథుడును మమత బొంగ శ్రీరామునితో!
కంఠము రుద్ధముగాగ ప్రేమతో గనుల బ్రీతి బాష్పము లొలుకన్!

చిరకాలము నే రాజ్యము జేసితి జేసితి నెన్నో యాగములన్!
భోగములెన్నో యనుభవించితిని భూరి దానములు జేసితినీ!
భూలోకములో సాటిలేని నిను బొందితి ఘన సంతానముగన్!
క్షత్రియ ధర్మము నిర్వర్తించితి సర్వప్రజలు సుఖమును నందన్! 7

సుఖములన్నియును ననుభవించితిని సురుచిర భోగము లన్నియునూ!
ఋషి ఋణమును మఱి దేవతాఋణము ఋణమును దీర్చితి విప్రులకున్!
దీర్చితి ఋణమును బితృదేవతల దీర్చితి నాదు శరీరముకున్!
వృద్ధుడ నైతిని యోపలేను శ్రమ శుద్ధ చరిత విను! నా మాటల్! 8

అభిషేకింపగ దలచితి నిప్పుడు నఖిల రాజ్యమును బాలింపన్!
చేయవలసినది మఱి లేదింకను జేయవలసినది యిదియె సుమా!
నే జెప్పిన విధమున జరింపుమా! నిఖిల రాజ్యమును బాలింపన్!
అభిషిక్తుడవై ప్రజల పెన్నిధిగ యఖిల సౌఖ్యముల దేలింపన్! 9

ప్రజలందఱు నిను గోరుచుండిరీ వన్నుగ రాజుగ బాలింపన్!
అందుచేత నభిషిక్తుని జేసెద జిందెద నేనును సంతసమున్!
అంతమాత్రమే కాదు కుమారా! యమంగళములను బొడసూపెన్!
దుస్స్వప్నంబులు గాంచుచుంటినీ దుశ్శకునములును గాంచితినీ! 10

క్రూరగ్రహంబులు కుజ రవి రాహువు గూడె జన్మరాశిని నేడున్!
అశుభ మమంగళకరమని బలికిరి యాదైవజ్ఞులు జోశ్యులునూ!
మహాపదలు సంప్రాప్తించుననీ మహా మృత్యువును వచ్చుననీ!
యనుచు బలికిరీ యా మహామహులు నరసి జూచి నా జాతకమున్! 11

మఱియొక యోచన గలుగక ముందే మాననీయ! వే వేగమునన్!
అభిషిక్తుడవై యలరుము పౌరుల యభిమతంబులను దీర్ప మికన్!
చంచలములు మానవ జీవితములు చంచలములు జీవనరీతుల్!
చంచలములు ఋతువులు మాసములును చంచలములు రాత్రులు బవళుల్!

పునర్వసూ నక్షత్రము నేడును పుష్యమి రేపగు శుభమనియున్
పట్టము గట్టగ శుభముహూర్తమని బన్నుగ జెప్పిరి దైవజ్ఞుల్!
రేపే పట్టము గట్టెద రామా! రేపే యువరాజవు గమ్మా!
నా కోరికయును ప్రజాభీష్టమును నయముగ దీర్పుము బరంతపా! 13

అందుచేత భార్యా సహితుడవై యతి నియతాత్ముడవై శుచివై!
రాత్రి యంతయును దర్భాసనమున రహి యుపవాసము జేయు మికన్!
ఇట్టి కార్యముల విఘ్నము లెన్నో చుట్టుముట్టు సైరింపవలెన్!
అప్రమత్తులై మిత్రులందఱును నటని నిన్ను రక్షింపవలెన్! 14

భరతుడు దూరము నుండగనే నీ భవ్యకార్యమును జరుగవలెన్!
భరతుడు దివ్యుడు భవ్యభావకుడు భ్రాతృభక్తి శుభ దీపకుడున్!
దయాశీలుడును సత్పురుషుండును ధర్మ మార్గమున బయునించున్!
అన్నగారినే యనుసరించు మది యసత్య మాడుడు నెన్నండున్! 15

అయినను గూడను నాత్మవంతులుగ యలరెడి ధీమంతులు గూడన్!
చిత్తచంచలము సందుచు నుందురు శ్రీవిభవంబును జే జారన్!
ఇది నానిశ్చయ మనుచు దశరథుడు 'ఇక వెళ్ళుము!' అని బలుకంగన్
ఆజ్ఞ గైకొనుచు రాఘవు డంతట నలరి తనదు గృహమున కేగెన్! 16

తనదు తండ్రి దశరథు డీ విధమున తన యభిషేకము వినిపింపన్!
తన సదనమునకును జని రాముడు తన తల్లిని సందర్శింప జనెన్
దేవతా గృహమునందు సభక్తిని దివ్య వస్త్రములు ధరియించి!
లక్ష్మీదేవిని ప్రార్థించుట గనె లలిత హృదయ తన మాతృశ్రీన్! 17

ప్రియమగు వార్తయు విని సుమిత్రయును ప్రేమమీర లక్ష్మణ డంతన్!
అంతకు ముందుగ వచ్చి రచ్చటికి కాంత సీతయును విచ్చేసెన్!
ధ్యాన యోగమున కౌసల్యాపతి మౌన మూని గూర్చుని యుండన్
సీతా లక్ష్మణ సుమిత్ర సతియును జేరువ నుండిరి వినయమునన్! 18

తన కుమారు డిక యువరాజగునని తన్మయమై కౌసల్యయునూ!
ప్రాణాయామము తోని విష్ణువును బన్నుగ ధ్యానించుచు నుండెన్!

అట్టి తల్లినీ సందర్శించెను నాదర సమస్కృతుల తోడన్!
ఆనందముతో నిటుల బలికెనూ యా రాముడు వినయాంజలితో! 19
అంబ! తండ్రి యాజ్ఞను నియుక్తుడను నరయు మనుచు భువి పాలనమున్!
అభిషేకంబగు తల్లీ! రేపే యాశీర్వచనము లిక నిమ్మా!
సీతగూడ రాత్రంతయు నాతో స్థిరబుద్ధిని యుపవాసముననన్!
నుండగ యాజ్ఞాపించిరి తండ్రియు నిండు మనసుతో ఋత్విజులున్! 20
జరుగనున్న యభిషేకంబునకై జాగృతితో శుభకార్యములన్!
మంగళ కృత్యములను జరపింపుము మానుగ నాకును జనకజకున్!
అది విని యా కౌసల్యా సతియును యంతరంగమున నుప్పొంగి!
హర్ష భాష్పములతోడ బలికె నిటు యా రామునితో మధురముగా! 21
వత్స! రామ! వర్ధిల్లుము నిరతము నొనరగ శత్రులు నశియింపన్;
ఐశ్వర్యముతో జ్ఞాతుల నందఱ నానందంబును జేయు మికన్!
పుత్రక! నీ పుట్టిన నక్షత్రము బుణ్యవంతమై యొప్పినదీ!
ని సద్గుణముల నీదు తండ్రికిని నిరతము జేసితి సంతసమున్! 22
పురుషోత్తముడగు శ్రీవిష్ణువునూ పుణ్య వ్రతము నర్చించితినీ!
వ్రతము సఫల మాయెను నిక్ష్వాకుల వంశలక్ష్మి నిను వరియించెన్!
తల్లి వచనముల విని రాముడు తన దాపునున్న లక్ష్మణుగాంచీ!
చిరునవ్వులనూ చిందుచు బలికెను జిత్రగతిని మృదు వచనములన్! 23
లక్ష్మణ! నాతో సరి బాలింపుము లలిత వసుమతిని యంతయునూ!
నాదు బహిఃప్రాణము లక్ష్మణ! విను నా రెండవ ప్రాణము నీవున్!
అట్టి నిన్నునూ వరించె వసుమతి యలరింపుము శుభకార్యములన్!
సుఖసౌఖ్యంబుల బరిపాలింతము నూరి జనుల యాశీస్సులతోన్! 24
'సౌమిత్రీ! నీ యిష్ట భోగముల సౌఖ్యఫలములను జవిగొనుమా!
ఈరాజ్యంబును గాని జీవితము విల గోరుటయును నీ కొఱకే!
అనుచు రాఘవుడు లక్ష్మణు తోడుత నలరి బలికి తన తల్లులకున్!
నమస్కరించుచు దీవెన లందెను నయముగ జనకజతో గూడి!
తన నివాసమున కరిగెను రాముడు ధరణీతల ముప్పొంగగనూ! 25

[4వ సర్గము సమాప్తము]

★ ★ ★

## 5వ సర్గము

[వశిష్ఠుడు సీతారాములకు ఉపవాసదీక్ష నిచ్చుట-
దశరథుడు అంతఃపురమునకు బోవుట]

శ్రీరాముని వే బంపి దశరథుడు జివ్వున వసిష్ఠు బిలిపించీ!
జరుగబోవు నభిషేక విషయమున సవినయంబుగ నిటు లనియెన్!
తపోధనా! వే వెడలుము! రాముని ధనకీర్తి రాజ్యములకునై
వధువు సీతతోగూడ రాముచే యుపవాసము జేయింపు మికన్! 1

వేదవిదుడు నా వసిష్ఠు డంతట వేగముగా నటులే యనుచున్!
బ్రహ్మరథము దా నెక్కి జనియెనూ బహుళ మంత్ర కోవిదు డంతన్!
మంత్రపూర్వకముగా నుపవాసము మఱి రామునిచే జేయింపన్!
రామ నివాసమునకు స్వయంబుగా రాజగురువు దా వెడలె సహో! 2

పాండు రాభ్ర ఘన ప్రభలనుండి నా పన్నగ రాముని వాసమునన్
మూడు ద్వారములు రథము చేతనే మోదముతోడ బ్రవేశించెన్!
మాననీయుడగు ముని యాగమనము మతిమంతుడు రాముడు వినియున్
ససంభ్రమముగా గృహమునుండి దా సత్వరముగ బయటికి వచ్చెన్! 3

అంతట రాముడు ముని రథంబునకు జెంతజేరి బహు వినయమునన్!
స్వయముగ నాతని క్రిందికి దింపెను స్వీయ హస్తముల చేయూతన్!
ఆ వసిష్ఠు డంతట శ్రీరాముని యలరి కుశల ప్రశ్నల జేతన్!
ప్రసన్నుజేయుచు బ్రేమాదరముల బలికెను ప్రియవచనము లిటులన్! 4

ప్రసన్నుడాయెను నీ విషయంబున బరమ పూజ్యుడగు దశరథుడున్!
యువరాజుగ నిను జేయదలచెనూ! యుర్వి యంతయును సంతసిలన్!
ఆ శుభకార్యము రేపే జరుగును నలరి నీవు మఱి సీతయునూ!
నేడే యుపవాసమును జేయవలె నిర్మలమతి మీ దంపతులూ! 5

ప్రాతఃకాలమునందు దశరథుడు బరమ ప్రీతి తోడుత నిన్నున్!
నహుషుడు యయాతికిని బ్రియమారగ నయముగ పట్టము గట్టినటుల్

అభిషేకించును రాజ్యభారమును నలరి ధరణి భరియింపగనూ!
అనుచు బలికి యా వసిష్ఠదేవుడు యా సీతారాముల చేతన్!
మంత్రపూర్వకముగా నుపవాసము మానుగ జేయించెను ప్రీతిన్! 6

అంతట రాముడు నా గురుదేవుని యథారీతిగా బూజించెన్!
వసిష్ఠ దంతట రాము నాజ్ఞగొని వాసిగ తన గృహమున కరిగెన్!
రాము దంత దన ప్రియ మిత్రులతో రమ్య భాషణము గావించీ!
వారి యాజ్ఞ గైకొని దా బోయెను వలనొప్పగ యంతఃపురికిన్! 7

సంతసమందిన స్త్రీ పురుషులతో సరసిజ నయనుని గృహమంతన్!
వికసించిన పద్మములను గూడిన వేల్పు సరసిగా భాసించెన్!
ఆ దినమందు నయోధ్యా నగరము నన్ని వీధులును బన్నిటన్!
జల్లిరి, మామిడి తోరణములతో చారువృక్ష శత పంక్తులతో! 8

అలంకరించిరి నగర మంతయును నంద మొప్పగను ధ్వజములతో!
ఇంటింటికి బండుగ దినమును వలె కంటికి కూనుకు లేకుండన్!
సూర్యోదయ మెపుడగునా యంచును సురుచిర సంధ్యలు వెలయుననీ
రాముని యభిషేకమును గాంచగా రహి ప్రజలందఱు నుండగనూ! 9

అలంకార, యానంద వర్ధను నభిషేకంబును గాంచగనూ!
ఆ యయోధ్య యుత్సవము జూడగను నఖిల జనులు నాతురతోడన్!
ఎదురుజూచు చుండగను వసిష్ఠుడు నింపుగ జనసముదాయము నంతన్!
రెండు పాయలుగ వేఱు బఱచుచును విమల రథంబున బయనించీ!
రమ్యమైన యా రాజమార్గమున రాజభవనమునకును జేరెన్! 10

సితాభ్ర శిఖరము వోలె నున్న యా సిరులు జిందు ప్రాసాదమునూ!
దేవగురువు శక్రుని గలిసిన విధి దీరుని దశరథు దర్శించెన్!
వచ్చిన ముని గని యున్నతాసనము వదిలివచ్చి యంజలి తోడన్!
ప్రశ్నింపగ ముని పోయిన పనియును బన్నుగ గావించితి ననియెన్! 12

వసిష్ఠు రాకను జూచి సభయునూ వలనొప్పగ యాదరముననూ!
భక్తిప్రపత్తుల లేచి నిలబడిరి ప్రణతులు జేసిరి యంజలినీ!

అంత దశరధుడు నా సభాసదుల నలరి బంపె తమ గృహములకున్
వసిష్ఠు నాజ్ఞను బొంది తానునూ వాసిగ యంతఃపురికి జనెన్! 13

అత్యుత్తమమగు వేషధారణను నాయంతఃపుర ప్రమదలతో !
దేవరాజు గృహముగ యది భాసిలె గూరిమి దశరథు రాకడచే!
తారాగణమున నిండిన నింగిని చారుచంద్రు డొచ్చిన రీతిన్!
కలకల లాడెను గాంతి శోభలను గమనీయముగా శుభలీలన్!

[అయోధ్యకాండమున 5వ సర్గము సమాప్తము]

* * *

# అయోధ్యకాండము-1వ భాగము

## 6వ సర్గము

[సీతారాములు వ్రత నియమమును పాలించుబాట అయోధ్యా నగరము నలంకరించుట]

వసిష్ఠుఁ డంతట వెడలిపోవగా వాసిగ శ్రీరఘు రాముడునూ!
శుచియై నియమిత మానసుండునై సువ్రత జనకజతో గూడన్!
శ్రీవిష్ణువునూ యుపాశించెనూ చిరతర శుభముల గోరుచునూ!
హోమము జేసెను విష్ణు దేవునికి నేమముతో శ్రద్ధాభక్తిన్! 2

హోమముజేసీ మిగులు హవిస్సును రాము డంత భక్షణ జేసీ
నారాయణ దేవుని స్మరించుచును నయముగ మౌన వ్రతముననూ!
జితేంద్రియుండై విష్ణ్వాలయమును జేరి నియమ నిగ్రహములతో
దర్భ సంస్తరముపై శయనించెను దమ గురుదేవుడు దెలిపినటుల్! 3

జాము రాత్రి యిక మిగిలియున్నదన రాముడు నిద్రను మేలుకొనీ!
అలంకారములు జేయించెను మఱి యందమైన తన గృహమునకున్!
నాల్గవ జామున సూత మాగధుల నయముగ వినుచు సువచనములన్
ప్రాతఃసంధ్యను నుపాసించి మఱి పన్నుగ జపించె గాయత్రిన్! 4

శిరసా విష్ణువు నుపాశించెనూ శ్రీఘము ద్విజులను బలిపించీ!
పుణ్యాహ వచనములను జేయించెను భూరి దానములు జేయుచునూ!
శుభకరంబులగు ద్విజుల వాక్యములు సురుచిర తూర్యధ్వని తోడన్
కలిసిపోయి యా యయోధ్య నిండెను కలకల శుభకర నాదములన్! 5

అభిషేకమునకు నుపవాసంబున యలరిరి సీతారాములనీ!
ఆ వార్తను విని యానందించిరి యా యయోధ్య పుర వాసులునూ!
బాలసూర్యు డుదయింపగనే ప్రజ పన్నుగ యభిషేకంబునకున్!
పట్టణ మంతయు నలంకరించిరి ప్రతి వీధియు బహు వస్తుతతిన్! 6

సితాభ్ర శిఖరములగు దేవళముల చతుష్పథములగు వీధులతో!
చైత్యములందున కోట బురుజులను జనసంచారపు గూడలులన్!
రాజభవనముల సభాభవనముల రాజిలు వ్యాపార స్థలులన్!
రాజ చిహ్నముల ధ్వజముల నెత్తిరి రమ్యముగా రెపరెప లాడన్! 7

నట నర్తన, గాయక సముదాయము నట నర్తనముల జేయుచునూ!
మనః కర్ణ సుఖ యానందములను మఱి యట జేకూర్చుచు నుండెన్!
రాముని యభిషేకమును గూర్చియే పలువురు సంభాషించునదీ!
చతుష్పథము అందును గృహములనూ జను లందఱు భాషించునదీ! 8

ఆటలాడుకొను బాలకు లందఱు నాడుకొనెడి మృదువాక్యములన్!
ఆ శ్రీరాముని యభిషేకమునకు నారని శుభకర కాంక్షితముల్!
చిన్నలు పెద్దలు బెనువృద్ధులునూ సన్నగ చిన్నగ నడుచుచునూ!
రాముని యభిషేకము జూచుటకై రమ్య వీధులను వెడలి రహో! 9

పురవీథులు జల్లిరి నీరముతో బొలువుగ జల్లిరి పన్నీరున్!
పూలరేకులను జల్లిరి వీథులు బురమంతయును సుగంధములన్!
తోరణములు గేతనములు గట్టిరి తోరముగా గృహ గృహమందున్!
రంగవల్లులను దీర్చిరి ప్రమదలు సంగతిగా దమ ముంగిళ్ళన్! 10

పసుపు కుంకుమలతోడ దీర్చిరీ పన్నుగ తమ గృహ ద్వారములన్!
చెఱుకు గడలతో నలంకరించిరి జేరికొలిచి గృహ దేవతలన్!
ఆటల నాడుచు బాటలు బాడుచు ప్రమదలు గుంపులు గుంపులుగా!
మంగళ దీపికలను వెడలిరీ మధుర నాద శుభగీతికలన్! 10

రాముని యభిషేకము యగుసరికి రాత్రియగుననియు భయపడుచున్!
దీప వృక్షములు నమర్చి రప్పుడు దివియగు నట్టుల ధాత్రియునూ!
ఈ రీతిగ పురి యలంకరించిరి నింపుగ యాపుర వాసులునూ!
కూడలులందున సభాభవనముల గూర్మి దశరధుని బొగడుచునూ! 11

అహో! మహాత్ముడు! దశరథేశ్వరుడు నాత్మ దెలిసి తా వృద్ధుననీ!
రాముని బట్టము గట్టగ నెంచెను రహి తా వనమునకును బోవన్!

తారతమ్యములు దెలిసిన రాముడు దగరాజగు నీ పురమునకున్!
రాజగు రాముడు! దగ రక్షించును! రమ్యముగా నీ ధర నేలున్! 12

అనుద్ధతుడు ధర్మజ్ఞుడు, శాంతుడు నాదరమున దమ్ముల జూచున్!
తమ్ముల ప్రేమను నెటుల గాంచునో నిమ్ముల మనలను నటు గాంచున్!
ధర్మాత్ముడు శ్రీదశరథ ప్రభువును ధర చిరకాలము మను గాతన్!
అతని యానచే నగును రాముడును నభిషిక్తునిగా నీ నాడున్! 13

రామచంద్రు దభిషిక్తుడగు ననుచు రమ్యముగా బ్రజ బలుకులనూ!
నలుదిశలను వచ్చిన పల్లీయులు నయముగ వినుచును ముచ్చటగన్!
నగరనివాసులు గ్రామ ప్రజలును నయముగ స్త్రీ, వృద్ధులు, బాలల్!
అయోధ్యనగరము నిండి పోయినది యావంతయు సందును లేకన్! 14

జన ప్రవాహపు సంచారముచే జాగృత మగు బహుళ ధ్వనియున్!
పర్వమునందున బ్రతిధ్వనించెడి ప్రళయ సాగరము వలె నుండెన్! 15

రాముని పట్టము గట్టగ జూడగ రహి నే తెంచిన జనాళియున్!
దేవతా నగరి వలె నుండెడి యా దివ్య యయోధ్యా నగరంబున్!
జల జంతువులను నలల తెరలలో విలయ ఘోషవలె ఘూర్ణిల్లెన్!
సాగర ఘోషగ ఘోర ఘోషణము సరసముగా నట వినిపించెన్! 16

అయోధ్యకాండము, 6వ సర్గము సమాప్తము

* * *

# అయోధ్యకాండము-మొదటి భాగము

## 7వ సర్గము

[మందరప్రవేశము-కైకేయికి దుర్బోధను జేయుట]

కైక దాసియగు మంధర యంతట కలకల నాదముఁను వినియున్!
ఉన్నతమగు నాభవనము నెక్కియు యురుతర దృశ్యములను జూచెన్!
రాజమార్గములు దడుప బడినవీ రమ్యాలంకారంబులతో!
ఆ కుబ్జకు గనిపించె యయోధ్యా యమరావతి నగరికి బోలెన్! 1

గుంపులు గుంపులుగా కూడిన యా కూర్మి రాజ మార్గంబులునూ!
స్త్రీ పురుషులతో బాలవృద్ధులను శ్రీకరమగు శుభ నాదములన్!
మంగళ దీపములను సుమంగలులు మధుర గీతములు బాడుచునూ!
కాంచె కుబ్జ యామంధర యంతట కమనీయములగు దృశ్యములన్! 2

నగరమంతయును బతాకములతో నయముగ ధ్వజములు తోరణముల్
శిరఃస్నాతులై జను లందఱునూ చీనాంబరములు ధరియించి!
ఆడుచు బాడుచు కోలాటంబుల నలరి క్రీడలను సలుపుటయున్!
కాంచె కుబ్జ యామంధర యంతట కమనీయములగు దృశ్యములన్! 3

మాల్య మోదకము లణచిబట్టుకొని యలరెడి బ్రాహ్మణ సంఘమునూ!
తెల్లగ కనబడు దేవతాగృహము సల్లన మ్రోగెడి నాదములున్!
వేద ఘోషముల బ్రతిధ్వనించెడి విమల నాదముల ధ్వనితోడన్!
కాంచె కుబ్జ యా మంధర యంతట కమనీయములగు దృశ్యములన్! 4

గజాశ్వసంఘము గదులుచుండగను గదిలెడి భట సందోహములన్!
వివిధ వాద్యముల శుభ నాదములను విలసిల్లెడి యా నగరంబున్!
ఆనందోత్సవము లందు దేలుచును యాదివి నేలకు దిగినటులన్!
కాంచె కుబ్జ యా మంధర యంతట కమనీయములగు దృశ్యములన్! 5

అంత మంధరయు నాశ్చర్యంబున యటగల దాదిని బ్రశ్నింపన్!
రాముని యెత్తుక పెంచిన దాసిని రహి కౌసల్యా ప్రియవాసిన్!

షేమేమీ? ఈ కోలాహలమును నీ యనంత యుత్సవములునూ!
ఈ జయనాదము లీ శుభ ధ్వనులను ఈ మంగళ జయ నాదములున్! 6

కౌసల్యా సతి ఉబ్బురాలుగద! కడు నౌదార్యముతో నేడున్!
దాన ధర్మములు సేయుచున్నదీ! దానికి కారణ మేమౌనో!
జనులందఱు నీ విధి సంతసమున జాగృతి నుండుట యెందులకో?
రాజేమైనా ఘన కార్యంబును రహి జేయుచు నుండెన? యేమీ? 7

అపుడా దాదియు సంతోషంబున యారామున కగు శుభకర్మన్!
పరమానందముతో మంథరకును బన్నుగ తెలిపెను మధురముగా!
మంథర విను! మహారాజు దశరథుడు మహితాత్ముడు శ్రీరాములనూ!
రేపే పుష్యమి నక్షత్రంబున రీతిని యభిషేకము జరుపున్! 8

ధాత్రి వచనమును విని యా మంథర సత్వరముగ కడు గోపముతో
ఉన్నత ప్రాసాదంబును దిగి మఱి యురు వేగంబున బరుగిడుచున్!
పాపాలోచన గల యా మంథర పరమ కోపమున శోకమునన్!
కైక గృహంబున కేగి కైకతో గరము బట్టుకొని యిటు లనియెన్! 9

అమ్మా! కైకా! తెలివితక్కువా! యలరుచుంటివా? శయనమునన్?
ఆపదలన్నియు ముంచుకొచ్చినవి యవి నే దెలిపెద లేలెమ్మా!
భర్తకు నే ప్రియురాలినంచునూ బహుభంగుల వగలొప్పెదవూ!
నీ సౌభాగ్యము మసకలాయెనూ! నీలిమబ్బులో రిక్క వలెన్!
దీ ప్రవాహము గ్రీష్మమందువలె నిర్మలి చంగల మాయె సుమా! 11

పపు టాలోచన గల మంథర పరుష వాక్యములు బలుకంగన్!
ని యా కైకయు దిగులు జెందెనూ! విలవిల మనసున బలవించెన్!
ంథర దెలుపుము! యేమి జరిగెనో! మన క్షేమమునకు భంగంబున్!
షణ్ణ వదనము నుంటివేల యది వివరముగా దెలుపుము నాకున్! 12

ధురాక్షరములు బలికిన కైకను మాటల బ్రోవగు మంథరనూ!
కెక క్షేమమును గోరుకొనుచునూ! కడు దుఃఖము గలిగించుచునూ!
మనిపై గల ప్రేమ యంతయును రాపిడిజేయుచు అంపమునన్!
జేయుచును వెత గలిగించుచు విమలత బాపుచు నిటు లనియెన్! 13

మహారాణి! మనకంతము లేని మహాదుఃఖ మొకటొచ్చినదీ!
రాముని రాజుగ జేయగనుండెను రహి నేడే విను కైకమ్మా!
అది విని నే నిటు వచ్చితినమ్మా! యారని దుఃఖాగ్నిని మునిగీ!
దుఃఖశోకముల మునుగుచు దేలుచు దురపిల్లుచు నీ దాపునకున్! 14

నీకు దుఃఖములు గలిగినచో మఱి నాకు దుఃఖమగు కైకేయీ!
నీకు నభ్యుదయము గలిగినచో మఱి నాకు నభ్యుదయము గలుగు సుమా!
సంశయంబు లేదింతయు వినుమా! సరసిజలోచన! ప్రియవదనా?
నా దెలిపెడి వచనములను వినుమా! నయముగ జరింప శుభమగుతన్! 15

రాజవంశమున జనన మొందితివి! రాజమహిషి వైతివి ఘనతన్!
రాజ ధర్మముల గల యుగ్రత్వము రహి దెలియగ లేవైతివిగా!
తీయతీయని మాటలాడు పతి తీరని ద్రోహము గావించున్
ధర్మములన్నియు మాటాడును మఱి ధర్మము దప్పియు దా నడుచున్! 16

రాజీ విధము. మోసగించినను నయముగ నడుచుచు సుప్రీతిన్!
తెలియజాలకుంటివిగా మోసము దీయని బలుకుల భ్రమ పడుచున్!
నీపతి నీ దరి కొచ్చి పలుకు నతి నిరర్థకములగు మాటలనూ!
కౌసల్యాపతి కొసంగ నుండెను ఘనమగు లాభము రాజ్యంబున్! 17

భరతుని బంధువు లిండ్లకు బంపెను బహు వేగముగా రామునకున్
పట్టము గట్టగ నుండె నీదు పతి బహుచిత్రము! జూడము నెందున్.
బాలా! వినుమా! ఘోర సర్పమును బన్నుగ యొడియం దుంచుకొనీ!
తల్లివోలె గాపాడు చుంటి విది దగ శత్రువు నీ భర్తయునూ! 18

సర్పము గానీ, శత్రువు గానీ తగ యుపేక్షచే నేమౌనో!
నీ యందును నీ కుమారు నందును నిక్క మొనర్చెను నీదుపతీ!
ఓసీ బాలా! నిత్య సుఖములను నిండిన నిను బలుమాటలతో!
బుజ్జగించి యీ సర్వరాజ్యమును భూరి కృపను రాముని కిచ్చెన్! 19

నిన్ను నీదు సంతానము గూడను నిరవధికములగు కష్టములన్!
బడగ జేసె బాపాత్ముడు నీ పతి బన్నుగ జేయుము సాహసమున్!

సమయోచితముగ కార్యము సేయుము సంధ్యలు నుదయింపక ముందున్!
విస్మయ దర్శిని ! విధి నెదిరింపుము విమలమైన ధీ చతురత తోన్! 20

అంతవఱకు శయనించి యున్న యా కాంత కైక పడకను లేచెన్!
శరత్కాలమున జంద్రలేఖవలె జారు జంద్రికలు వికసింపన్!
రాముని బట్టము గట్టుట యన విని రమ్యశీల కైకేయియునూ!
మంథర కిచ్చెను మణి కంకణమును జిందగ మది యానందంబున్! 21

ప్రమదోత్తమయగు నా కైకేయియు బన్నుగ మంథరతో నవియెన్!
మంథర! నే జెప్పిన విషయ మదీ! మధురవార్త ప్రియ మందితినీ!
మణి కంకణమును నిచ్చితి గొనుమా! మధుర వార్త వినిపించితివీ!
ప్రియమగుదానిని యేమి కోరుదువొ ప్రీతిని యిచ్చెద! గోరికొనూ! 22

రాముడన్ననూ, భరతుడన్ననూ రహి భేదము లేనే లేదూ!
రెండు కనులుగా జూచుకొందు నే దండి ప్రేమతో నిరువురినీ!
రాజు రామునీ రాజుగ జేయగ రహి మది సంకల్పించెననీ
సంతసించుచుంటిని మంథర విను! సహజ ప్రేమ పొంగుచు వచ్చెన్! 23

మంథర సంతోషమునకు దగుదువు మఱియొక శుభవార్తయు లేదూ!
ఇంతకంటె శుభవార్త యెన్నడును కాంత! తెలుపగా లేవు సుమా!
ఎంతమంచి వార్తను దెలిపితివీ! యెంతమంచి రోజీనాడున్!
మంచి వరము గోరుము నే నిచ్చెద నంచితముగ నా సర్వమునూ!

(అయోధ్య కాండమున 7వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యకాండము - మొదటి భాగము

## ఎనిమిదవ సర్గము

(కైక రాముని గుణముల ప్రశంసించుట –
మంధర కైకను భయపెట్టుట)

కై కేయీసతి యటుల బలుకగా గడు దుఃఖితయై మంధరయున్!
ఇచ్చిన యాభరణమును త్యజించీ మచ్చికతో నిటులను బలికెన్ !
మూఢురాల! యిది యేమి విచిత్రము మోదము నొందుచు నుంటి విటుల్!
శోకసాగరము మధ్యన నుంటివి చోద్యము నిది నీ వెఱుగవుగా! 2

విషాద హేతువు నైన విషయమున విమల హర్షమున బొంగెదవూ!
దుఃఖితనై నే మనసు కుందుచును దూరాలోచన లేని నినున్!
కనులజూచి నిను నాలో నేనే కలకల నవ్వుచు నుంటి సఖీ!
తెలివి తక్కువకు మూఢత్వమునకు దెలతెల బోవుచు నుంటినిగా ! 3

ఏ యాడది మది సంతోషించును నే స్త్రీ మది తుష్టిని బొందున్!
సవతి పుత్రునీ యభ్యుదయము గని చల్లని దీవెనలను నిచ్చున్!
మృత్యువు నింటికి బిలుచుటగాదా! సత్యము నా పలుకులు వినుమా!
విప్పి జెప్పెదను విషయము వినుమా! విమల వదన దాగుడు లేలా? 4

భరతుడన్న భయ మా రామునకును భరతుడు వారసుడును ధరకున్!
సమానాధికారము గల దంచును సహింప డెపుడును నీ కొమరున్!
ఆలోచించిన కొలది నామనము నటమట జెందుచు నున్నదిగా
భయపడు చుండిన వారి వలననే పటుతర యాపదలును వచ్చున్! 5

మహా ధనుర్ధరుడగు లక్ష్మణుడును మఱి రాముని యాశ్రయమొందెన్ !
శత్రుఘ్నుడు మన భరతుని గూడెను జరించు వెంటను నెల్లపుడున్!
పుట్టుక క్రమమును బట్టి గూడ నగు బుడమికి రాజగు భరతుండే !
రాముని తదుపరి రమ్య ధరిత్రికి రాజగు భరతుడు గై కేయీ ! 6

లక్ష్మణ, శత్రుఘ్నులు కనీయసులు సూక్ష్మముగా బరిశీలింపన్!
రాజ్యలక్ష్మి బొందుట కనర్హులను రహి నీ కొమరుం డొకడె సుమా!
రామునితో సరితూగువాడు సుమ రహి బాలింప సమర్థుండున్!
అట్టి భరతునీ యడ్డు దొలగగా నా రాముడు మనసున దలచున్! 7

రాజనీతి యం దతి సమర్థుడును రహి సర్వము దెలిసిన వాడున్!
పండితుండు, బ్రాజ్ఞుడు శ్రీరాముడు బన్నుగ భయ మూతని వలనన్!
నీ తనూజునికి యేమి గలుగునో నిరతము నాలోచింపచు నుందున్!
రాజగు చుండెను రమణీ! యిపుడిక రహి ముందేమగునో యనుచున్! 8

భాగ్యవంతులారా! కౌసల్యకు బన్నుగ యామె కుమారునకున్!
వేదవిదులు బట్టము గట్టెద రిక విమల మంత్రముల రామునకున్!
రేపే పుష్యమి! పట్టము గట్టుట రేపే రాముడు రాజగునూ!
అంజలితో నిలుచుంద వలయు నీ వల కౌసల్యకు దాసి వలెన్! 9

నీ వీ విధముగ దాసివైనచో నే గూడను దాసిని యౌదున్!
నీతో బాటుగ నీ కుమారుడును నిజముగ రాముని దాసుడగున్!
రాముని భార్యలు సంతసించెదరు రహి రాణులుగా వర్థిలచున్!
భరతుని క్షయమును గాంచి కుందెదరు భార్యలైన నీ కోడంర్డున్! 10

మంథర యీవిధి దుఃఖితురాలై మఱి మఱి మాటాడుచు నుండన్!
కైకేయీసతి రాముని గుణముల కమ్మని మాటల నిటుల నియెన్!
ధర్మజ్ఞుడు శ్రీరామచంద్రుడును ధార్మిక భావోపేతుడునూ!
కృతజ్ఞుడును మఱి గురుల సేవకుడు సత్యవాక్కు శుచి విమలుండున్! 11

దశరథరాజుకు పెద్ద కుమారుడు ధాత్రి నేలగను జతురుండున్!
అందుచేతనే యౌవరాజ్యమున కభిషేకింపగ తగువాడున్!
చిరంజీవి రాముడు సోదరులను స్థిర బంధువులను బోషించున్!
ఓసి గూని! రామాభిషేకమున కోర్వజాల వెందుల కనియో! 11

రాముడు బతిపాలించిన తదుపరి రయమున భరతుడు రాజగునూ!
పితృపితామహ రాజ్యము నంతయు ప్రియమున నా కొమరుం డేలున్!

మంధర! మన కభ్యుదయ గలిగినది మానుగ కొనసాగుచు నుండెన్!
భావిని కల్యాణములు గలుగు నిక బాధ యెందులకు రోదింపన్? 12

భరతు డెంతగా బ్రీతిపాత్రుడో పన్నుగ రాముడు నంతయునూ!
అధికముగా మఱి ప్రీతిపాత్రుడను నా రాముడు నా కెంతయునూ!
ఆ కౌసల్యకు మించి మిక్కుటము నలరి గారవము నను జూచున్
కౌసల్యా సుతు డనుటకంటె మఱి కైక నందనుం డనుట తగున్! 13

రామునకుండిన చాలును రాజ్యము రమణీ! భరతున కున్నటులే
తనను వేఱుగను దమ్ముల వేఱుగ దలపడుగా శ్రీరాఘవుడూ!
కైక మాటలను విని యా మంధర కడు దుఃఖముతో దీర్ఘముగా
వేడివేడి నిట్టూర్పుల విడుచుచు విలవిల లాడుచు నిటులనియెన్! 14

శోకాపదలను నిండిపోయినా శోక సంద్రమున మునుగుచునూ!
మూర్ఖత్వముననను మంద బుద్ధిచే మది తెలియవు నిన్నును నీవే!
రాముడు రాజై రాజ్యమేలుచో రాజగు నాతని పుత్రుండే!
రాజవంశమున భరతుని కెచటను రహి యుండదు నూరును జేరున్! 15

రాజున కెందఱు బుత్రులుందురో రాజులందఱును గారు సుమా!
పుత్రులందఱును రాజులైనచో పుడమి నీతి రహితంబగునూ!
సుందరి విను మీ రాజ్యపాలనము సురుచిరముగ జ్యేష్ఠున కైనన్
గుణవంతుండగు సుతున కిచ్చెదరు గూర్మి రాజ్య పరిపాలనమున్! 16

వత్సల! విను! నీ కొమరుడు భరతుడు వరుసగ సుఖముల దేలుచునూ!
దూరముగా జను రాజవంశమున దుఃఖితుడై తా నొంటరిగా!
త్వదర్థమై నే నిటకు వచ్చితిని యది తెలియవుగద నుంతయునూ!
ఆభరణము నిచ్చెదు గానుకగా నరయవు నా పలుకుల నిజమున్! 17

నిష్కంటకముగ రాజ్యము నందీ నిలిచిన రాముడు నీసుతుని!
దేశాంతరమును లోకాంతరమును లోలత బంపును నిశ్చయమూ!
మేనమామలా గృహము జేర్చితివి మిగుల ప్రేమతో నీ సుతుని!
తండ్రి ప్రేమకును దూరము జేసితి తగదని నీమది తెలిసియునూ! 18

ఎదుట నున్నచో నెవరికైననూ హెచ్చిన ప్రేమలు బొంగారున్!
చెట్టు పుట్ట స్థావరముల పైనను జిందు ప్రేమ యభిమానములున్!
భరతు ననుసరించెడి శత్రుఘ్నుడు భరతునితో జనె జతగూడి!
అతడిచ టుండిన యాతడైననూ యాతని క్షేమము బరికించున్! 19

వనచరులు ఖండింపవలసినా వాసిగ నొక వన వృక్షమునూ!
సామీప్యముచే నిషీకములు మఱి సరసములగు బొదలును లతలున్!
కప్పివేసి మఱి రక్షించినవట కడిగి ప్రేమ సుస్నేహములన్!
అట్లే భరతుని యా దశరథుడును నలరుచు గాపాడెడి వాడున్! 20

లక్ష్మణు డెప్పుడు సంరక్షించును లావుగ శ్రీరాముని నెపుడున్!
రాముడు సంరక్షించును లక్ష్మణు రహి తన ప్రాణము ప్రాణముగా!
అశ్విని దేవతలను బోలినదీ యరయగ వారల స్నేహమునూ!
రామలక్ష్మణుల భ్రాతృస్నేహ మది రమ్యజగతినీ ఖ్యాదముగా! 21

లక్ష్మణు నెప్పుడు దూరము జేయడు లాలించును దన స్నేహమునన్!
భరతుని యెడ దా బాపము జేయును బరమ సత్య మిది కైకేయీ!
మేనమామలా గృహమునుండియే వినయ వ్రతుడు నీ కొమరుండున్!
అడవుల కేగుట మంచిది సుమ్మా యది నీకును హితకరమగునూ! 22

ధర్మరీతి తన తండ్రి రాజ్యమును దనయుడు భరతుడు బొందినచో!
నీకును మఱి నీజ్ఞాతిబంధువులకు నిజముగ శ్రేయము జేకూరున్!
సుబోధితుడు బాలుడు నా భరతుడు సుఖకరు డెట్లగు రామునకున్!
రాముని వశమున రామరాజ్యమున రహి నెటు భరతుడు జీవించున్? 23

సింహరాజు గజరాజును దరుముచు జేరి యాక్రమించిన యటులన్
రాముడు భరతుని యాక్రమించుచును రహి పగ సాధింపగ యుండున్
అట్టి భరతునీ సంరక్షింపగ యతులిత మేధా సంపత్తిన్
దగుదువు నీవే కైకమ్మా! యిక గడగుము నీ సుతు రక్షింపన్! 25

పతిప్రేమను బహు బొందితి నంచును బహు ననాదరము జేసితివి!
రాజమాతయై కౌసల్యాసతి రాపిడి జేయును నిన్నింకన్
రాముడెపుడు నిక రాజై వెలుగునొ రమ్య సంపదల కధిపతియై
అపుడె నీవు నీ భరతుడు గూడను నఖిల కష్టముల నందెదరూ! 25

రాముడెపుడు రాజగునో భూమికి రయమున భరతుడు నశియించున్!
కావున మనసున యాలోచింపుము గమ్మని యోచన జేయు మికన్!
భరతుడు రాజ్యము బొందుటకును మఱి వనమున కేగగ రాముండున్
ఆలోచింపుము! కైకమ్మా! యిక నాలసింపకుము వే వేగన్ 26

అయోధ్యకాండము 8వ సర్గము సమాప్తము

* * *

## 9వ సర్గము

[మంథర బోధనలకు కైక లొంగిపోవుట-కోప గృహమును ప్రవేశించుట]

మంథర మాటలు విని కైకేయియు మండిబడుచు గడు దీర్ఘముగా!
వేడి వేడి నిట్టూర్పులు విడుచుచు విలవిలలాడుచు నిటు లనియెన్!
రాము నిప్పుడే యడవికి బంపెద భరతునికిని గడు వేగముగా
యౌవరాజ్యమున నభిషేకింపగ యఖిల కార్యముల నొనరింతున్! 1

మంథర వేగము నాలోచింపుము మానుగ చక్కని యోచననూ!
రాము డెటుల వనమునకును జనునో, రాజెటులగునో భరతుడునూ!
అని బలుకగ కైకేయి మంథరయు నలరుచు సంతసమున వేగన్!
పాపపు టాలోచన గల పడతియు బాపపు మాటల నిటు లనియెన్! 2

సంతసించితిని కైకేయీ యిక జింత వదులు నే దెలిపెదనూ!
భరతుడు రాజగు నుపాయంబునూ బన్నుగ తెలిపెద నే వినుమా!
కైకేయీ! యది నీకును దెలియును గదగి దానినీ మఱచితివా?
విన గోరుచు నుంటివ నా నోటను గనగ యభినయమా యిదియున్? 3

ఓ విలాసినీ! నా నోటను విను నయముగ యభిలాషయు యున్నన్!
తెలిపెద విను! ఓ మధురభాషిణీ! తెలిసి మనసుననూ యోచింపూ!
మంథర మాటలు విని కైకేయియు మఱి శయనము నుండియు లేచీ!
ఆసక్తిని యా కుబ్జను నడిగెను నలరుచు నట్టి యుపాయంబున్! 4

ఎట్టి యుపాయము జేత రామునీ యిట్టె యడవులకు బంపుటయున్!
భరతునికిని యా యౌవరాజ్యమును భరింపజేయుట దెలుపు మనన్!
పాపపు టాలోచనగల మంథర పాపపు బుద్ధిని నిటు లనియెన్?
విషము గ్రక్కునటు విషసర్పము దా విమల చంద్రశిల పీఠముపై! 5

దేవాసుర యుద్ధము జరిగెను గద దేవి! యొకప్పుడు బూర్వమునన్!
దేవరాజునకు సాయము జేయగ దేవీ! నీపతి బోయెగదా!

రాజఋుషులతో రమణీ! నిన్నును రణభూమికి గొనిపోయె గదా!
దండక వనమున తిమిధ్వజుం దను దానవు జయింప బోయెగదా! 6

తిమిధ్వజునకును శంబరు దనియెడి తీరుగ నామంబును గలదూ!
అనేక మాయలు గలిగిన నసురుడు నమరుల నందఱ నోడించీ!
దేవేంద్రునితో యుద్ధము జేసెను దివ్యప్రభలు బొంగారంగన్!
దేవతలందఱు పారిపోయిరీ దిక్కుల దాగిరి దశదిశలన్! 7

అనిలో గాయము లందిన పతినీ యారసి ప్రాణము నిలిపితివీ!
సారధిగా రథ్యమును దోలుచును పతి నొకచోటికి బోయితివీ!
అచటి కొచ్చిరీ యసురులు గూడను నాత్మనాథునీ మర్దింపన్!
మఱల ప్రాణముల గాపాడితివీ మానుగ రక్షా కవచముగా! 8

నీసాహసమును జూచి నీదు పతి నిండుగ సంప్రీతుండునునై!
రెండు మార్లు ప్రాణము గాపాడితి రెండువరములను గోరుమనన్!
అంత నీవు 'నాయవసర మెపుడో చింత దీర గోరుదు' ననగన్!
ఆమహాత్ము 'డటులే సరి!' యనెనూ! యాకథ యంతట ముగిసినదీ! 8

దేవీ! యచటను నేమి జరిగెనో తెలియదుగద నా కేమియునూ!
నీవే జెప్పితి పీ కథనంతను నీపై ప్రేమను మఱువకనూ!
స్మరించుచుందును నిత్యము నీకై నీ యవసరముల గనుగొనుచున్!
ఆ యవసరములు నమ్మా! వచ్చెను యడిగి కొనుము దశరథరాజున్! 10

ఆవరములచే బలాత్కరింపుము నా రాజును నీ దశరథునీ!
భరతుని బట్టము గట్టు మనుచునూ, బన్నుగ పదునాల్గేండులునూ
రాముని వనవాసమును బంపుమను రయమున గోరుము వరములనూ!
రెండు వరములను గోరికొనుము సఖి! ఖండితముగ వెనుకకు బోకన్! 11

రాముడు వనవాసమునకు బోయిన రమణి నీ సుతుడు రాజుగనూ!
భువినంతయు పాలించు ప్రజలలో భూరి స్నేహప్రేమల నందున్!
స్థిరుడై పోవును బుధమి భర్తగా చిరకాలము దా పాలించున్!
రాజమాతవై రమ్య వైభవము రమణి! నీవె గొనెదవు సుమ్మా! 12

కోప గృహంబును జేరుము తల్లీ! కోపించిన దానవుగమ్మా!
మలిన వస్త్రములు ధరింపుమా యిక మఱి నేలను శయనింపు మికన్!
శోకలాలసవునై శోకింపుము శోభల నన్నియు ద్యజియించీ!
రాజును జూడగనే రోదింపుము రమణి! నేలబడి పొరలుచునూ! 13

పిలిచిన బలుకకు మాటలాడకుము! ప్రియమారగ పతి పలికిననూ!
ప్రియురాలవు నెల్లపుడు రానజుకు ప్రియమూరెడి నీ పలుకులకై!
అగ్గిని దూకును; యలుగుదువో యని యారాటము భయమును బొందున్!
కోపించిన నిను జూడ జాలడుగ కోమలి! యసువుల ద్యజించుచున్! 14

గీచిన గీతను దాట డెన్నడును గీరవాణి! జవదాటడుగా!
మందబుద్ధి! నీ భాగ్యమెంతటిదో! మదిలో దలపవు నింతయినా!
మణి ముక్తాదులు సువర్ణాదులను రత్నావళులను నీకిచ్చున్!
అంటకు! ముట్టకు! నటులనె యుంపుము! అవిగొని సంతస మందకుమా! 15

మహాభాగ్యవతి! కైకరాణి! విను! మంచి మాట నే జెప్పునదీ!
దేవాసుర యుద్ధమున యిచ్చినా దివ్య వరములను వినిపించీ!
మదిని నున్న నీమహా కోరికల మహారాజు ముందుంపవలెన్!
సమయము దాటక ముందు జరుగవలె సారసాక్షి! మన కార్యంబుల్! 16

నేలనున్న నిను లేవనెత్తునూ నిండిన ప్రేమను హస్తములన్!
కావలసినయది కోరుకొమ్మనును కమ్మని పల్కుల రాణి నినున్!
కుదుటబడిచి రాజును గోరవలెన్ గూర్మి మనస్సున కోరికలన్!
పాము కుబుసమును విడిచిన యట్టుల పాపకర్మమని తలపకనూ! 17

దేవాసుర యుద్ధమున యిచ్చినా దివ్యవరములను నే డిమ్మా!
పదునాల్గేడులు రాముని బంపుము బన్నుగ వనవాసంబునకున్!
భరతుని రాజుగ నేయుము భూమికి బ్రజల నేలు నటు సౌఖ్యముగా!
అదురు బెదురు లేకుండ నడుగుమా! యతివరా! పటు దృఢ నిశ్చయతన్! 18

రాముడు బోగా నరణ్యమునకును రయముగ బదునాల్గేడులునూ!
నీ కొమరుడు రాజ్యమును నేయునూ నీతివంతముగ సౌఖ్యముగన్!

ప్రజాభిమానము సంపాదించును బ్రజలను దా బ్రేర్లనుకొనునన్!
శేషకాలమును రాజ్యము సేయును జిరకాలము వైభవమునను! 19

రాము నరణ్యము బంపుటగూదను నర్థింపుము నొకవరమునుగా
ఈ విధి నీ పుత్రుని కార్యంబును నిరవధికముగా సిద్ధించున్!
రాముడు బోవగ నరణ్యమునకును రమ్య గుణములును నశియించున్!
ప్రజలకు గనుమఱుగై పోవును సఖి! ప్రజల నేలు భరతుండు నికన్! 20

ప్రాప్తకాల మిపు డొచ్చె ననుచు నే బన్నుగ రాజుకు దలచెదనూ!
భయమును విడిచీ బలాత్కరింపుము బన్నుగ రాజును శోకముతో!
రాముని యభిషేకమును దశరథుడు నయముగ యాపగ జేయవలెన్!
నీ కుమారునీ యువరాజుగ మఱి నిర్ణయించునటు జేయవలెన్! 21

మంథర యా విధి తీయని మాటల మనసు విఱిచి యా కైకేయిన్!
చెడుదారిని బయనింప జేసెనూ! చేటు జరుగునని దలపకనూ!
అనర్థకరమగు విషయ మంతయును నతిలాభంబని మది తలచీ!
కైక సంతసించెను బేలగ మది గలుగు విషాదము గనలేకన్! 22

కైకేయీ సతి మంచిదైననూ మంథర వాక్యములను వినుచున్!
చిన్నపిల్లవలె యజ్ఞానముచే జెడు ద్రోవను బయనింప జనెన్!
ఎంత మంచిదానవె! ఓ మంథర యింత మంచి మాటలు నాకున్
అంచితముగ బోధించితివే మఱి చింత దీర్చితివి మనసునకున్! 23

ఇంత మంచి గుణములు గలవనుచును నంతయు దెలియక పోయితినీ!
బుద్ధి బలమునను, కార్యనిశ్చయము గడు ధీమంతవుగదె గూనీ!
ధర పైగల యాకుబ్జ లందఱును దరికిరావు నీ తెలివిడినీ!
అందులకే నిను బంపినారు మా యమ్మయు నాన్నయు నరణముగా 24

మంథర యెపుడును హితమును గోరుచు మానసమును రంజించెదవూ!
రాజు చేయదలచిన వంచనలను రయమున దెలివిని దెలిపితివీ!
లోకమందుగల రెండటొ కుబ్జలు భీకర రూపము గలవారున్!
కాని నీవు నాకును గనిపింతువు గాలికి వంగిన పద్మముగా! 25

బిగితోనున్నా వక్షస్థలమును బిగుతుగ నున్నా గూనియునూ!
క్రిందనున్న యుదరము బహు సిగ్గున యందలేక బిగువును నెత్తున్!
చిన్నబోవుచున్నవి యనిపించును జేరిజూచు వారందరికీ!
ఎంత యందగత్తెవు గూనీ! నిను సుంత దెలియనైతిని మునుపున్! 26

నిండుగనున్నా జఘనము దోడుత దండిగ బలిసిన స్తనములతో!
పూర్ణచంద్ర బింబమువలె మోమును బుట్టెడు సొగసులు గలదానా!
వడ్డాణపు గజ్జెలతో జఘనము వన్నెలు జిందెను ప్రియ సఖియా!
పిక్కలు వాటము దీరి యున్నవీ చక్కని పాదములును గూడన్! 27

చక్కని జంఘలు గల యో మంథర! క్షౌమవస్త్రమును ధరియించీ!
కనుల ముందటను గలగల నడువగ కలహంసిగ నే మది దలయన్!
శంబరాసురునిలో గల మాయలు చారునేత్ర! బహు స్వల్పములే!
వేలకొలది మాయలు నీలోపల జాలగలవనీ మది దలతున్! 28

రథఘోణము వలె నున్న గూనిలో రహి నీ యోచన లన్నియునూ!
క్షత్రియ విద్యలు, మాయ మంత్రములు సరస విద్యలన్నియు గలవూ!
రాముడరణ్యము బోయిన పిమ్మట రహి భరతుడు రాజైనపుడున్!
నీ గూనికి బంగారు మలామును నిజముగ జేయింతును సఖియా! 29

మనసున గోరిక తీరిన పిమ్మట మది సంతృప్తిని నే నందీ!
పుటముబు వేసిన బంగారముతో పూత వేయింతు గూనికినీ!
మంథర! ముఖమున జిత్ర దిలకమును మాణిక్యాలంకారములన్!
జేయింతును ప్రియసఖిగా జూతును జిరకాలము నా భవనమునన్! 30

మంగళకరమగు వస్త్రంబులతో మహి దేవతవలె దిరిగెదవూ!
చంద్రుని సరి యందము గలదానవు సాంద్ర దీప్తమగు గర్వముతో!
ఉన్నతమగు స్థానమును బొందెదవు సురగుణ! శత్రుల మధ్యమునన్!
సకలాలంకారముల గుబ్బలును సాధురీతి నిను గొలిచెదరూ! 31

కైకేయీ సతితో నా మంథర సాదురీతి బొగడం బడియున్!
మంథర బలికెను కైక రాణితో మధుర భాషలను నిటు లనియెన్!

నీరుపోయినా పిమ్మట నెందుకు సిరపమగు సేతువు నింకన్!
కనుక యిప్పుడే పూనుకొనుము సఖి! కార్యము సఫలత్వము బొందన్! 32

విశాలాక్షి! సుందరి యా కైకయు వికృత మంథర మాటలకున్!
లొంగిపోయి వికృతియై పోయెను ప్రకృతి నంతను గోల్పోయెన్!
లక్షల విలువలు గల హారములను లలి దీసియు నావల నుంచెన్!
కోపగృహమునకు మంథరతో జనె కోమలమగు దన తనులతనూ!
బంగరు తీగెగ నేలపైచెనూ బోలుక దొదంగెను లేనివగన్! 33

రాముడు బోవలె నడవికి మంథర! రాజ్యము భరతుడు నేలవలెన్!
లేదా నే నిట మరణింపగవలె లీలగాదు నే దెలుపునదీ!
బంగారము మఱి రత్నభూషలును బహు బహుమతులను బని లేదూ
ఎపుడు రాము దభిషేకింపం బడు నపుడె యంతమగు జీవితమూ! 34

అతి తీవ్రముగా బలుకు కైకతో నా మంథర బలికెను నిటులన్!
కైకకు హితమును రాముని కహితము కర్కశ హృదయముతో బలికెన్!
రాముడు రాజగుచో బహు విపదలు రహి నీకును నీ కొమరునకున్!
రాజగునట్టుగ జేయుము భరతుని రంజిల జేయుము నీవారిన్! 35

మాటి మాటికిని వాగ్బాణంబులు మఱి గొట్టగ కైకేయిసతిన్!
కుబ్జదెలివికి సంతోషించి కూర్మి నచ్చెరువు నందుచునూ!
రాజుపైని కోపించి మంథరను రహి ప్రశంసలను జేయుచునూ!
మంథర నొక దేవతగా దలచెను మారి యనుచు మది దలపకనూ!

నాయాశలు మఱి దీరకున్నచో మఱి బోయెద కాలుని పురికిన్!
ఈ సంగతి దెలుపుము రాజునకును నిలపై కైకిక లేదనుచున్!
లేదా రాముడు నడవికి బోవలె సదా కాయ కసురులు దినుచున్!
ధరపై భరతుడు రాజ్యమేలవలె జిరకాలము సుఖశాంతులతో! 37

రాము డడవికిని బోవకున్నచో రమణి! యాస్తరణము లవి యేలా?
పూలమాలికలు జందనాదులను బులకిత యంజనములు నేలా?

పాన భోజనాదుల పని లేదే- పన్నుగ జీవితమును గూడన్!
భూమిపైని నే నిక జీవింపను బుదమిని రాముడు రాజగుచో! 38

అని యీ విధముగ మంథరతో నని మహనీయములగు భూషణముల్!
దీసివేసి దా మలిన వస్త్రములు దీరువగా ధరియించి మఱిన్!
నేలపైని శయనించి యుండెనూ నిట్టూర్పులు వే విడుచుచునూ!
స్వర్గము నుండీ నేలను వడినా సరస కిన్నరకు వలె నుండెన్! 39

కడు కోపము నే చీకటి ముఖమును గప్పివేయగా దోషమునన్!
ఆ కైకేయీ యలంకారములు యన్నియు నేలను బడియుండెన్!
చీకటిరాత్రిని మబ్బులు గ్రమ్మిన చిందెడి యాకాశము వోలెన్!
కళాహీనమగు గైక గృహం బది కాంతి హీనముగ నగుపించెన్! 40

(అయోధ్యకాండమునందు కొమ్మిదవ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము 1వ భాగము

## 10వ సర్గము

(దశరథ మహారాజు కైకేయీ గృహమునకు బోవుట-కైకేయిని యనేక విధముల నోదార్చుట)

మంథర దుర్బోధను కైకేయీ మానుగ విషబాణము జేతన్
కొట్టబడిన కిన్నర స్త్రీ వోలెను గూరిమి భూమిని శయనించెన్!
చతురయైన యా కైకేయీ సతి ధృతిని జేయదగు కార్యంబున్
మనస్సునందున నిర్ణయించుకొని మంథరతో నల్లన జెప్పెన్! 1

అనర్థ వచనములను విని కైకయు మదిని దీనురాలై మఱియున్!
నాగకన్యవలె బహు దీర్ఘముగను నయముగ విడుచుచు నిట్టూర్పుల్!
తనకు సుఖము గలిగించు మార్గమును క్షణకాలము నాలోచించుమనూ!
చెడు బోధలు వినువారికి జగతిని జేరరావు సుఖశాంతు లలిన్! 2

కైకకు స్నేహితురాలు మంథరా కైక నిశ్చయము మది దలచీ!
కార్యము సఫలంబాయె ననుచుసూ కడగి యాత్మ సంతృప్తికడున్!
అంత కైకయును బొమముడి వెట్టుచు నంత రంగమున నిశ్చయతన్
కటిక నేలపై శయనించెను సతి కర్కశముగ మనసును జేసీ 3

పూల మాలికలు నాభరణములు బొలతి దీసి విరజిమ్మె గదిన్
ధరణి పూలు పూసిన యటులుండెను ధాత్రి యంతయును గాంతులతో
విరజిమ్మిన యా యలంకారములు విరజిమ్మిన యా మాలికలున్!
ఆకాశంబున నక్షత్రంబులు యలరి నటుల గది శోభించెన్! 4

కోప గృహములో మలినాంబరముల గూలిపడిన యాకైక సతీ
మరణించిన కిన్నెరవలె నుండెను మాధుర్యములను గోల్పోయీ!
దశరథు డంతట యభిషేకమునకు దగు నేర్పాటులు గావించీ!
పురోహితుల యాజ్ఞను దాగైకొని పొలతి కైకనూ చూడ జనెన్! 5

రాముని పట్టము గట్టువార్త మఱి రయమ్మున దెలిపెను నందటికిన్!
సుందరి కైకకు జెప్పవలయునని సురుచిరముగ బహు నాసక్తిన్
ప్రియురాలగు కైకకు దా స్వయముగ ప్రియవార్తను దెలుపుట కొఱకున్!
కమ్మని వార్తను జెవినివేయగా జుమ్మని హృదయము బొంగారన్! 6

మహాయశుడు నా దశరథ రాజును మానుగ కైకేయీ గృహమున్!
రాహువు గూడిన యాకాశములో రమ్య చంద్రుడొచ్చిన యటులన్!
సకలైశ్వర్య సమృద్ధమైన యా సారసాక్షి గృహమును జొచ్చెన్!
శయ్యాగృహమున కైకలేదు మఱి సరగున యెదురుగ రాదు గదా! 7

చిలుకలు, హంసలు, గోరింకలతో జెలగుచుండె రంతఃపురమున్!
వింత ధ్వనులచే గలగల లాడుచు విమల వాద్యములతో నుండెన్!
కుబ్జలు, దాసీదాస జనంబులు గూరిమి దిరుగుచునుండి రటన్!
శయ్యాగృహమున కైకలేదు మఱి చంద్రానన యెదురుగ రాదూ! 8

లతా గృహంబులు పొదరిండ్లును మీఱి లలిత లలిత చిత్ర గృహముల్!
వెండి సువర్ణములను నిర్మించిన మండితములగు ముత్తెపుటరుగుల్!
పుష్ప ఫలాదుల నిచ్చు వృక్షములు బొలుపగు నాసవములు నుండెన్!
ఉత్తమ స్త్రీలును బొలుపుగ నుండిరి జిత్తము హరించు దివివోలెన్! 9

కానరాని యా కైక కొఱకునై రళవళ బడుచును గృహ మంతన్!
చూచెగాని యా దశరథు డంతట సుందరి కంటికి నగబడదూ!
దశరథు వచ్చుట నున్నవారలను దగ కైకను గూరిచి యడిగెన్!
కోప గృహంబున నున్నదనుచునూ కూరిమి తెలిపెను ప్రతిహారీ! 10

ప్రతిహారీ వచనము విని రాజును బన్నుగ మఱి దుఃఖము తోడన్!
లలిత వ్యాకులేంద్రియముల తోడను చలితమైన మనసున వ్యథతోన్!
కోప గృహమునకు జని యారాజను గూరిమి నేలను బడియున్నా
కైకను గాంచీ కరుణరసమునా కలకల మనుచును శోకించెన్! 11

వృద్ధుడైన యా దశరథేశ్వరుడు క్రుద్ధయైన కేకేయి సతిన్!
...ము కంటెను ప్రియతము రాలగు ప్రాణేశ్వరిని కనుగొనియెన్!

పెరికి పారవేసిన లతవలెనూ ప్రియ సురదేవత బడినటులన్!
విసిరివేసినా కిన్నర స్త్రీ వలె విధిని జారినా యచ్చరగా! 12

క్రింద వడిన యొక మాయగ నుండెను బంధంబున లేడిగ నుండెన్!
విష బాణముచే గొట్టబడిన యొక విలవిలలాడు గరేణువునూ!
మహాగజము స్పృశియించిన రీతిని మానుగ కైకను స్పృశియించెన్!
కామోద్రేకము నున్న దశరథుడు గక్షు భయ మందిన చిత్తముతో!
కలువ పూవులా కన్నులుగల యా కాంతను స్పృశించి యిటు లనియెన్!

దేవీ! నీవతి ప్రియతమురాలవు దీనత నుండుట యేమాయెన్?
క్రోధమేల? యీవిధి నీవుండగ కూరిమి దెలుపుము గారణమున్?
ఎవరిచేత దూషింప బడితివీ? ఎవరిచేత యవమానంబుల్?
భూశియందు బవళించుట యెందుకు? దోయజాక్షి! వే దెలుపగదే! 14

అన్ని విధములను శుభముల గూర్చెడి నలరు భర్తనై నే నుందన్!
నేల దొరలుచును రోదన యేలా? బాల! తెలుపుమా? విశదముగాన్!
రోగ మేమియో తెలుపుము సఖియా! రోదింపకు నే గనజాలన్!
భామిని! వే నీ బాధ నంతయును బరువు దీర్చెదరు ఘనవైద్యుల్! 15

ఎవరికి ప్రియమగు గార్యము జేసెదొ? యెవరికి యప్రియ కార్యంబున్?
ఎవరికి ప్రియమును జేయగవలెనో! యెవరి కప్రియము జేయవలెన్?
తెలుపుము విశదముగా కల్యాణీ! దీనత నొందకు వేదనలన్!
చంపదగనివానిని జంపించెద! చంపదగిన వానిని బ్రోతున్! 16

అకించనుని ధనవంతుని జేసెద! నలరి ధనాఢ్యు నకించనుగా!
అట్టి వారలెవరో తెలుపుము సఖి గట్టిగ జేయుదు కల్యాణీ!
నేను, నాదు బరివారమంతయును నీ వశమే సుమ! భాగ్యవతీ!
గీచిన గీతను దాట నెపుడునూ కీరవాణి! నీ యాజ్ఞలకున్! 17

మనసున కోరిక దెలుపుము సఖియా! ప్రాణమిచ్చి సాధించెదనూ!
శంకింపకుమా! యే మాత్రమునూ! సఖియ! నీదు యధికారంబున్!
ఒట్టుపెట్టి నే దెలుపుచుంటినీ! గట్టిగ తెలుపుము నీ కోర్కెన్!
తప్పక జేసెద సారసాక్షి! నీ తపన కనుల జూడగ జాలన్! 18

ఈ వసుంధరను నా రథచక్రము యింతీ! పోవునో యంతయునూ!
నా యధికారము నీ వశమే గద! నా దంతయునూ నీది సుమా!
తూర్పుననున్నా దేశంబులు మఱి తోరపు దక్షిణ దేశములున్!
సింధు సౌవీర సౌరాష్ట్రంబులు శ్రీకర కాశీ కోసలయున్! 19

అంగవంగ మగధయు మత్స్యంబులు సంగతిగా ధన ధాన్యములన్!
బహురత్నంబులు బహు ముత్యంబులు బహు పశు గోగణ హిరణ్యముల్!
ఏది కావలెను? కోరుకొనుము సఖి! సాదరముగ బలుకుము దేవీ!
ఎందు కిటుల శోకించెదవే సఖి! కందగ నామది యంతయునూ! 20

ఎందు కిటుల నాయాస బడియెదవు యెందు కిట్లు భూశయనంబున్!
లెమ్ము! లెమ్ము! శోభనముఖి! భీరూ! లీలగ తెలుపుము నాపదనూ!
మంచుపొగను సూర్యుడు జీల్చినటుల్ యంచితముగ నీ వేదననూ!
తొలగించెద! యందాల బొమ్మవుగ తూలగ జేయకు నన్నిటులన్! 21

ప్రభు దశరథు వచనములను విని యా పడతి కైక తన మనసుననూ!
సంతసించి యప్రియమగు వాక్యము సరగున దెలుపక యింతయునూ!
వృద్ధుడైన తన భర్తను మాటల కృద్ధత బడిపీడించుటకున్!
ఉపక్రమించెను రాతి మనసుతో నుర్విని లేని విధముననూ! 22

(అయోధ్య కాండమున 10వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము-1వ భాగము

## 11వ సర్గము

[కైక రాజును ప్రతిజ్ఞాబద్ధుని జేసి పూర్వమిచ్చిన
రెండు వరములను గోరుట]

మన్మధు శరమున గొట్టబడిన యా మహీపాలు దశరథు తోడన్!
దారుణమగు వచనములను బలికెను ధర్మరహితముగ కైకేయీ!
పీడింపగ బడ లే దెవ్వరిచే దాడింపగ లే దెవ్వరిచే
నా మనసున నొక కోరిక వినుమా! నయముగా దీర్పగ వలెను సుమా! 1

అభిలాషను నే దీర్చెద ననుచును నంగీకారము దెలిపినచో
ప్రతిజ్ఞ జేయగ వలయు సుమా యా ప్రతినను జేసిన మీదటనే
ప్రీతిని దెలిపెద గోరిక యెదియో ప్రేమమీర నా వాంఛితమున్!
అనుచు బల్కె నా కైకేయీ సతి యలరుచు నా రాజేంద్రుడునూ 2

చిఱునవ్వులుగల యా కైకేయిని జేరి కేశపాశము బట్టి!
దశరథుడును జిఱునవ్వును నవ్వుచు దరుణి కైకతో నిట్లనియెన్
నీ కంటే మఱి ప్రియతము లెవ్వరు నీరజాక్షి! స్త్రీజన మందున్!
స్త్రీలయందు నీవును, పురుషులలో శ్రీరాముడు గద ప్రియురాలా! 3

అజేయుడును మఱి ప్రధాన పురుషుడు నా మహాత్ము రామునిపైనీ
ఒట్టు బెట్టుకొని దెలుపుచుంటినీ యిట్టె దెలుపుమా నీ కోర్కెన్!
రాముని జూడక క్షణము బ్రతుకనూ రమణీ! ధ్రువమిది నిశ్చితమూ
అట్టి రాముపై యొట్టు జెట్టుకొని గట్టిగ నీ కోర్కెను దీర్తున్ 4

నా ప్రాణమును తనూజుల ప్రాణము రహి నొసగుదు శ్రీరామునికై!
రాముడెగద! నా యాఱవ ప్రాణము రమణి! నీకు మఱి తెలియునుగా!
మంగళప్రద! అందాలబొమ్మ! యిదె క్రుంగుచుండె నా హృదయంబున్
స్పృశించి వేగము నుద్ధరింపుమా! హసించి దెలుపుము నీ కోర్కెన్! 5

ఎంత బలము నాపై గలదో మఱి యంతయు దెలియును ప్రియసఖియా!
శంకింపకుమా! ప్రేయసి నన్నిటు నుంకువ దప్పి ప్రవర్తింపనుగా!
నా సుకృతిపై యెటు బెట్టుకొని నయముగ నీ కోర్కెను దీర్తున్
మనసునగల నీ ప్రీతి యెద్దియో మానుగ తెలుపుము ప్రియురాలా! 6

భరతుని యభిషేకమును రాముని పన్నుగ వనవాసమును మదిన్
గలకోరిక విశదీకరింపగను గర్కశ బుద్ధిని గూడికొనీ!
వచియింపగనూ తగని వచనముల వరుసను బలికెను కైకేయీ!
పక్షపాతబుద్ధిని గూడికొనీ పన్నుగ యానందము దోడన్! 7

రాజు వచనముల విని యాకైకయు రహి సంతోషము నుప్పొంగి
మృత్యువువలె నతి భయంకరంబగు నతివ దెలిపె దన కోరికలన్
ఒట్టుబెట్టుకొని వరముల నిచ్చుచు గట్టిగ బలికెడి మాటలనూ!
అగ్నిదేవుడును నఖిల దేవతలు నరయగ విందురు భూపేంద్రా! 8

సత్యసంధుడును, మనోతేజుడును సరస గుణాఢ్యుడు నాదు పతీ!
వరముల నిచ్చుచు నున్నవాడు సూ! వరదేవతలారా! వినుడూ!
సుందరియగు నా కైకేయీ సతి సురుచిరముగ పతి నుబ్బించీ!
వరముల నివ్వగ సిద్ధమైన యా వసుధేశ్వరుతో నిట్లనియెన్! 9

మహారాజ! యిక జ్ఞప్తికి దెమ్మా! యా సురాసురుల యుద్ధమునన్!
ప్రాణముదప్ప మఱన్నియు బోయెను బన్నుగ రథ గజ యాయుధముల్!
అట్టి యుద్ధమున నిను రక్షించితి నలరి యొడ్డి నా ప్రాణములన్!
రెండు వరములను ప్రసాదించితివి నిండుమదిని సంతోషమునన్! 10

సత్యప్రతిజ్ఞా! పృథివీపాలా! సరగునిమ్మా వరములనూ!
దాచియుంచినా వరములు మాత్రము ధర్మజ్ఞా గోరుచు నుంటిన్!
ప్రతిజ్ఞ జేసిన వరముల నిమ్మా! ప్రభు దశరథ! జవదాటకనూ!
ఇవ్వక న న్నవమానించినచో యిల జీవింపను నే నింకన్! 11

ఈ విధముగ కైకేయి మాటలకు యింపుగ లొంగిన దశరథుడున్
లేడి వలను జిక్కిన విధంబుగా లేమ పన్నినా పాశములన్!

ఆత్మనాశనము జేసికొనగ వే యందు దూరె జిఋనవ్వులతో
ఇచ్చెద వరముల నంచు దశరధుడు మచ్చికతో కైకకు బలికెన్! 12

కామమోహితుం డైన దశరధుడు కైక వచనముల నొప్పుకొనెన్!
కరుణరహిత కర్కశ హృదయముతో కైక పలికె దశరధు దోడన్!
పృథివీపతి! మహారాజ! వినుము నిక ప్రీతిని యిచ్చిన వరములనే!
కోరుచుంటినీ కోర్కెల దీర్పుము గూరిమి జనసంఘము మెచ్చన్ 13

రాముని యభిషిక్తుని జేయుటకై రహి గూర్చిన సంభారములన్
నాదు సుతుడు భరతునకును నిపుడే నయముగ పట్టము గట్టవలెన్!
దేవాసుర యుద్ధమున సంతసిలి దీనిధి! యిచ్చిన వరములకున్!
రెండవ వరమును యాచించుటకును నిండు సమయ మిపు డొచ్చినదీ! 14

పదునాల్గేడులు రాముడు వనిలో బన్నుగ జటలను ధరియించీ
నార చీరలను కృష్ణాజినమున నయముగ వనమున నుండవలెన్!
శత్రుబాధ లేకుండగ భరతుడు జక్కగ రాజ్యము జేయవలెన్
ఇవియే కోర్కెలు! గోరుచుంటినీ యిదివఱ కిచ్చిన వరములనే
రాముండిపుడే వనము బోవలెను రయముగ కన్నుల నే జూడన్! 15

రాజరాజ! దశరథ మహారాజా! రమ్య సత్య శీలుడవు మఱిన్!
కులశీలములను బాటింపుము మఱి కూరిమి నిన్నును నీవు నికన్!
సత్యవాక్యమే పరలోకంబున బన్నుగ రక్షించెడి దనుచున్!
తపోధనులు దెల్పెడి వచనములను దగ వినుదువుగద! లోకమునన్! 16

అయోధ్యకాండ 11వ సర్గము సమాప్తము

★ ★ ★

# అయోధ్యకాండము - మొదటి భాగము

## 12వ సర్గము

[కైకేయి కోరిన వరములను విని దశరథుడు చింతించుట - విలాపము-
అట్టి వరములను గోరవలదని కైకేయిని ప్రార్థించుట]

మహారాజు విని కైక మాటలను మానసమున జింతిల్లుచునూ!
క్షణకాలము దపియించి పోయెనూ! తల్లడిల్లె వది శోకమునన్!
ఏమిది స్వప్నమ? చిత్తమోహమా? యెల్ల జ్ఞాన మది నశించెనా?
మనసున కేదో వ్యాధి వచ్చెనా? మఱి మదిక్రుంగుట యెందులకో? 1

దశరథు డీ విధి యాలోచించియు దగ శాంతిని నందకపోయెన్!
కైకేయీ మాటలచే లోకము కాలరాత్రి వలె గనిపించెన్!
చాలసేపటికిని సంజ్ఞను బొందీ సరగున కైకేయిని జూచెన్!
ఆడుపులిని జూచిన లేడికివలె నా దశరథుడును భయపడియెన్! 2

కటికనేలపై కూర్చుని యుండెను కనులు మూసి యుద్వేగముతో!
మంత్రములను బంధింపబడిన యొక మహా సర్పమునకు వోలెన్!
నిట్టూర్చుచు 'అయ్యో!' యని బలుకుచు నీరసంబులగు బల్కులతోన్!
'ఛీ!' 'ఛీ!' యనుచును కోపముతో దా జెరగున మూర్ఛను బొందుచునూ! 3

చిరకాలమునకు సంజ్ఞను బొందీ పొరలుచు నేలను దుఃఖితుడై
కైకేయిని తన నేత్రంబులతో గాల్చి వేయు చున్నటు బలికెన్!
క్రూరురాల! ఓ దుష్టచారిణీ! దురితురాల! కులవినాశినీ!
నా చేతను గానీ! మఱి రాక్షసి! నా రాముని చేతను గానీ!
జరిగెనేమి యపరాధంబులు మఱి జరిగెనేమి యపకారంబుల్? 4

తల్లివోలె నిను జూచుకొనును గద! తరగని భక్తిని రాఘవుడున్!
అట్టి రామునికి యనర్థ మిప్పుడు నిశ్చైదలచితివి యెందులకో!
రాజపుత్రి వని రమ్య శీలవని రమణి నిన్నపుడు దెచ్చితినీ!
కాల సర్పమును నింటికి దెచ్చితి కరుణహీనవని దెలియకనూ! 5

కోరికోరి నా వినాశనమునకు గోరి దెచ్చుకొంటిని గదవే!
మారి వనుచు నిను దెలియకపోతిని మానిని వని నిను దలచితినీ!
జీవలోక మంతయు శ్రీరాముని శ్రీకరముగ బొగడుచు నుండన్!
ఏమి దోసమని యడవికి బంపుట యే యపకారము జేసెననీ! 7

కౌసల్యాది సుమిత్రా రమణుల గడగి త్యజించును ప్రాణములన్
రాజ్యలక్ష్మినీ వదలుదుగానీ రాముని విడువగ లేను సుమా!
జ్యేష్ఠుడైన నా రాముని జూడగ స్థిర మానందము గలుగు మదిన్!
రాముని గనలేకుండిన నా మది రహి చైతన్యము నశియించున్!

రవి లేకుండగ జరుగు లోకమును రాత్రి చంద్రుడును లేకుండన్!
సలిలధార లేకుండ సస్యమును చక్కగ నుండును భూస్థలినీ!
ప్రాణము ప్రాణము రాముడు లేకను ప్రాణముండదీ దేహమున్!
పాపనిశ్చయము గల యోకైకా! పరగ వినుము నా పలుకులనూ! 8

ఇక జాలింపుము నీ నిశ్చయమును వింతిరో! గావుము నన్నింకన్!
నా శిరస్సు నీ పాదము నుంచెద నళినదళాక్షిరో! దయ గనుమా!
పరమ దారుణంబగు యాలోచన బరగ నెటుల వచ్చెను మదికిన్!
భరతునిపై నా ప్రేమ యెట్టిదో పరీక్షింప యిటు బలికితివో! 9

శ్రీరాముడు నా జ్యేష్ఠ పుత్రుడని స్థిరముగ దెలిపెద వపుడపుడున్!
రాముడె రాజ్యము నేల వలయునని రహి బలుకుచు నుండెద వెపుడున్!
అట్టి నీవు నటు బలుకు టెందులకు నలరి బరీక్షించుటకునునై
అడుగుచుంటివని మది నే దలచెద గడు గఠినములగు వరములనూ! 10

పరవశమున జాడీలకు లొంగి సురసుర శోకము నందితివీ!
శూన్యమైన యీ కోపగృహంబున సుదతి! నన్ను వ్యధ ముంచితివీ!
నీతివంతురాలవు గద రమణీ! నీతి దప్పి చరియింపవుగా!
వికృతి బుట్టెను సతి! నీ బుద్ధికి విలయమయ్యె రఘువంశమునన్! 11

విశాలాక్షి! యిది వఱ కెన్నడునూ విప్రియ యయుక్త కార్యములన్!
చేయలేదు సఖి! యెందుచేతనే చెలగి నీదు జెడు వాక్యములన్!

నవ్మృగజాలను కమ్మని మాటల నిమ్ముగ తెలుపుచు నుండెదవూ!
రాముడు భరతుడు సమానులనుచును రహి రాముడె యధికుం డనుచున్!12

అట్టి మహాత్ముని శ్రీరఘురాముని యరణ్యమున నివసింపగనూ!
ఎటుల గోరుచున్నావో తెలియదు గఠినముగా బదునాల్గేడుల్!
సుకుమారుడు! మిక్కిలి ధర్మజ్ఞుడు సుందరుండు నా శ్రీరామున్!
దారుణమగు నా యరణ్యమందున తరుణి! వసింపగ కోరితివీ! 13

శుభలోచని! రాముడు శుశ్రూషలు సుదతి! నీకు జేయును భక్తిన్!
దూరము బంపగ కారణ మేమీ క్రూరముగా బహు క్రోధముగన్!
భరతుని కంటెను రాముడు మిక్కిలి బహు వినయంబున నుండుగదా!
అట్టి భరతుపై రాముని కంటెను నలరుట యెందులకో జెపుమా! 14

అంతఃపురమున సేవకు లుండిరి యనేక మందియు స్త్రీపురుషుల్!
నీ సేవలు జేయును నాదరమున నీ మాటలు విను సేవకుడున్!
రాముడుదప్ప మఱెవ్వరు గలరూ? రహి దెలుపుము సఖి! నిక్కముగా!
అట్టి రామునీ యంపగ వనముల గట్టిగ దెలుపుము గారణమున్! 15

పరివాదము లపవాదంబులునూ బన్నుగ లేవా రామునిలో!
సర్వప్రజల ప్రియ కార్యంబులచే సహజ ప్రీతినీ బొందె నహో!
సత్యముచే లోకముల జయించును నిత్య దానముల దీనులనూ!
శుశ్రూషల గురువులను జయించును శత్రుల జయించు ధనుస్సుతో! 16

దానవీరుడును, దయావీరుడును, ధర్మవీరుడును, విక్రముడున్!
అట్టి రామునీ యరణ్యంబునకు నంపుట కారణ మేమి సఖీ?
సత్యదాన తప త్యాగ శౌచమును నిత్యార్జవమును, విద్యయునూ!
గురుశుశ్రూషయు నుత్తమ గుణములు గూర్మిగలవు రామునియందున్! 17

రాముడు గపటము నెఱుగనివాడును రమణి దేవతల సమానుడున్!
మహాఋషుల తేజము గలవాడును మానిని! జనులందఱి తోడన్!
ప్రియవాక్యంబుల బలుకు చుండు నప్రియవాక్యము లాడుడు నెపుడున్!
ప్రేమపాత్రుడగు రామునితో నప్రియ వాక్యము సెప్పుదు నీకై? 18

శమదమములు నింద్రియ నిగ్రహమును సత్య ధర్మ త్యాగంబులునూ!
కృతజ్ఞతయునూ, సర్వభూతముల గ్రూరత లేకను నుండుటయున్!
అట్టి సుగుణములు రాములిలో గల పట్టి సుగుణ తేజోరాశిన్!
రాముని సరి లేరెవ్వరు మఱి యిక రమణి! సత్య మిది తెలిపెదనూ! 19

ఆయువు దీరగ యంత్య భాగమున యలరెడి వృద్ధును దీనుడనూ!
దైన్యముగా విలపించెడి దీనుని దయాగొను మబలా! కడుజాలిన్!
సాగర పర్యంతయు నాదంతము సర్వరాజ్య ధన సంపదలున్!
సకల మిచ్చెదను శాంతింపుము సఖి! సారసాక్షి! దయజూపగదే! 20

అంజలితో నే నమస్కరించుచు నలరి పాదముల స్పృశియింతున్!
రాముని రక్షణ సేయుము దల్లిగ రహి నను గావుము ధర్మమునన్!
సర్వరాజ్య మభిమంత్ర పూర్వకముగ సరగున నీ కిచ్చెద నిపుడే
రాముని నన్నును వేఱు జేయకుము! రహి నే బ్రతుకను జీవముతో! 21

అంతట పాపిని యా కైకేయియు జింతజేయు నా దశరథునీ
దుఃఖముతో, వేదనతో నడలుచు దురపిల్లెడు నా దశరథునీ!
శోకసముద్రము దాటగా దలచు శూరుని రఘుకుల దీపకునీ!
క్రూరమైన పలుకులు బలికె నహో! క్రూర గ్రహంబుల జూపులటుల్! 22

మహారాజ! వరముల నిచ్చితివీ! మానుగ నిపుడే చింతిలుచున్!
కాదనుచుంటివి! కడు శోకముతో గడు బశ్చాత్తాపముతో తోడస్!
ధార్మికుండవని లోకమం దెటుల దగ జాటుకొందు విక రాజా!
సమాధాన మెటు జెప్ప కొనెదవో నర్వరాజ ఋషి సంఘమునన్! 23

ఏకైకేయీ కృపచే యింకను నిలపై జీవించుచు నుంటిన్!
ఆ కైకేయికి మాట యిచ్చి మఱి యది కాదంటిని యని బలుకన్!
నవ్వరె రాజులు నాల్గు ముఖంబుల దివ్వెలవలె వెలుగుచు వారున్!
చిన్నబుచ్చు కొందువు! నీ మొగమును చింతల బ్రొద్దును వ్రాలినటుల్! 24

వరముల నిచ్చెదనని బలికితివీ వరుసగ నే నడిగిన వన్ని!
అన్య భాషలను బలుకుచుంటివీ యన్య భూపతుల కందఱికిన్!

అపనిందలనూ దెచ్చుచుంటివీ యలరి సిగ్గునను దలవంపన్!
వేలు జూపి పరిహాసము జేతురు జాలి జూపకను రవ్వంతన్! 25

డేగ బావురము దగపును దీర్చి వేగ శైబ్యుడను దీరతతో!
తన మాంసంబును గోసి యిచ్చెగద తనువుపైని యాశను వదిలీ!
గ్రుడ్డి బ్రాహ్మణుని గోర్కెను దీర్పగ కూరిమి యలర్క దను రాజున్!
తన నేత్రంబుల దానము జేసెను దన వచనంబును నిల్పుకొనన్! 26

సురల కిచ్చినా మాట ప్రకారము సురుచిరముగ నా సాగరమున్!
చెలియలి కట్టను దాటుట లేదుగ విలయము వచ్చినను గూడన్!
పూర్వపురుషులా చరిత్ర లన్నియు బొలుపుగ స్మరింపు మనసుననూ!
ఆడినమాటను దప్పబోకుమా! వీడకు సత్యము రాజేంద్రా! 27

సత్య ధర్మముల బరిత్యజించీ ప్రభుని జేసి శ్రీరాములనూ!
కౌసల్యా సతి గూడి నిత్యమును గమ్మని సుఖముల నందగనూ!
నేను కోరినది ధర్మంబైనను నిజముగ యధర్మమైన వినూ!
సత్యమైన మఱి యసత్యమైనను సాక్షిగ యుండిరి దేవతలున్
ఇచ్చిన వరముల గాదన బోకుము! నిచ్చకంబు లివి కాదుగదా! 28

రాము డభిషిక్తుండైన నే నికను రయమున విషమును ద్రాగెదనూ!
చూచుచుండగా నే మరణింతును చోద్యముగా దిది నిక్కముగా
రాముని మాతకు నొక రోజైనను రహి నమస్కరించుట కంటెన్!
మృత్యుదేవతకు బలియగుటే సరి సత్యసంధ! శ్రేయస్కరమూ! 29

భరతుని పైనీ యొట్టు బెట్టుకొని బన్నుగ తెలుపుచు నుంటినిగా!
రాముని ప్రవాస మంపుము లేదా రహి నే నిలపై నుండనుగా! 30

ఈవిధి యా కైకేయి బలికి మఱి నింపుగ మాటాడక యుండన్!
దశరథు డెంతగ విలపించిననూ దయారహితయై యటు లుండెన్!
కైక కోరికలు విని దశరథుడును క్షణకాలము నిశ్చేష్ఠుడునై!
కదలక మెదలక కన్నీళులతో కైకతోని బలుకగ లేదూ! 31

అప్రియమగు నా కైక మాటలకు యారాజును ననిమిషుడునునై!
కైకవంక మఱి రెప్ప వాల్పకను గడు దీనతతో గాంచుచునూ!
దుఃఖశోకమును గూడికొనినదీ క్రూరమైన యావాక్యములన్!
విని యా దశరథు డంతరంగమున వేల తరంగము లుదయించెన్! 32

కైక నిర్ణయము ఘోర శపథమును గలవర బరుచును దశరథుడున్
నిట్టూర్పులు విడుచుచు 'రామా!' యని నేలవడెను వృక్షము వోలెన్!
నష్టచిత్తుడగు బిచ్చివానివలె కష్ట చిత్తుడగు భోగి వలెన్!
మంత్రాదులచే శక్తి దొలంగిన మహా సర్పమును వలె నుండెన్! 33

దీనవదనుడై దశరథు డంతట దైన్యముతో గైకకు బలికెన్!
పైకి లాభకరముగ కన్పించుచు బన్నుగ యనర్థ దాయకమున్ !
ఈయాలోచన నెవ్వరు జెప్పిరి నింపుగ చేయు మటంచు మఱిన్!
భూతము పట్టీ చెడిన మనసుగల పొలతి బలికినటు బలికెదవూ! 34

ఎన్నడు జూడను బూర్వ మెన్నడును నీ విపరీతపు బుద్ధులనూ!
ఇప్పు డట్టి విపరీత బుద్ధులను నీ విధి గాంచుచు నుంటి సఖీ !
భరతుడు రాజ్యము నందవలయునని బన్నుగ రాముడు నడవులకున్!
బోవగ గోరుచునుంటివి సఖియా! యెవరి వలన భయమందితివీ? 35

భర్తకు, భరతునికిని, లోకానికి బాగుజేయ మది గోరినచో!
ఇట్టి కోరికల గోరకు రమణీ! యిట్టె వదులుమా మా భావములన్!
క్రూరురాల పాపిని! దుర్వర్తిని క్రూర భావములు మాలోనన్!
రామునిలో, నాలో కన్పించెను? రహి దెలుపుము నపరాధములన్! 36

రాముని కాదని భరతు డెపుడునూ! రాజ్యము సేయడు కైకేయీ!
ధర్మ విషయమున భరతు డెపుడునూ మర్మ మెఱుగు రాముని కంటెన్!
'వనము జను' మనుచు నెటుల బలుకుదును వివర్ణమగు రాముని ముఖమున్
గ్రహణము పట్టిన చంద్రు గాంచినటు రహి గాంచుదు నా సుకుమారున్! 37

సకల బంధు మిత్రులతో గూడుక చక్కని యోచన జేసితివీ!
అట్టి యోచనను శత్రుసేన లవి యిట్టె త్రిప్పి కొట్టినరీతిన్!

నీ విటు విఫలము జేయుచుండగా నిలిచి యెటుల నే బరికింతున్?
నేమవి యందురు రాజులందఱును నెటుల పాలనము చేసెననీ? 38

గుణవంతులు, వృద్ధులు, బండితులును గూడివచ్చి రాముని యడుగన్!
ఏమని దెలుపుదు? నెటుల జరింతును? నెందుబోదు నే కానలకున్?
'రాము నడవికిని బంపితి' ననుచును రయమున నిజమును దెలిపిననూ!
నమ్మ రెవ్వరును నసత్య మందురు నాతి! విడువు నీ పంతమునూ! 39

రాము డడవికిని బోయినచో నిక రమణి కౌసల్య యేమనునో!
ఇంతటి యప్రియ మొనర్చి యామెకు నే రీతిని జూపుదు ముఖమున్?
దాసివోలె సఖివలె భార్యకువలె భగినివోలె దల్లికి వలెనూ!
సేవ సేయుచుండును నా కెపుడును జిరదాసిని వలె సంప్రీతిన్! 40

సత్కారార్హ యగు కౌసల్యకు సత్కృతి నే జేయక పోతిన్!
నీపై నున్న వ్యామోహముచే నీరు కోప భయముల వలనన్!
సఖియ! నీకు నెన్నో సత్కృతులను జక్కగ జేసితి నా నాడున్!
విష వ్యంజనముల దిన్న కూడువలె వికటముగా నున్నది సఖియా! 41

నేను జేయు నపకృతిని రాముడును నిలువక యడివికి జనుచుండన్!
భయపడి సుమిత్ర విశ్వసించు నెటు భద్ర మనుచు దన మదిలోనన్
నాపంచత్వము రాము వివాసము నయముగ విని వైదేహి యునూ!
దుఃఖముతో మది నెంత గుందునో దుఃఖముపై దుఃఖము గాగన్! 42

మంచుకొండ ప్రాంతమున కిన్నరుని మానుగ కిన్నర విడివడుచున్!
శోకించెడి విధి సీత శోకించు శోకములో నే మరణింపన్! 43

రాము డరణ్యమునకు జనుచుండగ రమణి సీత యేడ్చుచు నుండన్!
అట్టి దృశ్యమును గాంచి యీ జగతి గట్టిగ కోరను జీవింపన్
విధవరాలివై సపుత్రకునితో వికసింపుము ధర నేలుచునూ!
రాము డరణ్యము బోవ బ్రతుకనూ రహి నా ప్రాణములును బోవున్! 44

విష కలుషితమగు మదిరను ద్రావి విర్రవీగినటు మానవుడూ!
నీ సౌందర్యము జూచి మెచ్చితిని నీ గుణములు మది గనలేకన్!

అసత్యంబులగు మాటల నాడీ యాటలాడి ప్రేమించితినీ!
వేటగాడు బాడుచు మగలేడిని యీటఁ బొడిచినటు బొడిచితివీ! 45

అనార్యుడని నిందింతురు నన్నిక నార్యులందఱును లోకమునన్!
పుత్రు నమ్ముకొన్నట్టి నీచుడని పురవీధుల జను లనియెదరూ!
మద్యపానమును జేసిన విప్రుని మానుగ నిందించిన రీతిన్
నను నిందింతురు! దప్పదు! దప్పదు! ధాత్రిని నేనుండగ దగనూ! 46

ఎంత కష్టమిది! ఎంత కష్టమిది! కాంత! నీదు మాటల నలనన్!
ఈ మాటలు బడవలసి వచ్చెగద! ఇంక బ్రతుకుటయు నెందులకూ!
పూర్వజన్మమున జేసిన పాపము పాలతి! యనుభవమునకు వచ్చెన్!
తప్పదు! పాపము ననుభవింపవలె దప్పక నే నీ దుఃఖములన్! 47

పాపాత్ముడ! నే బాపము జేసితి బన్నుగ నిను నే బెంచితినీ!
ఉరిత్రాడైతివి నా కంఠమునకు నుర్వి జనులు బడి నవ్వంగన్!
మృత్యుదేవతవు! దెలియకపోతిని తీయగ విహరించుచు నీతో!
పాప త్రాచుపై హస్త ముంచునటు బరగ జేరదీసితి చెలియా! 48

మహాత్ముడగు నా శ్రీరామునికిని మానుగ నే జనకుడ ననుచున్
చెప్పుకొనుట గూడను దప్పే సుమ! వేరి ప్రపంచము దూషించున్!
కాముకుడగు నా దశరథేశ్వరుడు కలికి మాట విని శ్రీరామున్!
అడవికి బంపెను నెంత మూర్ఖుడని నలరి బల్కెదరు హాస్యమునన్! 49

వ్రతముల తోడను, బ్రహ్మచర్యమున వర గురు శుశ్రూషలతోడన్
కృశించిపోయిన రాముడు మఱలను వసింప వనముల బోనుండెన్!
ఎంతకష్ట మిటు వచ్చిబడినదీ సుంత సిగ్గు లజ్జను లేకన్!
నాదు మృత్యువును గోరుచుంటివే నాతివి గావే! రక్కసివే! 50

నా వనములను ద్రోసి పుచ్చడే నా రాముడు నే జెప్పగనే!
అడవికి బొమ్మనగా ‘నట్లే’ యను బోవును దా గాఱడవులకున్!
నే వనమునకును బొమ్మన రాముడు ‘నే బో’ననినను బాగుండున్!
నా మాటను గాదన బ్రియమందుదు నా యానను గాదనడు గదా! 51

శుద్ధ భావకుడు శ్రీ రఘురాముడు శుద్ధ హృదయమును గలవాడున్!
నా మాటను గాదనడు 'మంచి'దను నను దేవునిగా భావించున్!
రాముడు వనమునకును జన లోకము రహి నిందించును గఠినముగా
అక్షమనీయుడనైన నేను నిక యమలోకంబునకును బోదున్! 52

మానవ శ్రేష్ఠుండైన రాముడును మఱి వనవాసంబునకు జనన్!
మరణింతును! నే దక్కిన జనులను మారి! యెటు లెటుల జేసెదవో!
నన్ను రాముని లక్ష్మణులను మఱి నయముగ శత్రుఘ్నుని విడిచి!
దుఃఖము నోర్వక కౌసల్యాసతి దురపిల్లుచు దా మరణించున్! 53

కైకేయీ! యిక సుఖముగ నుండుము! గష్టములను మము బడవైచి!
రాజమాతవై ధాత్రి యంతయును రమణి! యేలు! వైభవముగనూ!
శుద్ధమైన యిక్ష్వాకు వంశమున సూరిజనులు మది మెచ్చినదీ!
కోడలివైతివి యట్టి వంశమున గూకటి వ్రేళ్ళను బెకలింపన్! 54

రాముడు వనవాసమునకు బోవుట రహి భరతుండును మెచ్చినచో!
ప్రేతకార్యమును జేయగ దగడూ! ప్రీతి దిలోదిదక మివ్వగనూ!
హన్త! అనార్యే! కోరిక దీరును నడవికి రాముడు బోవగనూ!
నే మరణించిన పిమ్మట విధవగ నిఖిల భుస్థిలిని యేలు మికన్ 55

ఇంతకాలమును రాజ పుత్రిగా కాంత! యుంటివీ నా యింటన్!
అపకీర్తియు, యవమానము దప్పవు నందక తైనని మురిసిలినీ!
పాపము జేసిన వానికి వలె నను బరగ జూచు జను లందఱునూ!
అనాదరముతో నన్ను గాంచు నే నందుద నైతిని నిను బొందీ! 56

ఇంతవఱకు ప్రభువుగ నా రాముడు చింతలేక రథగజములపై
పయనించెడి సుకుమారుడు నిపు డెటు బయనించును గాలినడలలో!
ప్రశస్తమగు బోజన భాజనముల బన్నుగ భుజించు కొమరుండున్
కటు కషాయ తిక్తముల నుండెడీ కందమూలముల నెటుల దినున్! 57

అమూల్య వస్త్రములను ధరించుచును నలరెడి నా శ్రీరాముండున్!
నారచీరలను నెటుల గట్టు నిక నయముగ భూస్థలి శయనించున్?

రాము దరణ్యమునకు బోవలెనని రాజుగ భరతుని జేయమనీ!
దారుణమగు నీ వాక్యము నెవ్వరు దరుణి! జెప్పిరో దుర్బోధల్? 58

స్త్రీలందఱునూ జిఱుతబుద్ధులు సుమ! స్వీయ లాభముల గోరుదురూ!
స్త్రీలందఱినీ నిందింపను నే స్థిర గౌరవమున గాంచెదనూ!
భరతుని తల్లిని గూర్చి మాత్రమే దగ నిందించుచు నుంటినిగా
ధాత్రి యందు నిటువంటి పత్నులూ దగ నెవరికి యుండగరాదూ! 59

అనర్థ బావకురాల! వేదనను నఖిల జనంబుల కందింపన్
నిశ్చయించితివి! నిజముగ తెలుపుము! నీ మనసునగల మర్మమునూ!
నీ హితంబు మఱి నీ క్షేమంబును నిజముగ గోరుదు మెల్లపుడున్!
అట్టి మా వలన భయపడుచుంటివి మన రాముని వలనను, నాచేన్! 60

కష్టములను రాముడు జిక్కుట గని కష్టమొందు బుర మంతయునూ!
తండ్రులు బుత్రుల, స్త్రీలు భర్తలను దగ విడిచెద రతి దుఃఖమునన్
దేవకుమారుని వలె వచ్చెడి యా ధీరుని రాముని జూడగనే
ఆనందింతును యౌవన వంతుడ నైనటు బ్రాయము వచ్చినటుల్! 61

సూర్యుడు వెలుతురు నివ్వకపోయిన సురుచిర వర్షము రాకున్నన్!
నడుచును లోక వ్యవహారంబులు నయముగ రాముడు వనమునకున్!
బోవుట జూచిన వాడు బ్రతుకడూ! హౌలుపుగ యయోధ్య పురమందున్!
'రామా' 'రామా' యని మరణింతుతురు రయమున రాముని విరహమునన్!

నా వినాశమును గోరెడిదానవు నాకు మృత్యు దేవతవు నినున్!
ఇన్నినాళ్లు దగ్గఱ నుంచుకొనీ యింగిత జ్ఞానము గోల్పోతిన్
మహా విషాహిని యంకమునందున మధురముగా మన్నించితినీ!
చేసిన తప్పును ననుభవింపగా జిరానుభవ మిపు దరుదెంచెన్! 63

నాకు, రామునకు లక్ష్మణునకు మఱి నయముగ భరతుడు దూరుండై!
సీతో జేరీ బంధుపులందఱ నిల సంహారము జేసి మఱిన్
నగర గ్రామములు, రాష్ట్రము నంతయు నర్మిలి బరిపాలింతువుగా
కఠినురాల! యిక నా శత్రువులకు గలుగ జేయు మానందంబున్! 64

వ్యసనప్రహారిణి! నృశంసవృత్తే! యే వాక్యములను బలికితివో!
దంతము లన్నియు ముక్కలు గావే కాంత! రాల వవి యెందులకో!
అహిత మప్రియము బలుకడు రాముడు నలరుచు జేయును ప్రియములనూ
ఆరాముని విషయంబున దోషము లాడిపోయుచుంటివి యెటులన్? 65

ఏడ్చి పొమ్ము! మఱి మండి పొమ్ము! మఱి యిలబడు! సహస్రకణములుగా!
అతి దారుణమగు వచనము దీర్పను అహితంబగు నీ వరములనూ!
పడతి! నీవు నొక మంగలికత్తివి! బన్నగ యసత్య వచనవుసూ!
కులధ్వంసిని! పాపాత్మురాల! మది కాల్చ బూనుకుంటివి గదవే! 66

రాముడు లేకుండిన నా దాపున రహి నా జీవితమే లేదూ!
బ్రతికి యుంచగా సింక యెచ్చటిది పంకజాక్షి యానందంబున్?
అహితంబును మఱి నాచరింపకుము! నకార్యమును మఱి జేయకుమా!
అనుగ్రహింపుము బాదము ముట్టెద యవమానం బని దలపకనూ! 67

కృతఘ్నురాలగు కైకేయీ సతి కుదురుగ ఘాతము గలిగింపన్!
అనాథునిగ విలపించుచు రాజును నామె పాదములు స్పృశియింపన్!
స్పృశింపకుండగ కైక పాదముల మసలుచు దూరముగా జరిపెన్!
రోగగ్రస్థునిగ నేలమీద వడె రూఢిగ మతి లేకను రాజున్!

(అయోధ్య కాండమున 12వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యకాండము 1వ భాగము

## 13వ సర్గము

[దశరథుడు విలపించుచు, కైకను బ్రతిమాలుట]

దశరథు డంతట దీనస్థితినీ తనదు మహాదశ గోల్పోయి!
దివిజ లోకమున నుండి యయాతియు భువిపై బడిపోయిన యటులన్!
క్రిందపడిన యా రఘుకుల తిలకుని గాంచక భీతాత్మయు గాకన్!
జంకు గొంకు లేకను నా వరముల సంకటవల్లి మఱల బలికెన్! 1

'సత్యవ్రతుడనని దృఢవ్రతుండనని నిత్యము బడాయి పలికెదవూ!
నా యీ వరముల ననుగ్రహింపక వాత్యమాడుచుంటివి యేలా?
ఈ విధముగ కైకేయి పలుకగా నీసు జెంది యా దశరథుడున్!
ముహూర్తకాలము స్పృహనుదప్పి మఱి ముదితనుగాంచీ యిటు లనియెన్!

దుష్టురాల! నే బోయిన పిదపను జిట్టడవుల రాముడు బోవన్!
కోరిక దీరీ సుఖము నుండెదవు కూరిమి హా! యది! దుఃఖముగా!
దివి నే నఱిగిన రాముని కుశలము దివిజులు యెదురయి ప్రశ్నింపన్!
కుశలమంచు నే నెటుల దెలుపుదును గుదురుగ నిజమును దాచుచునూ! 3

కైకేయికి బ్రీతిగ శ్రీరాముని గాఅడవుల బంపితి నంచున్!
నిజము దెలిపినను నమ్మ రెవరునూ నిందింతురు వ్రేలిని జూపి!
అపుత్రుకుడనై చాల కాలమును నందితి బుత్రుల నీ నాడున్!
అట్టి పుత్రులను నడవికి బంపీ యిట్టి ధరను జీవింతు నెటుల్? 4

శూరుడు, ధీరుడు, శాస్త్ర విదుండును సురుచిర రూపము గలవాడున్!
క్షమాపరుడు శ్రీరామచంద్రుడునీ కాఅడవుల కెటు బంపుదునూ!
నల్లని మబ్బుల వన్నెల వాడును, జల్లని చూపులు గలవాడున్!
మహాబలుడు నభిరాముని రాముని మహాటవుల నంపుదు నెటులన్? 5

సుకుమారుడు శ్రీరాముడు నిరతము సుఖముల నందుట జూచితినీ!
బహుకష్టంబుల నందుచుండగా భరింపగల నెటులను మదినీ!

వనము బంపి దుఃఖము గలిగించీ జనము నవ్వగా బ్రదుకకనూ!
ఈ క్షణమందే నే మరణించిన నింపగు సుఖమును గలుగునుగా! 6

క్రూరురాల! రఘుకుల వినాశినీ! క్రూరకర్మ లిటు లెందులకే?
సత్య పరాక్రముడైన రామునికి యత్యాచారము లెందులకే?
అంతులేని యపకీర్తి బొందుదును కాంత! నిజము నా వంశమునూ!
రాజలోకమున నవ్వుల పాలై రహి నే బొందుదు నరకమునూ! 7

పరిభ్రమిత చేతనుడై రాజును బరితపించుచును విలపింపన్!
అస్తాద్రిని జేరెను రవి ప్రభలును యలరి రజని పరుగున వచ్చెన్!
విలపించెడి యా దశరథ రాజుకు విమలమైన యా రాత్రియునూ!
చంద్రమండలా మండితమైనను సాంద్ర తమస్సులు గనుగ ప్పెన్! 8

వృద్ధుడైన యా దశరథ రాజిటు సిద్ధుడైన యోగికి వోలెన్!
ఆకాశము వంకను జూచుచునూ యతి దీనముగా విలపించెన్!
మంగళప్రదమగు భగవతి శర్వరి మఱి దెలవారకుమా! దయతో
అంజలి బద్ధుడ! ప్రార్థన వినుమా! యలజడి గలిగింపకు మదినీ! 9

ఇటుల బలికి యా దశరథేశ్వరుడు నింపుగ దోసిలి బట్టుకొనీ!
కైకేయిని బ్రార్థించె వినయముగ కరుణ గలుగ ప్రియ వాక్యములన్!
భద్రే! రాణీ! సాధువర్తనుడ బహు దీనుండను! దాసుడనూ!
గతాయుష్కుడను! రాజును సుమ్మా! కడగి చూడుమా! సంప్రీతిన్! 10

సుశ్రోణీ! నే జెప్పున దంతయు శూన్య ప్రదేశమునకు గాదూ!
బాలే! నీకే జెప్పుచుంటినీ! భవితవ్యము యోచింపు మదిన్!
నా విషయము యోచింపుము సఖియా! నన్ననుగ్రహింపుము దయతో!
తియ్యని హృదయము గల దానవుగా! దేనెలు రాల్పుము నాపైనీ! 11

ప్రసీద దేవీ! యనుగ్రహింపుము! ప్రజల మాటలను వేదననూ!
నా రాజ్యము నీదే రాఘవునకు నయముగ నిమ్మా సంప్రీతిన్!
అసితాపాంగే! యందు యశస్సును నా విధముగ చిరకాలమునూ!

గురుశ్రోణీ! ఓ చారుముఖేక్షణి! కూరిమి జేయుము సంప్రీతిన్!
నాకును నీకును మన గురువులకును నయముగ భరతునికిని ధరకున్ 12

రాజు! భర్త! యతి విశుద్ధ హృదయుడు రహి దీనత కన్నీరొలుకన్!
ఆ దశరథు కరుణా విలాపమును నా కైకేయియు రవ్వంతన్!
కఱుగలేదు మది చెదరలేదుగా గఠిన శిలకువలె మౌనముగా!
తనదు గోరికల దీర్పుమనుచు నా తరుణి నిలిచె శిల్పము వోలెన్! 13

ఎంత జెప్పినను సంతోషింపదు నెంత దెలిపినను వినదు గదా!
రాఘవు నడవికి బంపవలయునని రహి బలికెడి నా కైకేయిన్!
కనుల జూచుచును గలవరమందుచు గన్నీరొలుకుచు మూర్ఛితుడై!
వృక్షము గాలికి నేల బడినయటు వృద్ధరాజు నేలను బడియెన్! 14

మానవంతు డా దశరథేశ్వరుడు మది వేదన నిట్టూర్పులతో!
రాత్రి యంతయును గడిచిపోయినది రమ్య ప్రభాతము నేతెంచెన్!
వంది మాగధులు మేలుగొలుపగా వచ్చిరి జయ జయ గీతికలన్!
రాజసత్తముడు నివారించెనూ రయమున వారిని బొమ్మనుచున్! 15

అయోధ్యకాండము 13వ సర్గము సమాప్తము

* * *

# అయోధ్యకాండము-1వ భాగము

## 14వ సర్గము

[కైకేయి దశరథుని సత్యము దప్పకుమని నిర్బంధించుట
దశరథుడు స్పృహదప్పుట-రాజాజ్ఞచే సుమంత్రుడు
రాముని దీసికొని వచ్చుటకై పోవుట]

పుత్రశోకమున సంజ్ఞ లేమిచే భువి పతితుండగు దశరథునీ!
నేల దొరలు నా దశరథ రాజును నిశితముగా కైకయు బలికెన్!
ఏమిది రాజా! నా కిచ్చిన యా నింపగు వరముల దలచుకొనీ!
పాపము జేసిన వానివోలె గడు బశ్చాత్తాపము నొందెదవూ!
మర్యాదను బాటింపుము రాజా! మాట నిలుపుకొను బలికినదీ! 1

ధర్మవిదులు సత్యమును బలుకుదురు పరమ ధర్మమని లోకమునన్!
అట్టి ధర్మమును నాశ్రయించి నే నలరుచు బ్రేరేపించితినీ!
భూపతి శైబ్యుడు దన శరీరమును బులుగు కర్పణము జేసియునూ!
చేసిన ప్రతిజ్ఞ దీర్చి బోయెనూ చిరకాలము గీర్తిని గలుగున్! 2

అటుల నలర్కుడు గూడ బ్రతిజ్ఞను నలరుచు దన నేత్రంబులనూ
గ్రుడ్డి బ్రాహ్మణున కర్పణ జేసెను గుత్సిత మింతయు లేకుండన్!
సరితా పతియును జెలియలికట్టను సరగున దాటక యుండుటయున్!
సత్యము బాలించుట వలననె సుమ సత్యము వదలరు ధార్మికులన్! 3

రాజా! సత్యము ధర్మ స్వరూపము రహి ధర్మము సత్యమె సుమ్మా!
సత్యమె సమస్త వేదశాస్త్రములు సత్యమె మోక్షము గలిగించున్!
పరమ పురుష! నీ బుద్ధి ధర్మమున బన్నుగ నిలిచిన గడు వేగన్!
సత్యము బాటింపుము! నా వరముల సఫలము జేయుము భూపేంద్రా!
వరముల నిచ్చినవాడ వీవె గద వాసిగ సాక్షులు దేవతలున్! 4

నీ ధర్మంబును నీవు నిలుపుకొను నే జేసితినీ ప్రేరణమున్!
రెండు కారణంబులచే రాముని దండక యడవికి బంపు మికన్!

పలుకుచుంటి నే మూడు సారులను బంపుము! బంపుము! బంపు మనన్!
మన యొప్పందము దప్పి చరించిన నను ద్యజించినటు భావింతున్!
నీ యెదుటను నే నసువులు బాసెద నిలిచి చూడు! నే నిపు డిపుడే! 5

జంకు గొంకు లేకను గైకేయీ! శంకలేక నా దశరథుని!
ధర్మపాశమున జిక్కించుకొనెను ధార్మికుడగు నా నరనాథున్!
కైక పన్నినా ధర్మ పాశమున కరణాంబుయు దా దశరథుడున్!
వలలో బడినా చేప చందమున విల విల లాడుచు స్పృహ దప్పెన్! 6

కాడికి చక్రము మధ్యను బడినా కలతబడెడు వృషభము బోల్కిన్!
రాజు హృదయ మటు మథనము జెందెను రహి ముఖంబుల[illegible]!
విహ్వలమగు దన నేత్రాంచలముల విపరీతంబగు చూపులతో!
అతి కష్టముగా బలుకు బలుకుచును నా కైకేయికి నిటుపలికెన్! 7

అగ్నిసాక్షిగా మంత్ర యుక్తముగ యలరి గ్రహించితి హస్తమును!
అట్టి హస్తమును భరతుని నిన్నును నట్టె వదలివేయుదు నింకన్!
శర్వరి గతించె ప్రభాత మాయెను సఖి! యేతెంచుదు గురుజనమున్!
రాముని కభిషేకము జేయుటకై రహి నను ద్వరితము జేయుదురు! 8

రాముని కభిషేకము జేయంగను రహి విఘ్నము గలిగించినచో!
తిలోదకంబులు జేయరాదు సూ! చెలియ! నీవు నీ సుపుత్రుడున్!
రాముడె చేయగవలె జలతర్పణ రాముడె చేయగ వలయు శ్రాద్ధమున్!
ఎటుల జూతు నే ప్రజల ముఖంబును నెటుల జూతు జన సమూహమున్! 9

మహాత్ముడగు నా దశరథేశ్వరుడు మానుగ యిటు బలుకుచు నుండన్!
చంద్ర తారలను గూడిన శర్వరి సాంద్ర సంధ్య ఉదయంబయ్యెన్!
పాపపు టాలోచన గల కైకయు బరుషముగా గోపము తోడన్!
దశరథేంద్రుతో బలికె నిట్టులను దయలేకను గడు గ్రోధముతోన్! 10

విషబాధకు సమమగు బల్కుల నిటు విషమయముగా బలుకుట యేలా?
శీఘ్రముగా బిలిపింపు రాముని శీఘ్రము జను మను వనములకున్!

నా కుమారునికి బట్టము గట్టుము! నయముగ శత్రులు లేకుండన్!
కృతకృత్యుండవు గమ్ము నరేంద్రా! మతి సుస్థిరమును జేసికొనీ! 11

కొరడాతో గొట్టిన యశ్వమువలె గూరిమి చైతన్యము దోడన్!
మాటలజేతను బాధపబడిన యా మానసీయు డిటులను పలికెన్!
ధర్మపాశమున గట్టుబడితిపి ధ్వంసమాయె నా బుద్ధియునూ!
ధార్మికుడగు నా జ్యేష్ఠపుత్రుని దర్శింపగ గోరుచు నుంటిన్!

తెలతెల వారెను! రవి యుదయించెను తీయని సంభారంబులతో!
పుష్యమి నక్షత్రమును గూడినది పుణ్య ముహూర్తము నేతెంచెన్!
గుణసంపన్నుండగు వసిష్ఠుడును గూడిన పరివారము తోడన్!
అభిషేకంబున కలరు వస్తువులు నలరుచు దెచ్చెను నయోధ్యకున్! 13

అయోధ్య వీధులు నీరు జల్లవడె నందమైన తోరణములతో!
నలంకరించిరి! జల్లిరి వీధుల నలరెడి రంగుల పూవులతో!
అందమైన పూదండలు గట్టిరి యందఱు సంతోషము తోడన్!
ఎచ్చట జూచిన మహోత్సవములే యెటు జూచిన యానందములే! 14

దేవేంద్రుని యమరావతి యయోధ్య దివిజుల వలెనుండిరి ప్రజలున్!
నగరప్రవేశము జేసి వసిష్ఠుడు నరనాథుని యంతఃపురమున్!
గుంపులు గుంపులుగా నుండిరి యట గూరిమి బ్రాహ్మణ సంఘంబున్!
పట్టణప్రజలను గ్రామవాసులను గదలి వచ్చిరట వేడుకగా! 15

మహర్షి యగు నా వసిష్ఠుండునూ మానుగ యంతఃపురముననూ!
కాంచి సంతసిలె కడు వేగముగా నంచితముగ లోనికి నరిగెన్!
అంతలోనె సారధి సుమంత్రుడును పింతగ వచ్చెను వెలుపలికిన్!
పండితుడగు నా సుమంత్రుతోడను దండి వసిష్ఠుం డిటు లనియెన్! 16

నేను వచ్చినటు రాజుకు దెలుపుము నియమిత కార్యము జేయగనూ!
గంగా జలములు సముద్రోదకము గడునింపిన కలశంబులతో!
మేడి కఱ్ఱతో జేసన పీఠము మేదినీశ్వరున కొచ్చినదీ!
సర్వబీజములు సర్వ ధాన్యములు సమస్త గంధము లొచ్చినవీ! 17

వివిధములగు రత్నములు ముత్యములు విమలమైన తేనెయు, బెరుగున్!
నేయి, దర్భలును, పేలాల్, పువ్వులు, సిరు గలువనీ క్షీరంబున్!
కన్యలు నెనిమిది మంది మఱియునూ కలకలలాడెడి యేనుగుయున్!
నాల్గు గుఱ్ఱములు గట్టిన రథమును నయముగ ధనుస్సు, ఖడ్గమునూ! 18

పల్లకి, ఛత్రము, వింజామరులును భవ్య హిరణ్మయ పాత్రమునూ!
బంగరు బగ్గములను సమకూర్చిన రంగుగ తెల్లని వృషభమునూ!
శ్రేష్ఠమైన హయమును మఱి యింకను శ్రీకరమగు సింహాసనమున్!
పరమ శ్రేష్ఠమగు బులి చర్మంబును బ్రజ్వలించు నగ్నియు గూడన్! 19

సకల వాద్యముల సముదాయంబును సకలాలంకృత స్త్రీ గణమున్!
ఆచార్యులు, బ్రాహ్మణులు, గోవులును నలరు బుణ్యమృగ పక్షులునూ!
పౌరులు, పల్లీయులు, శిల్పులు మఱి పట్టణవాసులు వర్తకులున్!
రాజులు, సామంతులు, శ్రీమంతులు రయముగ వచ్చిరి వేడుకగన్! 20

సూర్యోదయమున శుభ ముహూర్తమున శుభకరముగ శ్రీరామునికిన్!
అభిషేకంబును జేయుట కొఱకై యతి త్వరితము జేయుము రాజున్!
మహాత్ముడగు నా వసిష్ఠదేవుని మాటను విని యా సుమంత్రుడున్
రాజశ్రేష్ఠుని కీర్తించుచునూ రాజమందిరములో జొచ్చెన్! 21

రాజ సమ్మతుండైన సుమంత్రుడు రయమున యంతః పురమునకున్!
ద్వారపాలకుల దాటి లోపలకు దరిజేరెను దశరథు కడకున్!
రాజు పరిస్థితి దెలియ లేకనూ! రహి సంతోషము గూడికొనీ!
ఆనందములగు వాక్యములతో నలరి స్తుతింపగ మొదలిడెనూ! 22

సారథి యగు నాసుమంత్రు డంతట సరసముగా నంజలి తోడన్!
యథా కాలముగ జగతీపతినీ యథారీతిగా స్తుతియించెన్!
సూర్యోదయమున మహాసముద్రము శుభానందమును నొందు నటుల్
నీవును నానందమును బొందుచు! నిండు మనసుతో నీ వేళన్! 23

ఇట్టి సమయమున యా మాతలియును నింద్రదేవునీ స్తుతియించెన్!
సర్వదానవుల సంహరించెనూ సరగున నా యింద్రుడు గూడన్!

అటులే నేనును స్తుతించుచుంటిని యలరుము విజయంబులతోడన్!
మేలుకొనుము! రాజేంద్ర! దశరథా! మేలును జేయుము! జగమునకున్! 24

వేదంబులు మఱి వేద విద్యలును విమల ప్రకాశుండగు బ్రహ్మన్!
మేలు గొలిపినటు మేలు గొలిపెదను మేదినీశ! యిక మేలుకొనూ!
చంద్రసూర్యులును మేలు గొలిపినటు సాంద్ర సుగుణ యీ వసుమతినీ!
మేలుగొలిపినటు మేలు గొలుపుదును మేదినీశ ! వే మేలకొనూ! 25

ఉత్సవానుగుణమైన వేషమును సురుప్రకాశమగు కాంతులతో!
మేఱు పర్వతము నుండి లేచినా సూర్యునివలె నిదురను లెమ్మా!
సోమ సూర్యులును, శివ కుబేరులును శుభకరులగు నింద్రాగ్నులునూ!
వరుణదేవుడును సర్వోన్నతులను వరుసను జేకూర్తురు గాతన్! 26

భగవతి శర్వరి గడిచిపోయినది పటుతరముగ జరిగిన పనులన్!
తెలిసి, జేయవలసిన కార్యములను దివిరి జేయు మిక రాజేంద్రా!
అభిషేకంబున కలరు వస్తువులు నంతయు సిద్ధము జేయబడెన్!
ద్వార సమీపమునందు వసిష్ఠుడు దగ నిలిచెను బుర ప్రముఖులతో! 27

రాఘవాభిషేకమునకు రాజా! రహి యాజ్ఞను వేగము నిమ్మా!
గోపాలుడు లేనీ యావులవలె కూర్మి నాయకుడు లేనట్టి!
సేనకువలె; మఱి చంద్రుడు లేనీ చిన్నబోయినా రాత్రివలెన్!
వృషభము లేనీ యాలమందవలె రాజులేని రాజ్యము గూడన్!
హర్షహీనమై యట రాజిల్లును యంతయు తేజో హీనంబై! 28

అర్థవంతమును సాన్త్వనయుక్తము నా సుమంతునీ పలుకు వినీ!
మఱి యింకను నా దశరథుడప్పుడు మానుగ శోకాక్రాంతుండై!
ధార్మికుడగు నా దశరథేశ్వరుడు దాపులేని యాలోచనలన్!
దుఃఖారుణ నేత్రంబులతో ననె విఖ్యాతుడునగు సూతునితోన్! 29

సుమంత్ర! విను నీ మాటల చేతను సూదుల వలె నా హృదయమునన్!
గ్రుచ్చుచుంటివని బలుక సుమంత్రుడు గూరిమి యా రాజును జూచీ!

కరుణారసభరితంబులు నగు నా కాంతుని కంజలి ఘటియించి
జరిగి దూరముగ మౌనధారిమై మాటలేక నిలువం బడియెన్! 30

దైన్య వశముచే బ్రత్యుత్తరమును దగ బలుకక మిన్నకయుండన్!
అంతట సుమంత్రుతో కైకేయియు సుంత బిడియబడ కిటు లనియెన్!
సుమంత్ర! విను! శ్రీరామచంద్రునీ సురుచిర యభిషేకము గూర్చి!
ఆలోచనతో రాత్రి యంతయును యలసి నిదుర బోవుచు నుండెన్! 31

సుమంత్ర! శీఘ్రముగా జని వేగము శుభకరుడగు వీరుని రామున్!
గొని రమ్మించటకు! ఈ విషయములో గూర్మి యోచనకు బనిలేదూ! 32

కైక మాటలను విని సుమంత్రుడును! గదిలె వేగ రాముని బిలువన్!
మంగళ కార్యము జరుగునంచునూ మది సంతోషము జెందుచునూ! 33

కైక ప్రేరితుండై సుమంత్రుడును కమ్మని యాలోచన జేసెన్ !
అభిషేకార్థము రాము డిచటికిని నాహ్వానించెద నని దలచెన్!
ఈవిధముగ నాలోచన జేయుచు నింపుగ మది సంతోషమునన్!
రాముని జూడగ బయలుదేరెనూ! రమణీయముగా రథముపయిన్! 34

అంతఃపురమును దాటి సుమంత్రుడు యలరి జనముతో క్రిక్కిరిసీ!
ఉన్నద్వారమును జూచి యచటగల జెన్నుగ రాజుల బేరులనూ!
వేదవిదులు నగు విప్రవర్యులును వివిధ దేశముల వర్తకులున్!
చేరినట్టి వీధులను దాటుచును జేరె రామ భవనంబునకున్! 35

(అయోధ్యకాండమున 14వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యకాండము - మొదటి భాగము

## 15వ సర్గము

(సుమంత్రుడు రాజాజ్ఞచే రాముని బిలుచుకొని వచ్చుటకు
రాముని గృహమునకు బోవుట)

వేదపారగులు, విప్రు లందఱును విమలరాత్రి యచ్చట నుండీ!
తెలవారగ నా వశిష్ఠు తోడను జెలగి మంటపమునకు జనిరీ!
మంత్రులు, సేనాపతులు, నధిపతులు మానుగ పట్టణ ముఖ్యులునూ!
రాముని యభిషేకమును గాంచగా రయమున జేరిరి యచ్చటికిన్! 1

బాల భాను డుదయించిన బిమ్మట భవ్య పుష్య నక్షత్రమునన్
రామున కప్పుడు నభిషేకంబును రహి సంకల్పించిరి జేయుటకున్!
రాముడు పుట్టిన కర్కాటలగ్నము రహి వచ్చిన యా సమయమునన్!
రాజగురువునా వసిష్ఠుండునూ రాజమంత్రులును యాజ్ఞికులున్! 2

సువర్ణమయములు జలకుంభములును సురుచిర మంగళ పీఠంబున్!
వ్యాఘ్రచర్మ మట బరుపబడినదీ వన్నెల రథమట నిలుపబడెన్!
పవిత్ర గంగా జలమును మఱియును బన్నుగ సకల నదీ జలముల్
నాల్గు సంద్రముల జలమును దెచ్చిరి నయముగ మంటప ముంపబడెన్! 3

లాజలతో నిండిన కలశంబులు లలిత పాల చెట్లాకులతో!
పద్మోత్పలముల గప్పబడినవీ పన్నుగ నుత్తమ జలములనూ!
కూడినట్టి యా పసిడి కలశములు గూర్మి రజితమయ కలశములున్!
ప్రకాశించుచుండెను మంటపమున ప్రజలు జూడ గను విందుగనూ! 4

పెరుగు పాలు తేనెయు లాజలునూ పొలుపుగ దర్భలు బుష్పములునూ!
క్షీరంబును మఱి సర్వాభరణలు కీరవాణులగు వనితలునూ!
రత్నభూషితము, కాంచన నిర్మిత రమణీయమునగు జామరయున్
రాఘవు కొఱకై సిద్ధ బరుపబడె రహి యభిషేకము జేయంగన్! 5

చంద్రమండలము వలె నున్నదియును సకల శోభలను గూడినదీ!
శ్వేత చత్రమట నుంచిరి ముందుగ యభిషేకంబును జరుపుటకై!
శ్వేతాశ్వంబును శ్వేత వృషభమును, నతి మదోదకము గలదియునూ!
మత్తేభము నట సిద్ధము నుంచిరి మహారాజు నెక్కుట కొఱకై! 6

సర్వాభరణములను ధరించియును సకల శోభలను గూడికొనీ!
అష్టకన్యలట సిద్ధము నుండిరి యఖిల వాద్యములు గాయకులున్!
అఖిలవస్తు సముదాయము గూర్చిరి యా యభిషేకము జేయుటకున్
వచ్చిన వారలు రాజును గానక వరుసను మదిలో జింతిలుచున్! 7

రవి యుదయించెను దూర్పు దిక్కునను రాజు కంటి కగపడదేలా?
అభిషేకమునకు నంతయు సిద్ధము నఖిలవస్తు సంభారంబున్!
ఆమాటలు విని సుమంత్రు డంతట యఖిల రాజ సంఘముతోడన్
వినయముతో జేతులు జోడించుచు విమల వాక్యముల నిటులనియెన్! 8

రాజాజ్ఞను నే బోవుచుంటినీ రయమున రాముని గృహమునకున్!
మీరందఱు బహు బూజనీయులును మిగుల రాజునకు రామునికిన్!
రాజుక్షేమమును నే నడిగెద నిక రహి రాకుండుట యెందులకో?
కారణ మడిగెద భూపతులారా! పృచ్ఛించెద నే నంతయునూ! 9

పురాణ వేత్తయు నగు సుమంత్రుడును బుధమి పతులతో బలుకుచునూ!
అంతఃపురమును జేరి స్తుతించెను నా ధరణీశుని వంశంబున్!
దశరథరాజా! సూర్యచంద్రులును దగమహేశ్వరుడు కుబేరులున్!
వరుణాగ్నులు, నింద్రుండు, భూమియును వరుసగ జయమును నిచ్చెదరూ!

రాత్రి గడిచినది ప్రభాతమాయెను రమ్య ముహూర్తము నేతెంచెన్!
మంగళప్రదమగు గార్యము సేయుము! రంగుగ సర్వోత్కర్షతనూ!
నిద్రమేల్కొనుము!నిఖిల ప్రజాళియు నీకై జూచుచు నుండి రిటన్!
వేదవిదులు సేనాధిపతులునూ, వేచియుండిరీ నీ కొఱకై! 11

అంత సుమంత్రుని గాంచి దశరథుడు నుంత లేచి దగ్గుత్తికతో!
అంతరంగికుడు సుమంత్రు తోడుత నార్ద్రభావమున నిటు లనియెన్!

రాముని శ్రీఘ్రము గొనిరమ్మనుచును రమణి పలికినది యిపుడెగదా!
నిద్రావస్థను లేను సుమంత్రా! నీవుపోయి శ్రీరామునితో
రమ్మను మిచటకు! యనుచు బలికెనూ రాజు సుమంత్రుని గద్గదికన్! 12

రాజు మాట విని యా సుమంత్రు డటు రమ్యశుభంబును మది దలచీ!
శిరసు వంచి పూజించి రాజునూ శ్రీఘ్రముగా బయటకు వెడలెన్!
పతాక ధ్వజములతోని గుడికొని బహు తోరణములను గూడీ!
అందమైన యారాజ మార్గమును చందముగని యానందించెన్! 13

సంతసించినా ప్రజలందఱునూ సారసనయనుని శ్రీరామున్!
అభిషేకంబును గూర్చి వార్తలను నలరి వినుచు నా సుమంత్రుడన్!
మంచు కొండవలె నున్నతమైనది మనోహరంబగు శిల్పముతో!
ఇంద్రభవనముగ చిత్రితమైనది చంద్రకాంతులను గూడినదీ! 14

చంద్ర సూర్య మండలముల వలెనూ చారుకిరణ తేజస్సులతో!
కుబేర భవనమువలె శోభించుచు గూర్మి మేఱు పర్వతము వలెన్!
అనేక పక్షులతో వ్యాకులముగ యనేక మృగ సముదాయముతో!
వివిధరత్నముల నలంకృతంబయి వివిధ స్వర్ణమయ చిత్రములన్! 15

వివిధ ప్రాంతముల నుండి వచ్చినా విప్రవరులు బట్టణవాసుల్!
జానపదులు, వర్తక శ్రేష్ఠులునూ సరస యుపాయన వస్తువులన్!
చేతబట్టుకొని నిలచియుండిరీ ప్రీతితోని శ్రీరాములకున్!
అభిషేకంబును గాంచు గోర్కెతో నలరుచుండి రట మోదమునన్. 16

సుమంత్రు డంతట రామ గృహంబును సురుచిరాశ్వముల నరదముపై!
జన బాహుళ్యము సంతోషింపగ జేరెను రాముని గొనిపోవన్!
రమణీయంబగు రాజభవనమును రమ్య శిల్పముల గనుగొనుచున్!
గగుర్పాటు గలిగెను నానందము గగనమంత యెత్తున నెగసెన్! 17

సుమంత్రు డంతట రామ భవనమును సొంపుగ రాముని మిత్రులనూ!
పరివారంబును దాటుకొనుచునూ! పరగ జేరె నంతఃపురికిన్!

శ్రీరాముని యభిషేకము గూర్చియు జింతన జేసెడి వారలనూ
మంగళప్రదమగు నాటల పాటల రంగుగ గాంచెను సుమంత్రుడున్! 18

మృగపక్షులతో నిండియున్నదియు మేరు శిఖరముగ నున్నదియున్!
ఉన్నత కాంతులతో నలరారుచు నుర్విలోని యద్భుతము వలెన్!
ఉపాయనంబుల తోని వచ్చినా యుర్విజనుల సందోహమునూ!
అట్టి రామభవనంబును జూచెను నా సుమంత్రు డా సమయమునన్! 19

అచట గాంచె నా సుమంత్రు డంతట యద్భుతమగు మత్తేభంబున్!
ప్రబలమైనదియును బట్టపు జేనుగు పర్వతమునువలె భాసించెన్!
రాఘవు డధిరోహించు గజం బది రహి యభిషేకంబున కిపుడున్!
శత్రుజయంబను బేరు గలిగినది శాత్రవులకు భయమైనదియున్! 20

అమాత్య ముఖ్యులు నలంకరించుక యశ్వ కుంజరములను నెక్కి!
పల్లకిలపై, రథములపైనీ! పటుతరమగు వైభవలీలన్!
సుమంత్రు డంతట వారి నందఱిని జోద్యముగా దప్పించుకొనీ!
అంతఃపురమును జేరె సుమంత్రుడు నా శ్రీరాముని గనుగొనగా! 21

పర్వతశిఖరము వోలెనున్న యా బహు గృహములుగల భవనమునూ!
రత్నభరితమగు యార్ణవమందున రయమున మకరము జొచ్చినటుల్!
సుమంత్రు డటు వే ప్రవేశించెనూ జూచుచుండ జనులందఱునూ!
అడ్డు పెట్టలేదెవ్వరునూ మఱి యడుగలేదు నెందుల కనుచున్!

(అయోధ్యకాండమునందలి 15వ సర్గ సమాప్తము)

* * *

# అయోధ్యకాండము-ప్రథమ భాగము

## పదునాఱవ సర్గము

[సుమంత్రుడు రామునకు రాజాజ్ఞను దెలుపుట-
సీతాదేవి యనుమతిని బొంది లక్ష్మణునితో శ్రీరాముడు తండ్రికడకు వచ్చుట]

అంత సుమంత్రుడు జనసమర్థమగు నంతఃపురమును దాటుకొనీ!
జన సంకీర్ణములేని వాకిలిని చయ్యన నతడు ప్రకాశించెన్!
రక్షకభటు లట ప్రాసలు ధరించి రక్షణ కార్యములను మునిగీ
దీక్షతోని యట కార్యము లన్నియు దీరత జేయుచు నుండగనూ! 1

కాషాయాంబరముల ధరించియును గరమున వేత్రములను బూనీ!
ద్వారములందున నిలిచిన వృద్ధుల దర్శించెను నా సూతుండున్!
వచ్చుచున్న యాసుమంత్రు గాంచీ మచ్చిక రాముని సేవకులున్!
ఆసనముల లేచుచు గౌరవమున యా సుమంత్రునికి నెదురేగీ! 2

వినయశీలుడగు సుమంత్రు డంతట వేత్రపాణులకు తెలియగనూ!
తా వచ్చినసంగతి రాఘవునకు దగ తెలుపుచ్చెదన వారలునూ!
ప్రియము గోరెడీ రాముని భృత్యులు రయమున రాముని దరిజేరీ
భార్యా సమేతుడగు రామునికిని బలికిరి సుమంత్రు డొచ్చెననీ! 3

తండ్రి యంతరంగిక మిత్రుండగు దగ సుమంత్రు డిటు వచ్చెననీ!
ప్రియము సేయగా రామచంద్రుడును ప్రీతిని రమ్మనె లోపలకున్!
అంత సుమంత్రుడు నా రాఘవునీ చెంతజేరి గాంచెను ప్రీతిన్!
కుబేరుతో సమమైన వైభవమున గూడిన శ్రీరాముని గాంచెన్! 4

నవరత్నాది విభూషణంబులను నయముగ రాముడు ధరియించెన్!
వరాహ రక్తము వోలెనున్న యా వన్నెల చందనముల తోడన్!
పార్శ్వమందు నా సీతాదేవియు బరగ చామరము ధరియించెన్!
చిత్రా నక్షత్రమును గూడినా రీతి చంద్రువలె భాసించెన్! 5

వినయశీలు డా సుమంత్రు డంతట విమల తేజుడా రామునికిన్!
అంజలి తోనీ నమస్కరించెనూ యత్యాదర భక్తిని గూడీ!
రాజసత్కృతుండైన సుమంత్రుడు రమ్యాసనమున గూర్చొనియెన్!
శ్రీరాముని గనుగొని యిటు పలికెను జిత్తమందు భక్తియు బొంగన్! 6

కౌసల్యా శ్రీ సుప్రజా రామా! కమ్మని మనసును గలవాడా!
నీదు దండ్రి మటి కైక రాణియును నిను జూడగ మది గోరుచునూ!
పిలువనంపగా వచ్చితి నిచటకు ప్రేమమీర గొనిపోవగనూ!
రమ్ము! బోవుదము! నాలసింపకుము! రథమున వారల దర్శింపన్! 7

ఆ మాటలు విని రామచంద్రుడును నలరి ముదంబున సుమంత్రునిన్!
గారవించి, తన దాపునగల యా కాంత సీతతో నిటులనియెన్!
సీతా! నను, నా యభిషేకంబును జిత్తము నం దెదొ దలచిరిగా!
పిలువ నంపిరీ ప్రేమ మీరగా బ్రీతి నేదొ యుపదేశింపన్! 8

అసితేక్షణ యగు నా కైకేయియు యలరి రాజు నూహను దలచీ!
ప్రియమును గోరుచును నా నిమిత్తమై ప్రేరేపించుచు నున్నదిగా!
తల్లియైన యా కైకేయీ సతి, తగ నా హితమును గోరుచునూ!
మహారాజు మనసును వర్తించుచు మానుగ నను బిలిపించెనుగా! 9

అర్థ కామముల సమగూర్చుటకయి యారాజును, చిన రాణియునూ!
సుమంత్రు నిప్పుడు దూతగ బంపిరి సుశ్రీయుక్తుని జేయుటకై!
యౌవరాజ్యమున కభిషిక్తునిగా యువరాజును చేయును నేడే!
భూపుత్రీ! నే బోయి వచ్చెదను పృథ్వీ వల్లభు జూడంగన్! 10

పతి సమ్మానితురాలు, సాధ్వియును బరమ పునీతయు జనకజయున్!
మనసున మంగళములను దలంచుచు మానసమున బతి స్మరించుచున్!
మధుర శుభములను గోరుచు రాముని మఱి ద్వారము వఱకును నేగీ
సాగనంపినది సకల దేవతల సన్నుతి జేసెను నాకణమున్! 11

రాజసూయ యాగమును జేయగల రహి సమర్థతయు గలుగంగన్!
బ్రహ్మదేవు డల స్వర్గలోకమును బన్నుగ శక్రున కిచ్చినటుల్ !

మహారాజు నీ మహారాజ్యమును మానుగ నీ కిచ్చెడు గాతన్!
సకలలోకమును సుఖ సౌఖ్యంబుల శాంతియుతముగా బాలింపన్! 12

వ్రత సంపన్నత దీక్షితుండవై వరాజినమునూ ధరియించి!
శుచివై కరమున కురంగ శృంగము సురుచిరమగు నీ రూపమునూ!
గాంచి మదిని నే నానందింతును గడు నా భాగ్యమునకు నేనే!
ఇంద్ర,యములు మఱి వరుణ కుబేరులు నింపుగ నిను బ్రోవుత గాతన్! 13

కృత కౌతుక మంగళుడు రాముడును సీత యనుజ్ఞను గైకొనుచున్!
సుమంత్రు తోడను బయలుదేరెనూ సుందరమగు నరదము పైనీ!
గిరిగుహనుండీ బయలు వెడలినా ప్రబల సింహముగ రాముండున్!
రాజమందిరము నుండి వెడలెనూ రాముడు జగదభి సోముండున్! 14

ద్వారమందు లక్ష్మణుని గనుంగొని సరసరీతిగా భాషించెన్!
మిత్రులందఱిని యభినందించెను భ్రాత్రులవలె భావించుచునూ!
అగ్ని సమానంబైనదియును మఱి యల పులి చర్మము గప్పినదీ!
ప్రకాశించు నా రథమును నెక్కెను ప్రజలందఱు దను దర్శింపన్! 15

ఆ రథ ధ్వనియును మేఘధ్వని వలె నలరుచుండె బయనింపంగన్!
కాంతిచేత మిఱుమిట్లు గొలుపుచును గన్నులబండువుగా నుండెన్!
ఉత్తమాశ్వములచే గట్టబడీ యున్నతమగు రథచక్రములన్ !
దేవేంద్రునివలె ప్రకాశించుచును తేజోవంతుడు రాముండున్! 16

ఆకాశంబున బర్జన్యుని వలె నా రథమును ధ్వని జేయుచునూ!
మహామేఘమున నుండి వచ్చినా మానుగ చంద్రుడు యున్నటులన్
రాజమందిరమునుండి వెడలె శ్రీ రాముడు దశదిశలును వెలుగన్!
లక్ష్మణుండునూ యరదము నెక్కెను లలిత ఛత్రచామరములతో! 17

నలువైపుల జన సముదాయంబును నయముగ రామునితో గూడన్ !
బయలుదేరగా హలా! హలా! ధ్వని బన్నుగ ముట్టెను నంతటనూ!
అశ్వారూఢులు గజారూఢులును నలరుచు నడిచెడి సైనికులున్ !
వందలకొలదియు; వేలకొలదియును సందడిగా రాముని వెంటన్! 18

చందనాదులను సలంకృతులునూ చారు కవచముల ఖడ్గములన్!
ధరించి యుండిన శూరులు నడిచిరి ధర్మాత్ముని రాముని తోడన్!
ఆ సమయంబున వంధి, మాగదులు నలరు స్తోత్రములు వాద్య ధ్వనుల్
మారుమ్రోగినవి! సింహ నాదములు మానుగ వీరుల శూరులయున్! 19

శత్రునాశకుండగు శ్రీరాముడు చక్కగ బోవుచు నుండగనూ!
మిద్దెల మీదను నిలిచి ప్రమదలును నొద్దికగా జల్లిరి పూవుల్!
మేడలపైనను మిద్దెలపైనను మిగుల మంచి మాటలచేతన్!
రాముని ప్రీతిని జేయగ రమణులు రమ్యాంజలులను జోడించీ! 20

తల్లికి ప్రీతిని గలిగించెడి ఓ ధర్మాత్ముడ! శ్రీ రఘురామా!
తండ్రిచేత రాజ్యము గొను నిను గని ధన్యయగును కౌసల్యయునూ!
రాముని హృదయేశ్వరి యగు సీతను రమ్య రమణిగా భావించీ!
సకలస్త్రీలలో నుత్తమురాలని సరసిజనేత్రలు ననుకొనిరీ ! 21

రోహిణి చంద్రుని బొందినట్లుగా రహి సీతయు రాముని బొందెన్!
మహాతపస్సును జేసినందుకే మహనీయుని రాముని బొందెన్!
మేడల మిద్దెల స్త్రీలు బలికెడి మిగుల ప్రీతి వాక్యములు విని!
రాముడు మదిలో సంతస మందెను రమ్యానందము నందుకొనెన్! 22

గుమిగూడిన జనవాక్యంబులనూ కూరిమి పౌరుల దీవెనలన్ !
తనను గూర్చి మాటాడు వాక్యముల దన్మయమయ్యెను రాఘవుడున్! 23

ఈరాముం డిక బొందును రాజ్యము నింపుగ రాజగు నీ ధరకున్!
మన కోరిక లిక సఫలము లగునూ! మనకు గలుగు సుఖ సౌఖ్యంబుల్!
ఈ రాముం డిక నేలును రాష్ట్రము నింపుగ నిక బహు కాలంబున్!
ప్రజలకు గలుగును గొప్ప లాభములు గోరికలన్నియు నెఱవేరున్!
అప్రియ మెవ్వడు బొందడుగా మఱి సుప్రియముల నే బొందుచునూ!
విషాద దుఃఖము లంటరావుగా విమల రామ పరిపాలనలో! 24

ముందు నడువ సూతులు మాగధులును సందముగా గీర్తించుచునూ!
శ్రేష్ఠమైన వాద్యముల ధ్వనించుచు నిష్ట గీతముల బాడుచునూ!
రథాశ్వ గజ సైన్యముతో గూడుక రయమున బోయెడు రాఘవుడున్!
కుబేరునకు వలె జయలుఁదేరెనూ! కూర్మి యింద్రునకు వలె వెడలెన్! 25

రత్నపు రాశులు ముత్తెపు ప్రోవులు రహి యమ్మెడి పురవీధులనూ!
రాజమార్గములు జూచుచు బోయెను రమణీయములగు విపిణములన్!
గజాశ్వములతో క్రిక్కిరిసుండెను గలగల లాడెడి జనములతో!
చతుష్పథము లన్నియు జనావాళితో చారు వస్తు సముదాయముతో!

(అయోధ్యకాండమున-16వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యకాండము - ప్రథమ భాగము

## 17వ సర్గము

(రాముడు రాజమార్గపు శోభను గనుగొనుచు మిత్రుల యభినందనములను స్వీకరించుచు తండ్రి భవనము నందు ప్రవేశించుట)

శ్రీమంతుండగు రామచంద్రుడును స్థిరముగ రథమున గూర్చుండీ!
పతాకధ్వజముల గూడి యున్నదియు బహు సువాసనల భరితమునూ!
నానాజనముల గూడియున్న యా నగరము గని సంతోషించెన్! 1

అగురు ధూపితంబగు నా నగరము నలరి రాజమార్గము వెంటన్
ప్రయాణించె నా రామచంద్రుడును బహు విచిత్రముల గాంచుచునూ!
రాజమార్గ మంతయు మేఘములుగ రమ్యభవనములతో గూడీ!
అమరావతి నగరమువలె నదియును నందచందములతో నుండెన్! 2

చందనములు బహు సుగంధములునూ క్షౌమ పట్టు వస్త్రంబులునూ!
రంధ్రముజేయని ముత్యపు ప్రోవులు రమ్య స్ఫటిక నిర్మితములునూ!
అనేక విధముల బుష్పమాలికలు నాజురుచుల మెల్భక్ష్యములున్!
బహువిశాలమగు రాజమార్గమును బన్నుగ జూచుచు బయనించెన్! 3

రాముడు జూచెను రాజమార్గమును రమ్యదేవ పథమునకు వలెన్!
దధి, యక్షతలును, హవిస్సు, లాజలు దగ ధూపంబులు జందనముల్!
పుష్ప మాలికలు బూవుల రాశులు బులకిత సుగంధ ద్రవ్యములున్!
మిత్రుల యభినందనలను గొనుచును మీరిన స్నేహము బొంగారన్! 4

అభిషిక్తుడవై యనుసరింపుమా! యిలరి రాజ్య పరిపాలననూ!
పితామహులు నీ ప్రపితా మహులును ప్రీతిని యేలిన విధముననూ!
రాముడు రాజగుచో సందఱమును రమ్య సుఖములను దేలెదమూ!
తండ్రి తాతలా పాలన కంటెను దండిగ మనలను బాలించున్! 5
అభిషిక్తుండై నేడు రాఘవుడు నలరుచు నూరేగుచు నున్నన్!
కాంచగలిగినా కన్నులు గన్నులు కమ్మని యాశలు నెఱవేరున్!

అంతకంటె ప్రియమేది యుండదిక జింతలు దీరును మన కింకన్!
ఇతర కోరికలు మనకిక లేవుగ నిల రాముని పాలన కంబెన్! 6

మిత్రుల ప్రశంస వాక్యములను విని మీరిన సంతస మందిననూ!
సంతసమును బ్రకటింపక బోయెను సరసమార్గమున రాముడునూ!
అరడము దూరంబైనను గూడను నా రాఘవునే జూచుచునూ!
మనసును దృష్టిని మళ్ళింపకనూ మఱి మఱి గాంచుచునుండన్! 7

రాముని జూడని వానిని, మఱియును రామునిచే జూడంబడనీ!
అట్టి వానినీ నిందింతురు గద గట్టిగ లోకమునందు జనుల్!
అట్టివాడు దననే దిట్టుకొనున్ ననుభవించు బహువేదననూ!
లోకమంత గారవమున జూచును లోకరక్షకుని రాఘవునీ! 8

ధర్మాత్ముడు శ్రీరామచంద్రుడును దగ నాలుగు వర్ణంబులకున్!
చెందిన జనులను వయోవృద్ధులను జెందును బ్రేమను బహుళముగా!
అందులకే గద యా జనులందఱు సంత ప్రేమ గనబఱచుటయున్!
ప్రాణము ప్రాణముగా జూచుటయును ప్రణతి హారతులు నిచ్చుటయున్! 9

అటు పిమ్మట శ్రీరామచంద్రుడును నా చతుష్పథంబులను మఱిన్
దేవళముల చైత్యములను దాటెను ధీనిధి భక్తి ప్రపత్తులతో!
రాజభవనమును బ్రవేశించెనూ రాముడు మిక్కిలి త్వరిత గతిన్!
ఇంద్రభవనమును బోలియున్న యా తండ్రి భవనమునకును బోయెన్! 10

ధనుర్ధరులతో నిండియున్న యా ధనవంతంబగు గృహమందున్!
మూడు కక్ష్యలును దాటి రథముతో మోదంబున నిఱు కక్ష్యలునూ!
పాదచారియై నడిచి బోయె నిక ప్రభువగు దండ్రిని జూడగనూ!
పరివారంబును వెనుకకు బంపీ ప్రవేశించె నంతఃపురమున్ 11

పాదచారియై శ్రీరఘురాముడు బ్రభు దశరథునీ దర్శింపన్!
బోవ నచటి పరివార మంతయును బూర్ణ సంతసము బొంగారన్!
సరితాపతి చంద్రోదయంబునూ బొరి బొరి చూదగ దలచువిధిన్!
వేచియుండిరీ రాముని రాకను విమలస్నేహ శుభకాంక్షలతో!

[అయోధ్యకాండమున 17వ సర్గము సమాప్తము]

★ ★ ★

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## పదునెనిమిదవ సర్గము

[కైకేయి రామునకు తాను గోరిన రెండు వరములను దెలుపుట-
రాముని వనవాసమునకు బొమ్మనుట]

మంగళకరమగు నాసనంబునను మహిత్మాత్ముడు శ్రీ దశరథుడున్!
కూరుచుండె బహు దీనవదనమున దిక్కుల దిశలను జూచుచునూ!
కైకేయీ సతి ప్రక్కన యుండెను గఠిన శిలగ మాటాడకనూ!
భీకరమగు నిశ్శబ్ద మంతటను బిలిచిన బలుకరు నెవ్వరునూ! 1

వినయవంతుడగు రామచంద్రుడును వినీతుడై తండ్రిని జేరీ!
తండ్రి పాదముల ముందుగ నంటెను దదుపరి కైకేయీ సతికిన్!
భక్తిభావమున నమస్కరించెను భవ్య భావములు బొంగారన్!
తండ్రి ముఖము వంకకు జూచుచునూ తదబడె మనసున వేదనతో! 2

'రామా!' యను నొక మాట యొక్కటే రాజు నోట వెలువడె నంతన్!
కన్నీరొలుకుచు నుండెగాని మఱి చిన్నిమాట బలుకం దతడున్!
భయంకరంబగు దండ్రి రూపమును బన్నుగ రాముడు గనినంతన్!
పన్నగమును ద్రొక్కిన విధంబుగా భయమునందె శ్రీరాఘవుడున్! 3

చైతన్యంబును గోలుపోయి మఱి సంతాపంబున గృశియించీ!
వ్యథచేతను వ్యాకుల చేతనుడై వరుసగ నిట్టూర్పుల జేతన్!
సంక్షోభించిన సంద్రము వలెనూ సరిత పొంగినా రీతివలెన్!
గ్రహణము పట్టిన సూర్యునివలెనూ కాంతిలేని తండ్రిని గాంచీ!
మనసున మిక్కిలి సంక్షోభించెను మది భయమందెను రాఘవుడున్! 4

తండ్రికి గలిగిన శోకవేదనల దగ నూహించుచు రాఘవుడున్!
పర్వమందు సాగరము గలతవలె బరగ పొందె బహు వేదననూ!
తండ్రి హితంబును గోరు రాఘవుడు దగ తన మదిలో జింతించెన్!
'ఎందువలననో రాజు బలుకకను కందిపోయి పలుకుట లేదూ!' 5

పూర్వమందు గోపముగా నున్నను బులకితుడగు నను జూడగనే!
అట్టి తండ్రి నను జూచి దుఃఖమున యలత నలతలను బడుచుండెన్
రాముడంత బహు దీనవదనుడై రమణి కైకకును దరిజేరి!
నమస్కరించుచు బలికె నిట్టులను నయముగ గద్గద కంఠమునన్! 6

అజ్ఞానముచే నే నపరాధము నలరి చేయగా లేదుగదా!
తండ్రి కుపితుడగు టెందులకో మఱి తల్లీ! నీవైనను జెపుమా!
వాత్సల్యము జూపెడి నా తండ్రికి వన్నె దరిగినది యెందులకో!
మాటాడడు! పలికిన నే బలుకడు మఱి యిందుల కే కారణమో! 7

మానసికంబగు, శారీరకమగు మఱి చింతలు వంతలుగానీ!
లేవుగదా! నా తండ్రికి దెలుపుము లీలగ మఱి నా కంతయునూ!
సుఖ దుఃఖంబులు గలిమి లేములును గావడి కుండలు గదతల్లీ!
యధార్థముగ నా కంతయు దెలుపుము సదా సుఖములును నుండవుగా! 8

ప్రియదర్శనుడగు భరతకుమారుడు బ్రియదర్శను శత్రుఘ్నునకున్!
తల్లులందఱకు శుభమే కద! ఓ తల్లీ! తెలుపుము వే నాకున్!
తండ్రికుపితుడై కోపించినచో ఖండితముగ యొకక్షణమైనా!
సంతోషింపగ జేయక నేనొక క్షణమైనను జీవింపనుగా! 9

తన ప్రాదుర్భావమునకు మూలము దన ప్రత్యక్షపు దేవతగా!
అట్టి తండ్రి విషయమున వినయమున గట్టిగ పుత్రుడు వర్తించున్!
గర్వముచే రోషమున పరుషమున కఠిన వచనములు బలికితివో
మనసు బాధబడునటుల నేమియును ననలేదు గదా! యో తల్లీ! 10

యధార్థ విషయము దెలుపుము తల్లీ! యడుగు చుంటి నే వినయముతో
ఎన్నడులేనీ యీ వికార మెటు బన్నుగ తండ్రికి గలిగినదో?
మహాత్ముడగు నా రాముడిట్లడుగ మఱి కైకయు లజ్జయు లేకన్!
ఆత్మ లాభకరమగు మాటల నిటు యలరి పలికె నిర్భయముగనూ! 11

రాజు గుపితుడును గాలేదూ! మఱి రాజు వ్యసనమును బడలేదూ!
రామా! రాజుకు మనోగతంబగు మర్మ విషయ మొకటియు గలదూ!

నీపైగల యత్యధిక ప్రేమచే నిరవధికంబగు దయచేతన్!
పలుక జాలకున్నాడు నరేంద్రుడు భయము వలన లోకుల వలనన్! 12

ప్రియ పుత్రుడవగు నీకు దెలుప నప్రియవచనము నోటను రాకన్!
వేదన తాపము నొందుచుండెనూ వివరింతును నే శ్రీరామా!
వరములిచ్చె మును రాజు స్వయముగా ఏనుదేశ్వరు నడిగితి నేడున్!
నీవు బూర్తి జేయగవలె వరముల నిఖిలము మెచ్చగ రఘురామా! 13

మహారాజు నన్నభిపూజ్యముగా మానుగ వరముల నిచ్చె మునూ!
పశ్చాత్తాపము నొందుచుండెగా ప్రాకృత మానవు వలె నేడున్!
వరము లిత్తునని ప్రతిజ్ఞ జేసెను వరుసగ నే నిపు డవి యడుగన్!
గతజల సేతువు బంధనమును వలె గలత జెందుచున్నా డిపుడున్! 14

సత్యము ధర్మంబునకు మూలమును సత్పురుషులు నియమించినదీ!
నీ నిమిత్తమై యట్టి సత్యమును నీప్డు వదులు టది ధర్మంబే?
"ప్రీతి జేసెదను రాజు జెప్పినది ప్రియమైనను యప్రియమైనన్"
అని పలికిన నే దెలిపెద సర్వము నా వరముల పూర్వోత్తరముల్! 15

"రాజు జెప్పినది మన్నించెదనని రహి జేయుదునని బలికినచో!
ఆ విషయంబును దెలిపెద రామా! యలరి రాజు తెలుపగలేడూ!"
కైక మాటలను విని శ్రీరాముడు గడు వేదనను జెందుచునూ!
రాజు సమక్షంబునను బలికె నిటు రమ్య తీక్ష్ణ వాక్యంబులనూ! 16

అహోహో! యిది యెంత కష్టమూ! యా విధమున పలుకతగునా?
తండ్రిగారు దెలిపినచో దూకెద! తగ నగ్నిని వెనుకాడకనూ!
హితముగోరు బూజ్యుడు నా తండ్రీ! మదిని నన్ను నాజ్ఞాపింపన్!
విషమునైన భక్షించెద తల్లీ! వినుము! సంద్రమున మునిగెదనూ! 17

"రాజు గోరెడీ విషయ మదేదో రయముగ తెలుపుము జేసెదనూ!
ప్రతిజ్ఞ జేయుచునుంటి! రాము కడ బరగ రెండు మాటలు లేవూ!"
అనార్యయగు నా కైకేయీసతి యా రామునితో నిటు లనియెన్!
దారుణమగు దన మనసు కోరికను దగ నిర్లజ్జను నిర్భయతన్! 18

రామా! విను! పూర్వము జరిగినదీ రణము సురలకును నసురులకున్!
ఆ రణమందున నీదు తండ్రి మఱి యంతులేని బాణంబు లచే!
బాధబడుచు నుండగ రక్షించితి ప్రబలమైన సాహసమునసూ!
రెండు వరములను విచ్చె సంతసిలి దండిగ మెచ్చుచు నానాడున్! 19
ఆ వరముల నే ననుసరించియే నడిగితి రాజును వరములనూ!
భరతుని రాజుగ చేయవలయునని భవ్యద! నేడే! యిపుడిపుడే!
నీవు దండకారణ్యంబునకును నిర్మల మతివై బోవలయున్!
ఈ కోరికలను గోరితి రాజును నింపుగ దీర్పగ వలె నీవున్! 20

సత్యప్రతిజ్ఞుని జేయదలచుచో సత్యము నిలుపగ దలచినచో
తండ్రి యాజ్ఞ బాలింపదలచుచో దగ నా వచనములను వినుమా!
పితృ నాజ్ఞ బాలింపుము రామా! ప్రీతి జతుర్దశ వర్షంబుల్!
కానల నుండుము ముని వేషంబున గఱకురాలమై నడచుచునూ! 21

రామా! కూర్చిన సంబారములను రయమున భరతున కర్పించి
పట్టము గట్టగవలయును వేగము చుట్టును శత్రులు లేకుండన్!
నీ కర్పించిన రాజ్యము నొదిలి నిర్మల మతి ముని వేషమునన్!
పదునాల్గేడులు దండక వనమున బరగ వసింపగ వలయు సుమా! 22

భరతుడు గోసల రాజరాజుగా గోటి రత్న సముదాయముతో!
గజాశ్వరథముల తోడనున్న యీ కమ్మని రాజ్యము బాలించున్!
ఈ కారణమున నరేంద్రు డిప్పుడు నిట్టి కరుణతో గూడికొని
శోక సంక్లిష్ట వదనముతో నిను జూడజాలకను నిటు లుండెన్! 23

రఘునందన! శ్రీరామ! వేగమే రాజు జెప్పినటు వర్తించి!
తండ్రి సత్యపాలనమును జేసెడి తగు నవకాశము నొనరించి!
తరింపజేయుము! తండ్రి తాతలను దగ వంశమును దీనిధివై!
ధర్మమూలమగు సత్యము నిప్పుడు దగ చిరకీర్తియు గలుగంగన్! 24

కైక రాణి యటు బలుకుచున్ననూ కటు భాషలకును నింతయునూ!
బాధనందడూ; దుఃఖము నొందదు భవ్యగుణుడు శ్రీరాముండున్!
మహా పురుషుడును మహాత్ముండునగు మహనీయుండగు దశరధుడున్
పుత్ర వ్యసన పీడితుడై మిక్కిలి పొగులుచుండె శోకము తోడన్!

(అయోధ్యాకాండమునందు 18వ సర్గ సమాప్తము)

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## పందొమ్మిదవ సర్గము

(కైక కోరిన ప్రకారము రాముడు అరణ్యవాసమునకు అంగీకరించుట-తల్లి కౌసల్యాదేవి అనుమతిని బొందుటకై యామె భవనమునకు బోవుట)

అప్రియమగు నా వాక్యములను విని యా రాముడు వ్యథ జెందకనూ!
తల్లి కైకతో నిటులను బలికెను దగ జిఱునగవున ధీరతతో!
నీవు జెప్పినటులే యగు గావుత! నీ కోరిక బాలించెదనూ!
మునివేషము నే ధరించి బోయెద ముదమున వనమునకును నేడూ! 1

అరిన్దముడు నగు నరేంద్రు డిప్పుడు నదివలకటి వలె బ్రేముడులన్!
అంది యిచ్చుటను లేదెందులకో! యది తెలియగ గోరుచునుంటిన్!
దుఃఖింపకు నే బోయెద నడవికి దోరముగా ముని వేషమునన్
నీయెదుటను నే దెలుపుచుంటినీ నిక్కము! సంతోషింపు మికన్! 3

హితుడును, గురుడును, కృతజ్ఞుండునూ! కూరిమి పిత యజ్ఞాపింపన్!
ప్రియమగు కార్యము నే జేయక నప్రియమగు గార్యము జేయుదునా!
నా ప్రియసోదరు డా భరతుండును నయముగ స్వయముగ నడిగినచో
రాజ్యము, సంపద, సర్వజనుల నే రయముగ నిచ్చెడి వాడగదా! 3

తండ్రి స్వయముగా గోరుచుండగను దగ నీ కోరిక దీర్చుటకై!
తండ్రి ప్రతిజ్ఞను మన్నించుచు నే దగ సర్వము నిచ్చెడి వాడన్!
మహీపతిని యోదార్చుము తల్లీ! మహారాజు మఱి యెందులకో!
వసుధ వైపు జూచుచు గన్నీటిని వందుచు రాల్చుచు నున్నాడున్! 4

నృపశాసనమును ననుసరించి నే నేర్పరులగు దూతల నంపి!
మేనమామలా వద్దనున్న యా వినయవంతు భరతుని దేగన్
శీఘ్ర వేగమును గల గుఱ్ఱములను చిరంజీవి నిటు దేగలరూ!
రాజును భరతుని జేయుడింక నే రయముగ వనములకును బోదున్! 5

పితృవాక్యమును ననుసరింతు నే ప్రియ మప్రియముల యోచింపన్!
పదనాల్గేడులు దండక వనమున బన్నుగ వసింప నే బోదున్!
రాముని వాక్యము విన్న కైకయును రహి సంతోషమునను బొంగెన్!
శీఘ్రము రాముని వెడలనంపగా జింత జేసె దన మనసుననూ! 6

నీవు జెప్పినట్లే యగు గావుత! నిర్మలమతి భరతుని యిపుడే!
దెచ్చుటకై దూతలు బోవుదురూ! హెచ్చిన వేగము హయములపై!
కాని నీవు వేగమున వనములకు గడు నాలస్యము జేయకనూ!
తరలిపోవగా వలెను రాఘవా! తగ భరతుడు రాకుండగనే! 7

వ్రీడాన్వితుడై నరేంద్రు డిప్పుడు విశదము జేయక నున్నాడున్!
ఈ దుఃఖము దొలగింపబడునులే! యింత విచారము బొందకుమా!
రామా! నగరము వీడుము శీఘ్రము వీడక యుండిన నందాకన్!
స్నానంబును మఱి భోజనంబునూ సౌమ్య! నిదురయును బోబోదూ! 8

కైకమాటలను విని దశరథుడును గష్ట మెంత వచ్చిన దంచున్!
శోకము జెందుచు బర్యంకమ్మపై సోలి మూర్ఛితుండై పడియెన్!
రాముడు రాజును లేవదీయగా రమణి మఱల బ్రేరేపింపన్!
కొరడాతో గొట్టిన గుఱ్ఱమువలె గూర్మి బోవ దొందర బడియెన్! 9

అనార్యయగు నా కైకేయీసవతి యప్రియమగు బలుకుల వినియున్!
మనసునందు వ్యథజెందక రాముడు మానినితో నిటులను బలికెన్!
అర్థపరుండను గాను తల్లి! నే ననుసరింతు ఋషి మర్యాదన్!
ఋషితుల్యుడనని తెలిసికొనుము నమ ఋషిధర్మము బరిపాలింతున్! 10

తండ్రికి బ్రియమును జేయవలయుచో దగ జేయుచు నిశ్చయముగనే!
ప్రాణమునైనను బరిత్యజించుదు బరగ తెలిసికొనుమా తల్లీ!
తండ్రికి శుశ్రూషను జేయుటను దగ యాజ్ఞను బాలించుటయున్!
మించిన ధర్మాచరణము సుతునకు మేదిని యందున లేదుగదా! 11

తండ్రిగారు దా జెప్పకున్ననూ తగ నీ వచనము ధరియించి!
పదునాల్గేడులు నడవుల నుండెద బన్నుగ జనశూన్యంబైనా!

నాపై యధికారము గల్గియునూ నయముగ భరతుని రాజ్యముకై
నాతో దెలుపక రాజుకు జెపితివి నాపై నమ్మిక లేదనియున్!
నాపై విశ్వాసము లేదనియును నయముగ దెలియుచు నున్నదిగా! 12

తల్లికి వందన మాచరించి నే తరుణి సీత నూఱట బఱచీ!
దండక వనమును నేడే బోయెద తండ్రి వచనమును నిలుపగనూ!
భరతుడు రాజ్యమును బాలించుచునూ పన్నుగ తండ్రికి శుశ్రూషన్
జేయవలయు సుమ! తల్లీ! నీవే చిర శాశ్వతమగు ధర్మమిదీ! 13

రాముని వచనము విని దశరథుడును రహి దుఃఖంబున బీడితుడై!
నోటను మాటాడక బిగ్గఱగా బీటలువడ వసుమతి నేడ్చెన్! 14

మహాతేజుడగు రాఘవు డప్పుడు మహారాజు బాదంబులకున్!
కైక పాదములకును వే మ్రొక్కి కదిలి గృహము బైటకు వచ్చెన్!
మూర్ఛనందినా తండ్రికి మఱియును మోదంబున గైకేయికిపీ!
ప్రదక్షిణంబును నాచరించి మఱి పన్నుగ మిత్రుల కడ జేరెన్! 15

సుమిత్ర సుతుడగు లక్ష్మణు డిప్పుడు శూరవరుడు మఱి సాహసుడున్!
కోపగించి కన్నీటి కనులతో గూరిమి రామునితో జనియెన్! 16

అభిషేకమునకు సంబంధించిన యా భాండమునకు మ్రొక్కుఱిడీ!
మంగళ ద్రవ్యములందు మనసు నిడి మానుగ వెడలెను రాఘవుడున్! 17

చంద్రుని శోభను దగ్గింపదుగద సాంద్ర నిశీధియు గ్రమ్మిననూ!
రాముని శోభయు దరుగలేదు నా రాజ్య పీఠమది లేకున్నన్!
రాజ్యమొదిలి వనమును బోనుండెడి రామునిలో చింతయు లేదూ!
లోకాతీడుడు నగు యోగి వలే లోలోన చిత్త వికారములున్! 18

అత్మవంతుడగు రామచంద్రుడును నఖిలాలంకృతులను విడిచీ!
ఛత్రచామరములను దా నొదిలెను సకల మిత్రులను వీడ్కొలిపీ!
దుఃఖము నంతను మనసు నుంచుకొని దూరము బొమ్మని పౌరులనూ!
అప్రియ వార్తను దల్లికి దెలుపగ యారాముడు శీఘ్రము జనియెన్. 19

శోభాయుక్తుడు సత్యవాదియగు శ్రీమంతుడు శ్రీరామునిలో!
ఎట్టిమార్పునూ కనబడలేదూ! యించుకైన చింతయు వంతన్!
శరత్కాల చంద్రుండు యెటుల తన చారు కాంతులను విడివడడో!
అటులే రాముడు హర్షచంద్రికల యలరి విడువలే చింతయునూ! 20

మహాయశుడు ధర్మాత్ముడు రాముడు మధురములగు ప్రియవచనములన్!
అచ్చటి జనులను గారవించుచును నారాముడు దల్లిని జూచెన్!
రాముని గుణములు బుణికి బుచ్చుకొను లక్ష్మణుండు దా వెనువెంటన్!
మనసున దుఃఖము మనసు నణచుకొని మఱి రామునితో దా జనియెన్! 21

ఆ సమయంబున భవన మంతయును నానందము తోడుత నుండెన్!
అట్టి సమయమున వచ్చిన యాపద యా రాముడు దా జూపకనూ!
యోగము నందుండిన యోగివలే యోగ దీక్షయందున మునిగీ!
నిశ్చింతను నిర్మమతను గూడుక నిఖిల జనములను బరికించెన్! 22

అయోధ్యాకాండము 19వ సర్గము సమాప్తము

★ ★ ★

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## ఇరువదియవ సర్గము

(రాముడు తల్లికి తన ఉపవాసము గుఱించి తెలుపుట-
తల్లి స్పృహతప్పుట - శోకించుట)

వినయమంతుడగు రామచంద్రు డటు వినయాంజలు లిడి తండ్రికినీ!
వెడలుచుండగా స్త్రీ లందఱునూ; యడలుచు నేడ్చిరి బిగ్గఱగన్!
తండ్రి యాజ్ఞ లేకున్నను రాముడు సకలాంతఃపుర స్త్రీ జనమున్
తల్లులుగా భావించు రాఘవుడు దగ బోవుచు నుండెను వనికిన్! 1

చిన్ననాటి నుండియు శ్రీరాముడు స్థిరభక్తిని తల్లిని జూచున్!
అటులనె మనలను జూచువాడుగద! యా రాముడు వని జనుచుండెన్!
కోపగించినను గోపింపకనూ కూర్మి ప్రేమ జూపెడివాడున్!
నిందించిన మఱి నిందింపక దను నిఖిలము నొకటనుకొను వాడున్!
అట్టి రాఘవుడు ప్రవాసమునకును నరుగుచుండె గద! యీనాడూ! 2

సర్వభూతముల గతియగు రాముని సరగున బంపించెను వనికిన్!
జీవలోకమంతకును జెడుగును జేయ నిశ్చయించెను నేడూ!
రాజుభార్య లందఱు నీవిధమున రయమున గొల్లున ధ్వనితోడన్!
దూడల గోల్పోయిన ధేనువులుగ దూరుచు నేడ్చిరి రాజేంద్రున్! 3

ఘోరమైన యా యార్త నాదమును భరియింపక నా దశరథుడున్!
పుత్రశోక పీడితుడై పడియెను బోడిమి నెడి యాసముననునూ!
నియమవంతుడగు రాముడు మిక్కిలి నిట్టూర్పులు విడుచుచు జనియెన్!
లక్ష్మణు తోడుత తల్లి గృహమునకు లాలిత్యము ముఖమున దొలుకన్! 4

తల్లి గృహమునకు జేరి రాముడును దగ గృహ ద్వారమునందుననూ!
పూజనీయుడగు వృద్ధుని జూచెను బుంకితులగు మఱి కొందఱినీ!
రాముని జూడగనే వారందఱు రయమున లేచి కృతాంజలులన్!
నీకు జయము గలుగును గావుతయని నిఖిల జనులు యభినందింపన్! 5

మొదటి వాకిలిని దాటెను రాముడు మోదముగా రెండవ కక్ష్యన్!
వేద విదులనూ విప్రుల గాంచెను వినయ వందనము గావించెన్!
మూడవ కక్ష్యను జూచెను రాముడు ముదుసలి స్త్రీలను బాలికలన్!
అచటి స్త్రీలు శ్రీరాముఁవారిని యభినందించుచు జయములతో!
కౌసల్యకు నీ వార్తను దెలిపిరి కమ్మని రామాగమనమునూ! 6

రాత్రియంతయును కౌసల్యాసతి రహి జాగరణముతో నుండీ!
ప్రభాతకాలమునందు విష్ణువును ప్రార్థించెను సుతు హితమునకున్!
వ్రతపరాయణయ నగు కౌసల్యయు బట్టు వస్త్రముల ధరియించీ!
మంత్ర పూర్వకముగ యగ్నిదేవునీ! మఱి హోమము జేయుచునుండెన్! 7

అంతఃపురమును జేరి రాఘవుడః నాదరమున దల్లిని జూచెన్!
మంగళకరమగు బూజావిధిలో మాత యుండుటను గమనించెన్!
దధి, యక్షతలును, నేయి, భక్ష్యములు, దగ హవిస్సు బేలాలు మఱిన్!
తెల్లని పువ్వుల దండలు, సమిధలు, దేనె, పాయసము, బులగంబున్!
పూర్ణకుంభములు రాముడు జూచెను బూజాద్రవ్యము లన్నియునూ! 8

వ్రత యోగముచే జిక్కినదియును మఱి వన్నెదఱుగకయు, దేజముచే
జలదర్పణముల నిచ్చుచున్న యా జననిని గాంచెను రాముండున్!
చిరకాలమునకు వచ్చిన పుత్రుని జేరవచ్చె కౌసల్యయునూ!
ఆడు గుఱ్ఱమది పిల్లను జేరీ యలరి నటుల సంతసముననూ! 9

ఎదురుగ వచ్చిన తల్లిపాదముల సదయ హృదయమున స్పృశియించెన్!
భక్తివందనము నాచరించెనూ భద్రమనుచు దల్లియు బలికెన్!
కౌగలించి శిరసును ముద్దిడుకొని మోదపులర ప్రియములు బలికెన్!
వాత్సల్యము బొంగార రామునీ వరుసను నాశీస్సుల వలికెన్! 10

ధర్మశీలురగు, వృద్ధులకును మఱి దగ మహాత్ములకు నాయువునూ!
ఎంత యుండునో యంత యాయువును యంత కీర్తి గలుగును గాతన్!
వంశధర్మమును బాలింపుము మఱి వన్నె దెమ్ము మన కులమునకున్!
రఘువంశంబున ప్రధానుండవై రాజిల్లుము జిరకాలంబున్! 11

నీదు తండ్రి జేసిన ప్రతిజ్ఞ నిక నెఱవేర్చును నేడే నిన్నున్!
యౌవరాజ్యమున కభిషిక్తునిగా నివ్వసుధను జేయును నిజమూ!
ఇవ్విధమున బలుకుచు కౌసల్యయు నింపుగ భుజియింపగ బలుకన్!
తల్లికి వందన మాచరించుచును దగ నిట్లనె శ్రీ రాఘవుడున్! 12

స్వాభావికమగు వినయవంతుడగు సారసనేత్రుడు రాముండున్!
వినమ్రుడై వనమును బోవుటకై విమల ప్రార్థనను నిటుజేసెన్!
తల్లీ! నీకిది తెలియదు సుమ్మా దగ మహాద్భయము వచ్చిపడెన్!
నీకును జనకజ, లక్ష్మణునకునూ నిండు విషాదము గలిగించున్! 13

ఆసనంబుతో బని యేముండిక యలరి వనమునకు జనుచుండన్!
దర్భాసమున గూర్చుండుటకును దగినకాల మిపు డొచ్చినదీ!
షడ్రస భోజనములను విడచి నే సరసములగు మధుమూలములన్!
పదునాల్గేడులు గాఱడవులలో జన్నుగ బోవలె నివసింపన్! 14

మహారాజు దన మహారాజ్యమును మన్ననతో భరతునకిచ్చి!
తాపసిగా నను దండకవనమున దగ నివసింపగ శాసించెన్!
వనమున లభించు వస్తువులను దిని ఫలమూలములను గడుపుచునూ!
పదునాల్గేడులు జనశూన్యంబగు వసుధ నుండవలె మునివోలెన్! 15

ఆమాటలు విని కౌసల్యాసతి యతులిత సంతాపము చేతన్!
మొదలు నఱికినా వృక్షము వలెనూ మోద మంతయును గోల్పోయెన్!
జారిపడిన దివి దేవతవలెనూ ధరణిపడిన కదళీవలెనూ!
అంతులేని సంతాపము జేతను కాంత నేలపై బడిపోయెన్! 16

నేల మూర్ఛ నందిన తన తల్లిని శీలవంతుడా రాఘవుడున్!
పైకి లేవనెత్తెను నా తల్లియు, బరగ శోకమున నిండారెన్!
బరువు మోసినా గుఱ్ఱము వలెనూ పరాగంబుతో నిండినదీ!
తల్లిని జూచి తగ విచారమున దన హస్తంబున స్పృశియించెన్! 17

శోకముతో నిండిన కౌసల్యయు శూరుడు లక్ష్మణుడును వినగా!
తన సమీపమున నున్న రామునితో దగ నిట్లనె వేదన తోడన్!

సంతానము లేకున్నను రామా! సంతాపింపను నింతగనూ!
శోకము గలిగించుటకు మాత్రమే శూర! నీవు జన్మించితివి! 18

పుత్ర! నీవు జన్మింపక పోయిన వంధ్యననుచు దుఃఖించుచునూ!
యుండెడిదానను! నీ సంతాపము నుండదుగద! మఱి యీనాడున్!
రాణినైననూ సుఖ సంతోషము రహి బొందను నే నెన్నడునూ!
సుతుడు రాజగును! జూచెద సుఖమని జూచుచుంటి నా భాగ్యమునూ! 19

అందఱి కంటెను శ్రేష్ఠురాలనై యలరుచుండినను నా కంటెన్!
తక్కువవారలచే విందును నిక దగని మాటలను నిక ముందున్!
అంతులేని యీశోక విలాపము చింతయు మఱి ప్రాప్తించినచో!
ఇంతకంటె వగ గలిగించునదీ కాంతలకును మఱి యేముండున్? 20

నీవు సన్నిహితముగా నున్నపుడే నిరతము నందితి ధిక్కృతులన్ !
నీవు వనమునకు జనిన బిమ్మటను నిక్కము మరణము! ధ్రువ మిదియున్!
కైక దాసజన సమముగ నెంచుచు కడు నీచముగా గాంచుచునూ
అస్వతంత్రురాలినిగా జేసిరి నలరి కైక నా భర్తయునూ 21

ఇపుడు నన్ను సేవించెడి వారును నీసడించెదరు నిక ముందున్!
కైకకు, భరతునకును భయపడెదరు బలుకరింప రిక నను జూచీ!
సదా కోపమున కైకేయీసతి సదా పరుషములు బలుకు నికన్!
సవతి ముఖము నెటు జూతు కుమారా! సంతోషము మది బొంగారన్! 22

ఉపనయనము జరిగిన కష్టములును నుపశమించునని యెంచితినీ!
అంతులేని యీ మహాదుఃఖమును నింత సహింపగ జాలను నే!
పూర్ణచంద్ర ప్రభలను గూడిన దీ పొలుపుగ జూడక నీ ముఖమున్!
దైన్యముతో నిండిన జీవనమున దగ నెటు సంతసమున బుత్తున్? 23

ఉపవాసములను, ధ్యాన యోగమున నుర్విదేవతల పూజలచే
నిముగంటిని గద! నే శ్రీరామా! నింగి కలిసె నది యంతయునూ!
ఈ వార్తనువిని నా హృదయంబును నింపుగ ప్రావృష కాలమునన్!

క్రొత్తనీటిచే నొడ్డు దెగినయటు గుప్పగ నేలను బడలేదూ!
ఈ నా హృదయము గట్టిదనుచునూ యీ నా మనసునకును దోచున్ 24

నిజముగ నాకిల మరణము లేదూ! నిజముగ యమలోకము నందున్!
జోటు లేదు; నందులకే నే నిటు జోద్యముగా నీ భువినుంటిన్!
విలవిల రుదించు లేడిని సింహము బలబల యీడ్చెడి విధి నన్నున్!
ఏల యీడ్వడో కాలయముడు మఱి కాలపాశమున కఠినముగా! 25

నా హృదయము సినుమున జేయంబడె నయముగ గట్టిది; బగులకనూ
నేలను బడి వ్రయ్యలు గాలేదూ; ధూళిని గలియక నిలబడియెన్!
దేహమంతయును వ్యాపించినసూ తీరని దుఃఖము కొండలుగా!
అకాలమరణము రాదని యందురు నా వాక్యము దగ నిశ్చయమూ! 26

వ్రతదానంబులు సంయమ జపములు వ్యర్ధ మాయెనని మది దలతున్!
ఈ దుఃఖమునకు గారణ మేమో యే పాపములను జేసితినో!
సంతానము కొఱకై నే జేసిన సకల దపస్సును వ్యర్ధంబై
ఊషర క్షేత్రము విత్తనంబువలె నూహలన్నియును మది జెదిరెన్! 27

అధిక బాధలను నలరెడి వాడును నలరుచు మరణము నొందినచో!
దూడలేని యావుకు వలె నేనును దుఃఖము జేత దపించుచునూ!
నీ ముఖమును జూడని నే సహితము నిరతము వేదన బడలేకన్
పరేత సంపద నొందెడి దానను బన్నుగ నా కోరిక దీరన్! 28

చంద్రవిభానన! నిన్ను జూడకను సాంద్ర జీవితము నది యేలా?
నీవులేని నా జీవము వ్యర్ధము నీవే ప్రాణము! సర్వమునూ!
వెంబడించినటు గోవు దూడనూ వెంబడింతు నిను వనములకున్!
అపుడెవత్తు! నీవెంట కుమారా! యిల బ్రతుకను నీవును లేకన్! 29

అపుడా కౌసల్యా సతియును మఱి యా రాముని గాంచుచు గనులన్!
వచ్చిన యాపద యోచించుచునూ చిచ్చువలే మది రగిలింపన్!
క్రోధ దుఃఖములతో జత గూడిన కొమరుని స్థితి మది దలచుకొనీ!
కిన్నరస్త్రీ వలె విలపించుచునూ! కన్నీ రొలికెను గాల్వలుగా!

అయోధ్యాకాండములోని ఇరువదియవ సర్గము సమాప్తము

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## ఇరువదియొకటవ సర్గము

(లక్ష్మణుని క్రోధము—బలవంతముగా రాజ్యమును గొనుమని రామునకు జెప్పుట — రాముడు తండ్రియాజ్ఞను పాలించుట ధర్మమని తల్లికిని, లక్ష్మణునకు బోధించుట)

విలపించెడి యా మాతృమూర్తి గని విమలమూర్తి యగు లక్ష్మణుడున్
ఆసమయమునకు దగిన విధముగా యతి దీనుండై బలికె నిటుల్!
ఒక స్త్రీ వాక్యము వశుడై రాముడు నొద్దిక రాజ్యము సంపదలన్
వదిలి వనములకు వెళ్లుట నీకును మదిగోరను వినుమా తల్లీ! 1

విషయ లోలుడును వృద్ధుడు రాజును విపరీతములగు కోరికలన్!
కైకరాణి ప్రేరేపణ జేయగ కదగి పలుకు నే బలుకయికన్!
రాముని రాష్ట్రమునుండి బంపగా రమ్య గుణోచిత కారణముల్ !
అపరాధము దోషములు నేమియును నందవు బుద్ధికి యోచింపన్! 2

రాముని నిందించెడి వాని నిలను రహి నే జూడగ లేదు భువిన్!
శత్రువైన శ్రీరాముని బొగడును మిత్రుల సంగతి మఱియేలా?
దేవకల్పుడును, ఋజువర్తనుడును దీనజనుల సంరక్షకుడున్!
దాంతుడు, శాంతుడు నట్టి కుమారుని దరుమున వనముల నిర్దయతన్! 3

మఱల బాల్యమును బొందిన వృద్ధుడు మాట లేమియైనను బలుకున్!
రాజ ధర్మమును దెలిపిన పుత్రుడు రహి దలవంపడుగా నిజమున్!
లోకము దెలియక ముందే మేల్కాను లోలత నా సాయము చేతన్
ధరాధిపత్యము వశము జేసికొను ధనసంపదలను నన్నియునూ! 4

రామా! నే నీ పార్శ్వమునందున రహి కృతాంతునికి వలెనున్నన్!
నీ కపకారము జేయువాడెవడు నే జూచెద నిక లోకమునన్!
మనుజాధిప! యీ యయోధ్య గూడను మానుగ యెదిరింపగ నిన్నున్
బహుశరములచే జనశూన్యముగా బరిభవింప నే జేసెదనూ! 5

భరతుని పక్షము జెందిన వారిని బడవైచెద నే రణమందున్!
మెత్తని వానిని వత్తి జూచెదరు మేలుగ యీ లోకమునందున్!
శత్రువైన భరతుని నే నిప్పుడు సయిహింపను నొాకక్షణమైనా!
బంధించెద వధియింతు నతని నే భ్రాత యనుచు మది దలపకనూ! 6

అవలిప్తుడు, కార్యా కార్యములను నరయక చరించు నగు వానిన్!
తండ్రియైన గురువైన గూడనూ తగు శిక్షింపగ వలయుజుమీ!
పురుషర్షభ! యీ వృద్ధ రాజు మఱి బొాలుపుగ నే కారణములచేన్
నీకు జెందినా రాజ్యలక్ష్మి నిటు నిర్ణయించె గైకకు నీయన్ ! 7

అరిశాసన ! నీతో నాతోడను ననుత్తమంబగు వైరముతో!
రాజ్యలక్ష్మి భరతుని కీయగనూ రహి బలసంపద లెక్కడిపీ?
తల్లీ! నేనిదె! నిజము దెలిపెదను! దగ రాముని యనురక్తుడనూ!
సత్యము ధనుస్సు, దానంబులపై శపధము జేయుచు నుంటి నిదే ! 8

ప్రజ్వలించు నగ్నిని! యరణ్యమున ప్రవేశింప రాముడు ముందే!
ప్రవేశించి యుందును నే నచ్చట బన్నుగ తల్లీ! నిశ్చయమూ!
ఉదయించిన రవి తమము బాపినటు నుగ్రమైన నా శౌర్యముచే
నీ దుఃఖంబును బాపెద తల్లీ ! నీవు రాముడును జూడు డిదే! 9

లక్ష్మణు వాక్యము విని కౌసల్యయు లావుగ నేడ్చుచు రామునితో !
రుద్ధకంఠమున బలికె నిట్టులను రూఢి వచనముల స్పష్టముగన్ !
రఘురామా! మన లక్ష్మణు బలుకుల రహి వింటివి గద విశదముగా !
ఇష్టమైనచో నీ విషయంబున నింపుగ జేయుము గార్యములన్! 10

ధర్మ విరుద్ధములైన వచనముల దగ కైకేయీ బలుకగనే!
శోకముచే దపియించు నను విడిచి బోకుము! పుత్రా! వనములకున్!
ధర్మములన్నియు దెలిసిన వాడవు దగ ధర్మంబును జేయంగన్!
కోర్కెయున్న నిటు నాకడమండి! కూరిమి జేయుము శుశ్రూషన్ ! 11

పుత్రా పూర్వము గాశ్యపుండునూ పూనిక గృహమున వసియించీ!
జననికి శుశ్రూషలు జేయుచునూ స్వర్గసీమ జనె దపసుననూ!

అంౘ్రడ యటుల బూజ్యుడొ నే నటులనె తల్లిని పూజితురాల సుమీ!
అడవులకును బోబోకు కుమారా! యనుమతి నే నిచ్చుట లేదూ!

నీ వియోగమున నా జీవితమున నిజమగు జీవిత సుఖములతో!
ప్రయోజనం బింతయు లేదు సుమా! బన్నుగ జీవచ్ఛవముగు నే!
తృణములనైను భక్షింతును నే దీరుగ నీకడ నేనుండీ!
వెంట దీసికొని పొమ్ము కుమారా! కంటి పాపవుగ నా కెపుడున్! 13

నన్ను విడిచి పోయిన యడవులకును నున్న నే నిలను బ్రమకుటయున్!
ఇచట నేను బ్రాయోపవేశమును నింపుగ జేసీ మరణింతున్!
నీ నిమిత్తమై ప్రాణత్యాగమును నే జేసిన యా సముద్రుడున్
పిప్పలాదముని విషయంబుననూ బేర్మిని జేసిన కుకర్మకున్!
దుర్గతిబొందిన విధమున నీవును దుర్గతి బొందెదు విది నిజమున్! 14

విలపించెడి యాతల్లికి రాముడు వినియవంతుడై మధురముగా!
ధర్మ సమ్మతములగు వచనములను దగ ధీరోదాత్తంబుగనూ!
పితృవాక్యమును నతిక్రమించెడి పేర్మి శక్తి నాకును లేదూ!
శిరసు వంచి నిను వేడుచుంటిని శీఘ్రము బోవలె వనమునకున్!

వ్రత చారిత్రుడు, ఋషియు, బండితుడు వాసిగ కండు మహర్షియునూ!
తండ్రి యాజ్ఞ బాలించుచు గోవును దగజంపెను గష్టంబైనన్!
మన కులమందే జననమందినా మానుగ సగర కుమారులునూ!
తండ్రి యాజ్ఞచే ద్రవ్వి సాగరము దగ బొందిరి మరణంబు నటన్! 16

పరశురాముడును దండ్రి యాజ్ఞచే దగ పరశువుతో దన తల్లిన్!
స్వయముగ నజికెను నరణ్యమందున సహజముగా భీతియు లేకన్!
తల్లీ! వారును నెందఱో ఘనులు తమ తండ్రుల యాజ్ఞను జేసీ!
ధన్యులైరి నే జేతును భక్తిని దండ్రి కిష్టమగు గార్యములన్! 18

నే నొక్కడనే తండ్రి యాజ్ఞ నిల నిక్కము జేయుట లేదమ్మా!
నీకు నేను జెప్పిన వారందఱు నిజముగ జేసిరి పిత్రాజ్ఞన్!
నూత్న ధర్మములు జెప్పుట లేదుగ నూత్న గాథ లివి కాదమ్మా!
అంగీకృతమై యందఱు నడిచిన యా మార్గము నే నడచెదనూ!

పితృవాక్య పరిపాలన కార్యము శ్రేష్ఠ మవని యిటులున్నదిగా!
అట్టి కార్యమును నన్య విధముగా నరసి చేయజాలను తల్లీ!
పితృయాజ్ఞ బాలించిన వాని క క్షయము గలుగదూ; దోషంబున్!
అనుచు బలికి తన తల్లి తోడుతను నలరి లక్ష్మణునితో బలికెన్ 19

తమ్ముడు! లక్ష్మణ! నాపై గలిగిన యిమ్మగు స్నేహము నెఱుగుదునూ!
నీ సత్త్వము విక్రమము నెఱుగుదును నీ తేజస్సును గుర్తింతున్!
శుభలక్షణ! లక్ష్మణ! విను మాటను శుభకరమగు నీ సమయమునా!
సత్య శమంబుల సార మెఱుగకను నిత్య జీవితంబున నిలిచీ!
పుత్రప్రేమచే దిగులు నొందుచును బొగులుచున్న దీ విధమిననూ! 20

లోకమందు ధర్మము గడు శ్రేష్ఠము లోకమంతయును బూజించున్!
అట్టి ధర్మమున సత్యము నిలుచును నలరు సూది దారము వోలెన్!
తండ్రిగారు జెప్పిన వచనమును దగ యున్నది ధర్మంబుననే!
అట్టి ధర్మమును నాచరించెదను నట్టి సుకృతము బొందెద నే!

ధర్మ మాచరించిన యాఘనునకు దగ తండ్రికి తన తల్లికినీ!
విప్రునకును మఱి యిచ్చిన మాటను వేఱు విధము జేయగరాదూ!
తండ్రి మాట నే నతిక్రమింపను!తండ్రి మాట నే కైకేయీ!
అడవుల కేగగ యాజ్ఞాపించెను నా మాటను శిరసున దాల్తున్! 22

కావున క్షత్రియ ధర్మ యోచనను గడగి మాని నిజధర్మంబున్!
ఆశ్రయింపు! వదులుము శౌర్యంబును నాశ్రయింపుమా! మద్బుద్ధిన్!
రాము డిటుల సౌహార్ద్ర పూర్వకము రహి లక్ష్మణుతో వలుకుచునూ!
తల్లికి నమస్కరించి యంజలిని దగ నిట్లని బలికెను మఱలన్! 23

అమ్మా! వనమునకును నే బోయెద యాజ్ఞ యిమ్ము! నాశీస్సులతో!
స్వస్త్యయనంబును జేసి బంపుమా! స్వస్తి జరుగ వనముల యందున్!
స్వర్గము విడిచిన యయాతి మఱలను స్వర్గంబును జేరిన రీతిన్!
నేనును యడవుల నుండి వచ్చెదను నీకు సంతసము గలుగంగన్! 24

నీవు, నేను, సీతయు, లక్ష్మణుడును నిర్మల మతియగు సుమిత్రయున్!
తండ్రి యాజ్ఞ బాలింపగ వలయును ధర్మ మిదే మన కందఱికిన్!

అభిషేకము పనులన్నియు మానుము! నలరి దుఃఖమును నణచికొని!
ధర్మసమ్మతము నగు వనవాసము దరలిపోవ నాజ్ఞను నిమ్మా! 25

ధర్మసమ్మతములగు నా మాటల దనయుడు పలుకగ తల్లియునూ!
చచ్చిబ్రతికి నట్లుగ రాముని గని మచ్చికతో నిటులను పలికెన్!
ధర్మము చేతను, స్నేహము జేతను తండ్రి వలెనె నేనును గూడన్!
నిను వనములకును బంపలేనురా! నను విడువకు! బోవలదు సుమా! 26

నీవులేని నా జీవిత మెందుకు? నీవేగా, నా జీవితమూ!
పితృదేవులకు దేవతలకునూ ప్రియమగు స్వధామృతంబులచే
ప్రయోజనం బింతయు లేదుకదా! ప్రాణి జగతి నుండుటకంటెన్
క్షణకాలము నీ వద్ద నుండుటే స్వర్గసుఖము నా కందించున్! 27

కరుణా పూర్ణము తల్లి విలాపము తనయుడు రాముడు వనవీధిన్!
కొలవులతో జన మడ్డిన రీతిని గూర్మి గజమువలె జింతించెన్!
ధర్మబుద్ధిగల రాముడు దంతట తగ తల్లియు, లక్ష్మణుతోడన్!
ధర్మవచనములు బలికెను మెల్లగ తగ నిట్టూర్పులు విడుచుచునూ! 28

లక్ష్మణ! భక్తియు, బరాక్రమంబును లావుగ నెఱుగుదు వినయంబున్!
కాని నీ విపుడు నామది విషయము గడగి విచారించుట లేదూ!
తల్లితోని గలిసియు నా కెంతయు దరగని బాధను గలుగంగన్!
మానుకొంటి విటు దగునా లక్ష్మణ? పొలుపుగ విను నా వాక్యములన్! 29

ధర్మఫలము నందించు జగతిలో ధర్మము నర్థము గామంబున్!
వశవర్తిని, యభిమతా సుపుత్రా! వాసిగ భార్యామణి వోలెన్!
ధర్మమునందే నిండియుండునూ! ధర్మము నర్థము కామంబున్!
ధర్మ మాచరించినచో గలుగును దగ నా మూడును సిద్ధించున్! 30

ధర్మ, అర్థ, కామములను గూడని తగ కార్యంబును ద్యజియించి!
దేనియందు ధర్మము నిలిచుండునో! దానిని బ్రారంభింప వలెన్!
అర్థపరుడు ద్వేషమునకు గుఱియగు నందఱికిని మఱి దూరమగున్!
కామాత్ముని గీర్తింపరుగా భువి కడగి దూరమం దుంచుగదా! 31

పూజ్యుడు, రాజును, వృద్ధుడు, తండ్రియు బొలుపుగ క్రోధముననుగానీ!
ప్రహర్షముననూ, కామము వలనను బన్నుగ యాజ్ఞాపించినచో!
ధర్మ దృష్టిగల వాడు దానినీ తగచేయును దన తలదాల్చి!
చేయకుండునది క్రూరుడు మాత్రమె కుటిల మానసుడు నీ జగతిన్! 32

తండ్రి యాజ్ఞ నే బరిపాలించెద దగ మన కందఱి గురువుగదా!
మన తల్లికి కౌసల్యకు భర్తయు మఱి గతి ధర్మం బాయనయే!
ధర్మంబున కధిపతియగు దండ్రియు దగ జీవించియు నుండగనే!
భర్తలేని స్త్రీవలె నాతో నెటు బయటకు రాగలదో జెపుమా! 33

తల్లీ నే బోయెద నడవులకును వెళ్ళి రమ్మనుము భద్రముగా!
సత్య బలముచే యయాతి మఱలను స్వర్గంబునకును వచ్చినటుల్!
మఱల తిరిగి వచ్చెదనమ్మా యిక మంగళమగు నాశీస్సులనూ!
స్వస్త్యయనంబును, శాంతి దీవెనల సరసముగా వే బంపు ననున్! 34

కేవలంబు రాజ్యము కొఱకై నే కీర్తి యశస్సును సత్ఫలమున్!
వదల జాలుటకు నే నసమర్థుడ మోద మలర ధీరుని వోలెన్!
జీవిత కాలము బహు నల్పాల్పము జిరకాలము నిట నుండముగా!
తుచ్ఛ రాజ్యమును సంపాదింపగ దురితము జేయగ కోరనుగా! 35

నరవృషభుడు శ్రీరామచంద్రుడును నయముగ వనమును బోదలచెన్
శోకించెడి తన తల్లి నోదార్చి శూరుడు తమ్ముడు లక్ష్మణుకున్!
మంచి మాటలను మఱి మఱి దెలిపీ యంచితముగ తన తల్లికినీ!
మనసా తల్లికి బ్రదక్షిణించీ మఱల దమ్మునకు నిటు బలికెన్!

(అయోధ్యా కాండమున-21వ సర్గము సమాప్తము)

* * *

## ఇరువదిరెండవ సర్గము

(శ్రీరామచంద్రుడు లక్ష్మణునకు నచ్చజెప్పుట-దైవమే తన వనవాసమునకు కారణమనుట)

ఆత్మవంతుడగు రామచంద్రుడును నాత్మ ధైర్యమున నలరుచునూ!
మహాభావముల మనసున నణచుచు మఱి భ్రమింగుచు దన వేదననూ!
నాగేంద్రమువలె బుసలు గొట్టుచును నలుగుచు మనసున దుఃఖమునన్!
ప్రియ సోదరుడగు సౌమిత్రిని గని ప్రీతి బొంగ యిటులను బలికెన్! 1

శోకరోషముల నిగ్రహింపుమా! శూర! ధైర్యమున బనిగొనుమా!
అవమానములను లెక్క జేయకుము హర్షానందములను గొనుమా!
నా యభిషేకము గొఱకు గూర్చినవి నయముగ యంతయు వదులుచునూ!
నిరత్యయంబగు కార్యము సేయుము నిఖిల జనులు సంతసమందన్! 2

నా యభిషేకము సంభారములకు నయముగ జూపిన యాతురతన్!
ఆ సంభారములను దొలకింపగ యలరి జూపు నుత్సాహంబున్!
నా కభిషేకము జరుగనున్నదని నలిగిపోవు నా కైకకునూ!
శంకయేమియును గలుగకుండునటు వంక లేక వర్తింపు మికన్! 3

లక్ష్మణ! విను! మన భరతుని దల్లికి లలిత హృదయమున క్షణమైనన్!
శంకారూపంబగు దుఃఖంబును క్షణమైనను సహియింపనుగా
తెలిసిగాని; మఱి తెలియకగానీ తలిదండ్రులకును నెన్నడునూ!
అప్రియంబులను జేసి యెఱుగ నే నలరి స్మరింపను నెన్నడునూ! 4

సత్యపరాక్రముడైన నరేంద్రుని సత్య ప్రతిన నిజమగు గాతన్!
ఎట్టి భయంబును లేకుండగవలె నెట్టి శంకయును లేకుండన్!
అభిషేకము నే మానకున్నచో నసత్య పాపము వచ్చుననీ!
మనసున దాపము నొందు దండ్రి గన మది నే భరియింపగ జాలన్ 5

ఆ కారణమున యభిషేకంబును నలరి నిలిపితిని శీఘ్రముగా!
ఇచటినుండియే వనమున కేగెగ వాసిగ నే మది దలచితినీ!
వనమున కేగగ నాకైకేయియు వలనొప్పగ కృత కృత్యయునై
తన కుమారునకు నభిషేకంబును దగ జేయించును శీఘ్రముగా! 6

నార చీరలను కృష్ణాజినమును నయముగ జటలను ధరియించీ!
అరణ్యంబునకు బోయినచో నిక నలరు కైక మనసున శాంతిన్!
తండ్రి నిశ్చయము కెదురాడగనూ తగ శక్త్యుడ నే గాదుగదా!
అందులకే నే నడవికి బోయెద నాలపింపకను వే వేగన్! 7

ఇచ్చిన రాజ్యము వెనుక దీసికొని మచ్చిక వనమును బొమ్మనుటల్!
దైవకార్యమని మది భావింతును దైవమె కారణమని దలతున్!
దైవ నిర్ణయము గాకుండినచో దగ కైకకు నీ భావమెటుల్?
నాకు బాధలను గలిగించుటకును నాతి బుద్ధి యెటు వర్తించున్! 8

తల్లుల విషయము నందున బూర్వము దగ భేదములను జూడనుగా!
భరతునియందును భేద భావమును విరచింపను నీ వెఱుగుదువూ!
పలుకరాని పలుకులు బలికిన దన ప్రబల దైవనిర్ణయము గదా!
వేఱు కారణము గంటి కగుబడదు విమలదైవ సంధాన మదే! 9

ఉత్తమ స్వభావ సంపన్నయు మఱి యురుగుణ రాజకుమార్తెయునూ!
అట్టి కైక సామాన్యపు స్త్రీ వలె నిట్టి పరుషములు బలికెడినా?
దైవ ప్రభావము నదృశ్యమైనది దాని నెవరు నిందింపరుగా!
నా యందును కైకేయి యందునూ నయముగ దైవ ప్రభావ మెదో!
వచ్చిపడినదీ! విషయము స్పష్టము మచ్చిక యెవరికి దెలియదుగా! 10

దైవ మెటుల నడిపించెడినో మఱి ధర నట్టుల వర్తించుటయే
అన్యమార్గమది లేదుగదా యిక నలరి యెదుర్కొను దైవమునూ?
సుఖ దుఃఖంబులు భయ క్రోధంబులు శుభాశుభంబులు సర్వమునూ!
ఈ విధమగు కార్యంబు లన్నియును నింపుగ దైవ విలాసములే! 11

మహామునులునూ, ఋషీశ్వరులునూ మానుగ దైవ విలాసమునన్
కామక్రోధముల భ్రష్టులగుదురూ కఠిన నియమముల నట్టుదోసీ

ప్రారంభించిన పనికి యడ్డుగా ప్రబలమైన యాటంకమెదో!
వచ్చిబడినచో భావింపగవలె వానిగ దైవ విలాసమనీ! 12

అభిషేకమునకు నడ్డు వచ్చినను నది యదార్థ బుద్ధిని తెలిసీ!
నను నేనే నిగ్రహించు కొనుటను నాలో దుఃఖము లేదుగదా!
నీవు గూడ నన్ననుసరింపుమా! నీ పరితాపములను నడచీ!
అభిషేకోత్సవ సంభారములను నంతట నిలుపుము శీఘ్రముగన్! 13

అభిషేకమునకు గూర్చిపెట్టినా యలరి ఘటోదకముల తోడన్!
తపోవ్రతంబును యవలంబించుచు దగ వ్రతస్నానము జేయుదునూ!
రాజద్రవ్యమగు ఘటోదకములను రహి నా కేమి ప్రయోజనమూ?
స్వయముగ యుద్ధృతమైన తోయమే సరసరీతి జేయుదు వ్రతమున్! 14

లక్ష్మణ! లక్ష్మి వైపరీత్యమును లావుగ చింతను బొందకుమా!
రాజ్యము గంటెను వనవాసమునే రమ్య మహోదయమని యెంతున్!
కర్మ విఘ్నమై పోయినదంచును గసరుకొనకు మన పినతల్లిన్
దైవముచే నిటు నాక్రమింపబడి దగ యనిష్టమును బలికినదీ!
దైవశక్తి యా ప్రధాన మెట్టిదో తమ్ముడ! యెఱుంగుదువు నీవున్! 15

అయోధ్యాకాండము 22వ సర్గము సమాప్తము

* * *

## ఇరువది మూడవ సర్గము

[లక్ష్మణుని ప్రతాపోక్తులు - రాముడు శాంతింపజేయుట]

రాము డీ విధిని బలుకుచుండగా ధీమంతుడగు లక్ష్మణుడున్!
తలను వంచుకొని మాటిమాటికిని విలపించెను సుఖదుఃఖములన్!
నరశ్రేష్ఠుండగు లక్ష్మణు డప్పుడు నారసింహుడై కోపమునన్!
పగవట్టిన పెను త్రాచుపామువలె ప్రబలమైన నిట్టూర్పుల తోన్! 1

భ్రుకుటి ముడిచి తీవ్రముగా నుండిన తీక్షణమగు లక్ష్మణు ముఖమున్!
కోపించిన సింహము ముఖమును వడె క్రోధపూర్ణమై కనిపించెన్!
ఏనుగు దొండమువలె హస్తాగ్రము నిటు గదిలించుచు దనతలనూ!
అడ్డముగా మఱి పైకి త్రిప్పుచును నన్నతోని నిటులను పలికెన్! 2

పరిపాలింపుము పితృవచన మప్రియమగునని మది తలచితివి!
అధర్మమగునని భయము చేతనూ యలరి సంభ్రమము నొందితివి!
శక్తి విహీనంబైన దైవమును సారెకు బలుకుట యుక్తంబా?
దైవమె బహు బలవత్తరం మనుచును దైన్యమొందు టది న్యాయంబా? 3

కృపణమైన యసమర్థమైన యా క్రూరదైవమును దెలిపెదవూ!
పాపాత్ములు కైకేయి దశరథుల పైనెందుకు శంకయు లేదూ?
గూఢముగా నపకారము జేసియు గుఱుతుగ స్వలాభ పరులగుచున్
మంచితనంబును బరిహరింపగా వంచన జేయుచు నున్నారూ! 4

ఈ నిర్ణయ మెపుడో వారిరువురు నింపుగ జేసిరి నిక్కముగా!
పూర్వమిచ్చినా వరముల గూరిచి పొసగ దెలుపుచున్నా రిపుడే!
నిను వంచింపగ కాదా యిరువురు వినుమని దెలుపుట వరములనూ!
అటులగానిచో యా వరంబులను నానాడే యిచ్చెడి వాడున్! 5

నీకు తప్పు యీ యభిషేచనమును నే సహింప నిక యితరులకున్!
లోక విరుద్ధంబైన కార్యమును లోలత నే వ్యతిరేకింతున్!
నన్ను క్షమింపుము నీ విషయంబున! అన్నా! నన్నిక! కాదనకూ!
సన్నుతింతు నిను నెన్ని జెప్పినను నిన్ను కాదనెద నిక్కముగా! 6

మహాబాహూ! నీ యాలోచనలో మానుగ భేదము గలిగించీ
మోహము గలిగించిన ధర్మంబును ముదమున నే ద్వేషించెదనూ!
సమర్థుండవై కైక మాటలకు సరి యని లొంగిన తండ్రికినీ!
శిరసు నొంచుటది సరిగాదు సుమా! శిరసు నెత్తుటది యుక్తంబే! 7

కపట బుద్ధితో జేయు పాపమును గాంచక గ్రహింపనందులకున్!
శోకావేదన గలుగు చున్నదీ శూర! నా మదిని నిక్కముగా!
విధమగు నా ధర్మాచరణము నీసడింప దగినది సుమ్మా!
విరుద్ధము, నింద్యము, పాపము దగ దిది నీకిది చేయంగన్! 8

చ్ఛారతులగు వార లెన్నడును జేయరు; గోరరు; నీ హితమున్!
దంద్రులను బేరు గలిగినా తగ శత్రువులు సుమా! నీకున్!
వారి కోరికలను తీర్చుటకు కలరుట నీకును సరికాదూ!
నసున గూడను దలచుట యుక్తము మానుగ వారల సద్వృత్తిన్! 9

గ వారికి గలిగిన యాలోచన దైవకృతం బని దలచిననూ!
ది నీ మతమగుగాక! దాని నే ననుమతించి సరి! యనబోనూ!
క్లబుండు మఱి వీర్యహీనుడను విధి నాధారము జేసికొనున్!
సంభవితాత్ములు వార లెన్నడును సరిభావింపరు దైవమునూ!

స్వప్రయత్నమున దైవము నైనను సరికాదని పోద్రోచిననూ!
అట్టి దైవమును నా సమర్థునకు నలసత గలిగింపడు నెపుడున్!
దైవమునకును మఱి పురుషునకును మఱి దగ శక్తులు యుక్తులు గలవో!
దండఋనూ చూడగలరు సుమ! నేడది స్పష్టము గాగలదూ! 11

ఏ దైవముచే నీ యభిషేకము నీవిధి నాపెనొ తన శక్తిన్!
ఆదైవమునే ప్రతిఘటించెదను నందఱు గాంచెద ఱిక నేడున్!

మద బలమున బరువెత్తుచున్న యా మదగజమును వలె దైవమునూ!
పురుషాకారము జేత మరల్చెద పురుష ప్రయత్నము ఫలియింపన్! 12

జరుగబోవు రామాభిషేకమును జరుగకుండ నాపగలేరూ!
మూడులోకములు లోకపాలురును గూడి యేకమై వచ్చిననూ!
నీవరణ్యమున నివసింపగనూ నిర్ణయించినా యా ఘనులే!
పదునాల్గేడులు వనమున నుందురు బన్నుగ పండ్లాకులు దినుచున్! 13

తండ్రి యాశలను, కైక యాశలను దరలింతును నే చేదింతున్!
రహస్యమగు నా కుతంత్ర మంతయు రట్టు జేతు బహిరంగముగా!
నా బలమును నెదించిన వారికి నయముగ గలుగునొ దుఃఖంబున్!
దైవబలంబును గలగింపదుగా దలచి చూడుమా! యిపుడిపుడే! 14

నీవు వేయి వత్సరములు ధరపై నిర్మలమతివై పాలించీ!
అడవుల కేగెద వటు నీ తనయులు నలరి ధరను బాలించెదరూ!
పుత్రులవోలె బాలించి ప్రజలనూ పూనికతో తమ పుత్రులకున్!
అప్పగించి పోదురు వనములకును నలరి రాజర్షు లందఱునూ! 15

చపలచిత్తుడగు రాజు యున్నచో జంచలమగు రాజ్యం బనుచున్!
ఈ కారణమున ధరను త్యజించిన నింపుగ యాభయమును లేదూ!
సముద్రతీరము సాగరంబునూ నరసరీతి రక్షించి నటుల్!
నీ రాజ్యంబును నే రక్షించెద నిలుపుకొనెద నా మాటయునూ! 16

మంగళమగు రాజ్యాభిషేకమును మానుగ యత్నము జేయు మికన్!
నే నొక్కండను రాజుల నందఱ నివారింతు నా బలంబునన్!
నా బాహువులును ధనువు ఖడ్గమును నా కరములు శోభకుగాదూ!
అమిత్రదమనమునకు మాత్రము సుమ! యందుకొనుము నిక రాజ్యంబున్!

శత్రువనుచు నే దెలిసినవానిని మిత్రుడనుచు భావింపను నే!
తీక్షణమైన ఖడ్గముతో వానిని దెగవేసెద శక్రునినైనన్!
ఖడ్గముచే ఖండింపబడిన యా గజాశ్వ మానవ శిరములచే!
నిండియుండు ధర కళేబరంబుల దండిగ రక్త ప్రవాహములన్! 18

కత్తి వ్రేటుచే గజాశ్వంబులును కదిలి మండెడి గిరుల వలెన్!
మెఱుపులతో గూడిన మేఘములుగ మేదినిపై బడగలవు సుమా!
అంగుళి త్రాణములను ధరయించి! యలరి ధనుస్సును ధరియించి!
నిలిచి యుండగా పురుషుడ నే నని బొలుపుగ దెలుపుచు నిలువబడున్? 19

ఒక బలవంతుని యనేక శరముల వరుసగ గొట్టుచు జంపుదునూ!
ఒక్క బాణమున యనేక వీరుల వ్రాలగ వసుమతి జేయుదునూ!
అస్త్రప్రభావంబున మన జనకుని యలరి రాజ్యమున దొలగించి!
అధికారము నీ కివ్వగలను సుమ! యఖిల జనంబులు గీర్తింపన్! 20

చందన సారంబునకును మఱియును! నందమైన కేయూరములన్!
ధరించుటకునూ, మిత్ర పాలనకు దానమునకు దగు నీ కరముల్!
నీ యభిషేకము నడ్డుకొనిన యా నీచుల మద మణగింపగనూ!
తగిన పనిని జేయును నీ కరములు ధర్మము నిలిపెద నీ జగతిన్! 21

ఏ శత్రువు దన ప్రాణ కీర్తులను నిలపై వదలగవలె జెపుమా!
ఈక్షణమున నే నటుల జేసెదను నీసురో యనగ శత్రువులన్!
నీ వశమగుటకు ధాత్రియంతయును నే జేయగ వలసిన దేదో
ఆజ్ఞాపింపుము అన్న కింకరుడ! యాలసింపకుము! వే జెపుమా!

రాముడు లక్ష్మణు నోదార్చుచునూ రమ్య వచనముల బలుకుచునూ!
నొలికెడి కన్నీటిని దుడుచుచునూ! నొప్పుగ మధురముగా బలికెన్!
"లక్ష్మణ! విను! నే తండ్రి వచనమున లావుగ నిలిచెద స్థిరముగనూ!
ఈ మార్గము! నే మంచి దనుచును నింపుగ మనసున దలచెదనూ!" 23

(అయోధ్యకాండమునందలి 23వ సర్గ సమాప్తము)

* * *

# అయోధ్యకాండము-ప్రథమ భాగము

## ఇరువది నాల్గవ సర్గము

(విలపించుచున్న కౌసల్యను శ్రీరాముడోదార్చుట — వనవాసమునకు శ్రీరాముడు తల్లి యనుమతిని బొందుట)

తండ్రి యాజ్ఞ బాలింప రాఘవుడు దగ స్థిరచిత్తునిగా గాంచీ!
బాష్పరుద్ధ కంఠముతో దల్లియు భవ్య వచనముల బలికె నిటుల్!
దశరధునకు, నీకును గుమారుడను ధర్మాత్ముడు శ్రీరాఘవుడున్!
ఉంఛ వృత్తితో నెటు జీవించును? నంచితముగ కాఱడవులలో!? 1

భృత్యులు దాసులచే మృష్టాన్నము దృప్తాత్ములుగా భుజియింపన్!
వనమునందు దిని కందమూలములు వాసిగ నెటువలె జీవించున్!
గుణవంతుడు దయితుడు శ్రీరాముని వనము బంపె ధరణీశుడనన్
ఎవరు నమ్ముదురు? విని యెవ్వారికి నిమ్ముగ భయంబు గలుగదొకో? 2

వనములకును నీ వరుగు చుంటివన వాసిగ జగమున కార్యములన్!
నడుపుచున్న యా దైవశక్తియే కడు బలవత్తర మనవచ్చున్!
బిడ్డా! నీవరిగిన వే వెంటనె దొడ దుఃఖ మది యుదయించున్.
ఎప్పుడొత్తువో యనియెడి చింతయె యెపుడు మఱల మఱలను గలుగున్!

లేగ దూడ బోవుచునుండగ మఱి సాగక దేనువు నెటులుండున్?
అటులే నిను నే ననుసరించెదను! నెటు బోయెదొ నే నటకొత్తున్!
తల్లి పలికినా కన్నీరొలుకుచు కరుణామయమగు వాక్యములన్!
విని రాముడు నార్ద్రాంత రంగుడై విమలాక్షరముల నిటు లనియెన్. 4

తల్లి కైకచే వంచింపగబడె దశరథేశ్వరుడు మఱి నేనున్.
అరణ్యములకును బోవుచుంటినీ యటుపై నీవును గూడ నికన్!
ఆ నరేంద్రునీ బరిత్యజించిన యాతడు జీవింపడు ధాత్రిన్!
ఇది నిశ్చయమమ్మా! విను నిజమిది యీ నిర్ణయమును జేయకుమా! 5

భర్తను బరిత్యజించుట భార్యకు బరమ నింద్యమగు గార్యమునూ!
మనస్సు చేతను నాలోచింపకు మఱి చేయకు నీకార్యంబున్!
మహారాజు శ్రీ దశరథేశ్వరుడు మఱి జీవించిన కాలంబున్!
అతని సేవ జేయగవలెనమ్మా అదియే శాశ్వత ధర్మంబున్! 6

రాము డిట్లు బలుకగ కౌసల్యయు రమ్యభావ సంభావితయున్!
శ్రమింపకనె కార్యము సాధించెడి చారుశీలుడగు రామునితో!
అటుల జేసెదను ననుచు బలికినది యలరి పుత్ర వాత్సల్యముతో!
కంటి ముత్యముల గనుల నణచుకొని కలతనంత గుండెల దాచెన్! 7

ధర్మరక్షకుడు రామచంద్రుడును దల్లి మాటలను విని మఱియున్!
కొండంతటి దు:ఖముతో గుమిలెడి గూరిమి తల్లికి యిటులనియెన్!
నీవును, నేనును దండ్రి మాటలను నిక్కముగా జేయగ వలయున్!
రాజు పోషకుడు బూజ్యుడు! నధిపతి! రహి యాజ్ఞాపించెడి వాడున్! 8

పదునాల్గేడులు వనముల నుండి బన్నుగ మఱలను వచ్చెదనూ!
ఆనందముగా అమ్మా! నీదగు నాజ్ఞను శిరసున దాల్చెదనూ!
అని పలుకగ శ్రీరాముడు దల్లియు యశ్రు పూర్ణ నేత్రంబులతో
ప్రియ పుత్రునితో నిట్లని పలికెను బ్రీతిపొంగ సెలయేఱులుగాన్! 9

కాకుత్స్థా! నే సవతుల మధ్యను గడగి వసింపగ లేను సుమా!
వన్యమృగంబును వెంట గొనిసటుల వనము జనుము నను వెంటగొనీ!
రోదనతో శోకించు జననిగని వేదనతో రాముడు పలికెన్!
కంటి ముత్యములు తుడుచుచు జననిని కంటనీరు దా దొలుకుచునూ 10

జీవముతో నున్నంత కాలమును స్త్రీకి భర్తయే దేవతయ్యెన్
అతడే ప్రభువును, యాతడె సర్వము నాతని యనువర్తింప వలెన్!
నీకును, నాకును నధిపతి యాతదు నిఖిల ప్రజల పైనను గూడన్!
నాథుడుండగా నాధుడు లేని య నాధుల మెట్లగుదుము మసమున్?
ధర్మాత్ముడు మన భరతుడుగూడను దయజూదును ననువర్తించున్!
సకల ప్రాణులను దయతో జూచును చారుశీల గుణశ్రేష్ఠుండున్! 11

నే బోయిన పిమ్మట వనములకును నీవు సావధానము తోడన్!
పుత్రశోకమున గుందకుండగా బూనుము! రాజుకు శుశ్రూషల్!
భయంకరంబగు బుత్ర శోకమును భరింప జాలడు మన ప్రభువున్!
హితము గూర్చగా నహర్నిశలునూ సతతము నోదార్పగ వలెనూ! 12

వ్రతములు నుపవాసముల నున్ననూ పరమోత్తము రాలైన మహిన్!
భర్త ననుసరించని యా ప్రమదము పాపగతిని బొందును నిజమూ!
వ్రత బూజాదులు జేయకున్ననూ సతతము బతి పూజలు సేయన్
ఉత్తమమైనా స్వర్గధామమును నురుగుణవతి స్త్రీ బొందు నికన్! 13

భర్త హితంబును ప్రియమును గోరుచు భార్య సేవ సేయగవలయున్!
పూర్వమునుండీ జరుగుచుచున్న దిది పుణ్యపురుషులును జెప్పినదీ !
వేదములందును స్మృతుల యందునూ వివరముగా బలుకగ వడియెన్!
మానుష ధర్మంబని శాస్త్రంబులు మఱల మఱల దెలుపగ వడియెన్! 14

తల్లీ! నా కొఱకై సతతంబును దగ మర్చింపుము దేవతలన్!
ఉత్తమ వ్రతములు గల బ్రాహ్మణులను శక్తిమీర బూజింపు మికన్!
నియమ వంతురాలవుగా గడుపుచు నియతాహారము గైకొనుచున్
భర్తసేవ జేయుచు నా కొఱకై ప్రతీక్ష సేయుము సంప్రీతిన్! 15

నేను తిరిగి వచ్చిన పిమ్మట మన నిఖిల ప్రజల సంరక్షకుడున్!
రాజు బ్రతికి యుండినచో బొందెదు రమ్యోత్తమ మగు గోరికలన్!
అని పలుకగ శ్రీరాముడు దల్లియు విని శోకముచే బీడితయై
కన్నీటిని నొలుకుచు రామునితో జిన్ని మాటలను నిటులనియెన్! 16

స్థిర చిత్తముతో వెళ్ళి రమ్మికను క్షేమము గలుగును నీకు సదా!
పుత్ర! నీవు వచ్చిన పిమ్మటనే పొగులు దుఃఖమంతయు దొలగున్!
మహాభాగ! నీ కర్తవ్యంబును మానుగ నెఱవేర్పుము నింకన్!
తండ్రి ఋణంబును దీర్చి రమ్మికను దిగ సౌఖ్యమూ నే బొందగనూ! 17

రామా! నా మాటను గాదనుచును రహి వనములకును బోవుటకున్!
ప్రేరేపించెడి దైవ రీతిని బేర్మి తెలియజాలరు నెవరున్!

మహాబాహు! రామా యిక వెడలుము! మహాటవులకును క్షేమముగా!
తిరిగివచ్చి యానంద మొనర్పుము తేనె లొలుకు ప్రియ వాక్యములన్! 18

జటావల్కలము ధరించి మునిగా చారు వనస్థలముల నుండీ!
తిరిగి వచ్చు శుభ దినము నేడైన తీరుగ యెంతటి సౌఖ్యంబో!
ఈ విధమున నా కౌసల్యాపతి నింపుగ పుత్రునివ్రత దీక్షన్!
అడవుల కేగగ నిశ్చయంబుగల యాతని గన్నారగ జూచీ! 19

శుభలక్షణముల రామచంద్రుని శుభపచవములను దీవించెన్!
తండ్రి వచనమును బాలింపుమనీ తగ శీఘ్రముగా రమ్మనుచున్!
వనమున వనదేవత లందఱునూ వాసిగ రక్షణ సేయంగన్!
`వి దేవతలును, ఋషిదేవతలను తిన్నని దారులు నూపంగన్!
స్వస్తియనుచు మంగళము బలికినది సకల దేవతలు నౌననగాన్! 20

(అయోధ్యాకాండమున-24వ సర్గము సమాప్తము)

★ ★ ★

## ఇరువదియైదవ సర్గము

[వనవాసమునకు బోవుచున్న శ్రీరాముని కౌసల్యాదేవి ఆశీర్వదించుట - తదుపరి శ్రీరాముడు సీతా నివాస మందిరమునకు బోవుట]

మనస్వినియయగు నీ కౌసల్యయు మసలు దుఃఖమును నణచుకొనీ!
ఆచమనంబును జేసియు శుచియై యలరి మంగళములను పలికెన్!
రామా! నిన్ను నివారించుటకును రహి శక్యము గాకున్నదిగా!
వెళ్ళిరమ్ము శీఘ్రముగా వర్తిలు విమల పూరుషుల మార్గమునన్! 1

ఏ ధర్మంబును నియమము దోడుత నిలిచి రక్షణను జేసితివో!
ఆ ధర్మమె నిను పరిరక్షించును!నహర్నిశలు గనురెప్ప వలెన్!
చైత్యములందున దేవాలయముల నిత్యవందనము జేయుదువో!
ఆ దేవతలును, మహర్షులును వని యలరుచు రక్షింతురు గాతన్! 2

ధీమంతుడగు విశ్వామిత్రుని దివ్యాస్త్రములన్నియు నిన్నున్!
సద్గుణంబులను నిండియున్న నిను సదా రక్ష సేయును గాతన్!
పితృసేవయును, మాతృసేవయును బేర్మి సత్యములు గాపాడన్!
చిరకాలము జీవింపు గుమారా! స్థిరచిరకీర్తులు వర్ధిలగన్! 3

సమిధలు, కుశలు, బవిత్రంబులునూ సకలాయతన స్థండిలముల్!
సకల వృక్షములు, మొక్కలు, సరసులు, సకల పక్షి మృగ సంతతులున్!
క్రూర మృగములగు వ్యాఘ్ర సింహములు కుటిల సర్పకుల జాతులునూ!
రక్షించును నిను నహర్నిశంబులు రఘుకుల తిలకా! నిన్నెపుడున్! 4

సాధ్యులు, సిద్ధులు, విశ్వదేవతలు సకల మరుత్తులు మహర్షులున్!
మంగళంబులను బ్రసాదించెదరు మహిత శ్రేయములు గలుగంగన్!
ధాత, విధాతయు రక్షణ సేతురు దగ పూషుడు మఱి యర్యముడున్!
భగుడు మంగళము సేయుత నీకును బటుతర శుభములు గలుగంగన్! 5

వాసవాది ప్రముఖులు దేవతలును వరుసగ దిక్పాలకులు మఱిన్!
నీకు క్షేమమును జేయుత గాతను నీకు మంగళము శేకూరన్ !

పక్షములును, మాసములు, ఋతువులను బరగ వత్సరములును మఱియున్
దినములు, రాత్రులు, ముహూర్తములునూ! యనయము రక్షించునుగాతన్! 6

కుమాత! స్మృతి శృతి ధర్మంబును మఱి కుమార స్వామియు సోముండున్!
బృహస్పతియునూ, సప్తఋషులునూ యహర్నిశలు రక్షింతురుగా!
దిక్కులు దిశలును గాపాడును నిను దిక్పాలకులును బ్రోవుతనూ!
అటవీ స్థలమున సంరక్షింతురు నంతట నిత్యము సంప్రీతిన్! 7

శైల సముద్రములును వరుణుడునూ స్వర్గము నాకాశము నదులున్!
గృహములు, భూమియు, నక్షత్రంబులు, గృహ దేవతలును, సంధ్యలునూ!
అహోరాత్రములు నిను రక్షించును నంతట విజయము గల గంగన్!
ఆఱు ఋతువులును, వత్సరంబులును నలరు కలలు కాష్ఠలు నీకున్!
వనమున నుండగ సుఖము నిచ్చెడివి మననున గష్టము లేకుండన్! 8

ముని వేషంబున వనమున నుండగ ముదమున సురలును దైత్యులునూ!
సదా సుఖములను నిత్తురు గావుత సహజీవనమును జేయుచునూ!
రాక్షసులయు మఱి పిశాచంబులయు రహి క్రవ్యాదుల జంతువులన్!
భయమింతయు లేకుండ గావుతను భద్రమగును వనవాసంబున్! 9

గహనకుండు కోతులు వృశ్చికములు గడు క్రూరములగు సర్పములున్!
ఈగలు, దోమలు, గీటకంబులును నింత బాధ లేకుండగనూ!
మహా గజములును మహిషంబులునూ మహా సింహ భల్లూకములున్
నీ కపకారము జేయకుండగా నీ కుపకారము జేయవలెన్! 10

నృమాంస భోజన రౌద్ర జంతువులు నియమముగా జోలికి రాకన్!
నా పూజలచే తృప్తినిబొంది నయముగ సాధువు లయ్యేడినీ!
మంగళకర మగు నీ మార్గంబులు మంగళ మగు నీ విక్రమమున్!
సమస్త కార్యములను సాధింపుము! స్వస్తి యనగ దివిదేవతలున్! 11

దివి భువి నుండెడి దేవతలందఱు దివిరి శుభము లిత్తురు గాతన్!
అపాయ మింతయు గలుగకుండగా నలరుము శుభమున వనవీధిన్!

గురుడు చంద్రుడును యముడు సూర్యుడును గుబేరుడును నా పూజలకున్!
దండక వనమున నున్న నిన్నెపుడు దగ రక్షింతురు సంప్రీతిన్! 12

స్నాన హోమ జప సమయము అందున జలాగ్ని వాయువు ధూమములున్!
ఋషి ముఖముల వచ్చిన మంత్రములును ఋషుల వోలె గాపాడెడు నిన్!
శివుడు బ్రహ్మ విష్ణువును ఋషులునూ దివి దేవత లందఱు గూడన్
వనము జరించెడి నిన్ను గాపుతను వన్యదేవతలు గూడ నినున్! 13

యశస్వినియు మఱి యాయతలోచల యమ్మ కౌసల్య రామునితో
ఇటుల బలికి దా సర్వదేవతల నింపుగ పూజించెను భక్తిన్!
పుష్ప మాలికల, సుగంధములనూ పూర్ణ స్తోత్రముల బారములన్!
అర్పించెను భక్తిని బూజించెను నలరి వందనము లర్పించెన్! 14

రాముని శుభమును గోరి కౌసల్య రయమున విప్రుని బిలిపించి!
యథారీతి హోమము జేయించెను సదాభక్తి నంతయు జరుగన్!
కౌసల్యా సతి హోమంబునకై కమ్మని నేయియు సమిధలునూ!
తెల్లని పూవుల దండలు దెమ్మని తెల్లని యావాలును వేగన్! 15

యథా శాస్త్రముగ యుపాధ్యాయుడును యథారీతి హోమము జేసెన్!
శాంతి హోమమున మిగిలిన ద్రవ్యము శాంతి బలులనూ యర్పించెన్!
మధు-దధి-యక్షత-ఘృతముల దోడను మానుగ పుణ్యాహము జేసీ
వనిలో సుతునకు క్షేమము గలుగగ వరమంత్రములను జదివించెన్! 16

ఉపాధ్యాయులకు దక్షిణ లిచ్చీ యుర్వి దేవతల బూజించీ!
రామునితోడను నిట్లని బలికెను రమణి దీవెనల నిచ్చుచునూ!
వృత్రాసుర సంహార సమయమున గృతాంజలుండగు నింద్రునికిన్!
సకల దేవతలు దీవెన లిచ్చిరి సకల శుభంబులు గలుగంగన్!
ఏ శుభములు గలిగెనో యింద్రునికిని నా శుభములు నీకగు గాతన్! 17

అమృతంబు దెచ్చుటకు సుపర్ణుడు నరుగునపుడు నా వినతయునూ!
ఎట్టి మంగళములను దా బలికెనో అట్టి మంగళము లగు గాతన్!
అమృతంబు బుట్టించు సమయమున యలరి దైత్యులను జంపుటకై

తల్లియైన యా యదితి దేవతయు దగ దేవేంద్రుని గాంచుచునూ!
ఎట్టి మంగళములను దా బలికెనో యట్టి మంగళము లగు గాతన్! 18

మూడడుగులలో త్రిలోకములనూ ముదమున నతిక్రమింపగనూ!
వామన రూపము దాల్చినట్టి యా వాసవు దమ్ముని బొడగాంచీ!
సాటిలేని తేజస్సు గలిగినా సారసాక్షి యా యదితియునూ!
ఎట్టి మంగళములను దా బలికెనో యట్టి మంగళము లగు గాతన్! 19

మహాబాహు! శుభకరములు మఱియును మంగళప్రదములు ఋతువులునూ!
సముద్రములు, ద్వీపములు, వేదములు, సకల లోకములు దశదిశలున్!
నీకు శుభములను నిచ్చు గావుతను నీకు మంగళము లగు గాతన్!
సర్వభూతములు నీదు మార్గమున శాంతి సుఖము లిచ్చుత గాతన్! 20

ఆయత లోచన కౌసల్యాసతి యమిత ప్రీతి సుతు శిరసుననూ!
విమలాక్షతలను జల్లి మేనిపై విమల గంధముల బూసినదీ!
విశల్యకరణీ యను నోషధినీ విమల మంత్రముల బూజించీ!
రక్షగ గట్టీ యభిమంత్రించెను రమ్య శుభంబులు గలుగంగన్! 21

దుఃఖము దోడుత గూడియున్ననూ తొలకరించి సంతోషంబున్!
తొట్రుబాటుతో బలికె సుతునితో దోరముగా మృదు వచనములన్!
సిద్ధార్థుడవై యథా సుఖముగా శ్రీ జయలక్ష్మిని బొందగనూ!
కుమార! రాఘవ సుఖముగ జనుమా! కృతకృత్యుడవై వే రమ్మా! 22

ఆరోగ్యముతో సర్వ సిద్ధులను నానందముతో రాగలవూ!
తిరిగివచ్చి యా యయోధ్యకంతకు స్థిరమగు రాజవు గాగలవూ!
ప్రజలందఱు నిను జయజయ ధ్వనులను ప్రహర్షమున స్వాగత మిడగా
అట్టి నిన్ను గనులార గాంచెదను యానందబును బొందెదనూ! 23

వనమునుండి వచ్చిన నిను గనియెద వాసిగ పున్నమి చంద్రునిగా!
అలత నలతలను మఱచి పోయెదను గష్టములన్నియు నే మఱతున్!
పితృ నాజ్ఞ బాలించి వనములను ప్రేమ మీర వాసముజేసీ!
భద్రాసనమున నున్న నిన్ను గని భవ్యానందము బొందెదనూ! 24

కుమార! రమ్మా! వనమునుండి వే గూర్పుము! సంతోషము నాకున్!
సర్వమంగళుడవై నా కొర్కెలు సఫలము జేయుము సంతసిలన్!
నే నర్చించెడి దేవగణములును శివ బ్రహ్మాదీ దేవతలున్!
మహాఋషులు, భూతములు, నురగులును, మహాసురులునూ,దిక్కులునూ!
వనము జనిన నీ హితమును గోరుచు వర్తింతురు గాపాడుచునూ! 25

ఈ విధముగ బలుకుచు కౌసల్యయు నింపుగ దీవెన లిచ్చుచునూ!
అశ్రుపూర్ణ లోచనయై యాసతి యథావిదిని సస్త్యయనమునూ!
పూర్తిజేసి, రక్షార్థము సుతుని బొలుపుగ చుట్టును దిరుగుచునూ
మాటిమాటికిని గౌగలించుకొనె మాతృప్రేమ బొంగారంగన్! 26

ఆ విధముగ కౌసల్యా దేవియు నలరి ప్రదక్షిణలను సేయన్!
రామచంద్రుడును దల్లి చరణముల రమ్య నమస్కృతులను జేసి!
మౌనముగా గనె మాతృ వదనమును మమత బొంగ సంద్రము వోలెన్!
కాంతులు జిమ్ముచు జనియె రాఘవుడు కాంత సీత వాసంబునకున్! 27

అయోధ్యాకాండములోని ఇఱువదియైదవ సర్గము సమాప్తము

* * *

## ఇరువదియారవ సర్గము

(శ్రీరాముడు దిగులుగా నుండుటగని, సీత కారణమడుగుట- శ్రీరాముడు విషయమునుజెప్పి, తాను వనవాసమునకు బోవుచుంటిననియు, నీవు అయోధ్యలో నుండుమని సీతాదేవికి దెలుపుట)

తల్లి మంగళాశీర్వాదము గొని తల్లికి వందనమును జేసీ
ధర్మమార్గమున రామచంద్రుడును దగ పయనంబయ్యెను వనికిన్!
రాజ మార్గమున దా బయసించుచు రమ్య కాంతులను జిమ్ముచునూ!
తన సద్గుణముల జనుల హృదయమును దగ నాకర్షించుచు బోయెన్! 1

అభిషేకమునకు నుపవాసముతో నలరు జనకజకు దెలియ దిదీ!
అభిషేకం బిక జరుగు ననుచునూ నంతరంగమున హర్షమునన్!
అభిజ్ఞురాలగు సీతాదేవియు సకల పూజలను గావించీ!
సహర్షంబునను రామచంద్రునీ సరస వీక్షణముతో నుండెన్! 2

సిగ్గున రాముడు దలను వంచుకొని చింతవంత ముఖమున దొలుకన్
హర్షానందము దొణికిసలాడెదు నా గృహమున రాముడు జొచ్చెన్!
సీత వెంటనే లేచి చూచెనూ చింత నొందు రాముని ముఖమున్
వేపమాన సంతప్త హృదయుడై విలవిల లాడెడు రాము గనెన్! 3

ధర్మాత్ముడు శ్రీరాము డంతటను ధరణిజ ముఖమును గనుగొనగా!
మనోగతంబగు వేదన యంతయు మనసున నిముడక వెలువడియెన్!
వివర్ణవదనుండగు రాముని గని యవనిజ గంపెడు దుఃఖముతో!
'ఇటుల నెందుకుంటివి స్వామీ!' యని నింపుగ బలికెను గద్గతికన్! 4

నేడు బృహస్పతి దేవతగా గల పోడిమి పుష్యమి నక్షత్రం!
అభిషేకమునకు దగిన దటంచును నార్యులు దెలిపిరి నిక్కముగన్
దుఃఖంబున కిక కారణమేమీ? దురితంబది యెది లేదుకదా!
అలత నలతలకు గారణ మేమీ? కలతజెంద కారణ మేమీ? 5

సుందరమగు నీ ముఖకమలంబును అందమైన ఛత్రంబులచే
ఎండ దగులకను ప్రకాశించెడిది చండ భానునీ వేడిమికిన్!
అట్లు గప్పబడ లేదెందులకో అవనీ వల్లభ! కారణమూ? 6

తామర పూవుల వంటి కనులుగల తరుణ! నీదు ముఖచంద్రునకున్
చంద్ర-హంస సువికాసంబులునగు సాంద్ర శ్వేత వింజామరయున్!
వీవబడుట లేదేమి కారణము వివరింపుము వే ప్రాణేశా! 7

వంది మాగధులు మంగళ గీతుల నందముగా నిను బొగడెదరూ!
సూతులేరి? యా మాగధు లెచ్చట? సురుచిరమగు నా స్తోత్రములున్!
లేని కారణము దెలుపుము నాధా! కాని కారణము జరిగినదా? 8

వేద పారగులు విప్రులు మునులును విధిగా నభిషేకము నందున్!
నీ శిరస్సునకు దేనెను, బెరుగును నిలిపెదరది లే దెందులకూ?
ఏమి కారణము జిన్నబోవుటకు ఈ విధి కలతకు కారణమూ? 9

అమాత్యాది ప్రకృతులు, వర్తకులు నఖిల పౌరులును, జానపదుల్!
అలంకరించక భూషణములతో బొలుపుగ నాతో రారేమీ?
ఏమి కారణము నీ విధి జరుగుట యే యుత్పాతము జరిగెనొకో? 10

కాంచన భూషితమగు గుఱ్ఱములును గనక భూషితంబగు రథమున్!
నడచుట లేదెందులకో ముందది నయముగ భట సందోహముతో!
ఆగిపోయెనా యా యుత్సవమును అందుకు కారణ మేమొగదా! 11

నీ ప్రయాణమున యగ్రభాగమున నిర్మల లక్షణ పూజితమౌ!
కృష్ణ మేఘగిరి ప్రభలను జిందెడి హస్తి గానబడ దెందులకో?
కారణమేమో తెలియదుగా మఱి కఠిన పరిస్థితు లవి యేమో! 12

కాంచన చిత్రిత భద్రాసనమును నంచితముగ ముందుంచుకొనీ!
కదలవలెను గద గజము ముందఱను కలకల బాడెడు స్త్రీ పురుషుల్!
అట్టి యుత్సవము గనరాదేమీ? అట్టి వైభవము లేదేమీ? 13

అభిషేకంబటు జరుగుచుండగా నంతరంగమున గలవరమున్!
గలుగునటులుగా నే గనుగొంటిని కమనీయంబగు నీ ముఖమున్!

వివర్ణమయి కడు గ్రొత్తగనుండె వికృతమగు జింతయు గూడన్!
ప్రహర్షమింతయు గాన రాదుగా బలుకవు నింతకు కారణమూ? 14

ఈ విధముగ విలపించు సీతతో నిట్లని పలికెను రాఘవుడున్!
పూజ్యుడైన నా తండ్రి యదవులకు బొలుపుగ పొమ్మనె నన్నిపుడే!
ధర్మజ్ఞవు! మఱి ధర్మచారిణివి! తగ చెప్పెద విను! సకలంబున్!
నా వనవాసం బెట్లు వచ్చెనో నా యభిషేకం బాగినదీ? 15

సత్య ప్రతిజ్ఞుడు దండ్రి దశరథుడు దగ నాతల్లిని గైకకునూ!
రెండు గొప్ప వరముల దయచేసెను నిండుగ సంతోషము నందీ!
మహారాజు నా యభిషేకంబును మఱి జేయగ దలపెట్టగనూ!
ఆవరంబులను వెలికి దీసి తన యానబెట్టి నెగ్గించు కొనెన్! 16

పదునాల్గేడులు దండక వనమున బరగ నివాసము జేయవలెన్!
యౌవరాజ్యమును భరతున కిచ్చెను నవనీభారము మోయగనూ!
తండ్రి వచనమును నిజము సేయగా దగ నే నిర్జన వనములకున్
బోవుచుంటినీ! చూదవచ్చితిని! బొలుపుగ నీ భవనంబునకున్! 17

నీ వెన్నడు నిక భరతుని యెదుటను నితరములగు నా ప్రసంగముల్!
తేవలదుసుమా! తెలివిగ మెలగుము! దీరు దెన్నులను దెలిసికొనీ!
బుద్ధి యుక్తులగు వారు సహింపరు శుద్ధములగు పరస్తోత్రములన్!
అందువలన భరతుని ముందెపుడును బొందుగ నను దెలుపగరాదూ! 18

నిను బోషింపగ వలసిన భారము నీతిమంతు డా భరతునకున్!
లేదు సుమా! యనుకూల వర్తనను సాధుమార్గమున నుండవలెన్!
పరంపరాగతమైన రాజ్యమును బన్నుగ భరతున కర్పించెన్!
భరతుని మఱి మహరాజు దయలునూ పరగ పొంద జేయుము భక్తిన్! 19

తండ్రి యాజ్ఞ బాలించుచు నిపుడే దగ బోవుచునుంటిని వనికిన్!
మనస్వినీ! సీతా! ధైర్యముతో మానుగ వర్తింపుము స్థిరతన్!
ముని నివేషితంబగు వనములకును ముదమున నే జనుచుండగనూ!
వ్రతోపవాసములను జేయుచునూ వాసిగ నుండుము నీ విచటన్! 20

ఉషఃకాలమందున లేచియునూ యుదయ కాల పూజలు జేసీ!
తండ్రి నరేశ్వరునకు గావింపుము! దగ వందనముల సద్భక్తిన్!
కృశించినదియును, వృద్ధురాలు నగు మనిలిపోవు నా తల్లికినీ!
ధర్మమునకు ప్రాధాన్య మిచ్చుచును ధార్మిక దృష్టిని జూడవలెన్! 21

మిగిలిన దల్లులగూడ జూడుమూ! మేలిమి గారవమునను దగన్!
ప్రేమస్నేహ పోషణల జేతనూ ప్రీతి మానసులు గద సీతా!
విశేషించి శత్రుఘ్న భరతులను వినుము! ప్రాణసములును నాకున్!
సోదరులను వలె బుత్రుల వలెనూ మదిని దలచి చూదగ వలయున్!

దేశంబునకును, మన కులంబునకు దీరుడు భరతుడు ప్రభువుగదా!
అట్టి భరతునకు నప్రియ మెపుడును నలరి జేయగూడదు సుమ్మా!
మంచి స్వభావముచేత రాజులను నంచితముగ సేవించినచో!
ప్రసన్నులగుదురు; అట్లు కానిచో ప్రకోపించెదరు; నగ్నివలెన్! 23

ఔరస బుత్రులగూడ ద్యజింతురు యహిత కారిణుల నరేంద్రులున్!
సమర్థులను నితరుల సహితమునూ సమహిత బుద్ధిని గొనియెదరూ!
కల్యాణీ! భరతున కనువర్తిగ కమనీయముగా వర్తిలుచున్
ధర్మము నందాసక్తి భావమును దగ నివసింపుము నిచ్చటనే! 24

ప్రియే! పోవుచుంటిని వనములకును బితృ వచనమును బాలింపన్
అందటికిని ననుకూలవతివిగా నాదరింపుమూ సద్భక్తిన్!
ఎవ్వరికిని నే యపకారంబును నొవ్వగ జేయక సంప్రీన్!
ఇది నా వచనము జేయుదగినదీ! నింపుగ ధర్మాచరణంబున్! 25

(అయోధ్యకాండమున-26వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## ఇరువదియేడవ సర్గము

(సీతాదేవి తననుగూడ వనమునకు దీసికొని వెళ్ళుమని శ్రీరాముని ప్రార్థించుట)

ప్రియవాదిని యగు సీతాదేవియు ప్రేమమీర రాఘవు బలుకుల్!
విని ప్రియముననే కోపించినదై విమల వచనముల నిటు బలికెన్!
'రాజకుమారా! తెలుపుసదేమిది? రహి లఘువాక్యములును దగునా?
అపహాస్యంబగు బలుకు బలికితివి యలరి పలుక నోరెటు వచ్చెన్? 1

ఆర్యపుత్ర! తల్లియు, దండ్రియునూ నలరు సోదరుడు బుత్రుడునూ!
వారు వారు జేసిన పుణ్యములను వారె యందుదురు నా ఫలముల్!
భార్య యొక్కతియె భర్త భాగ్యమును బంచుకొనును నది నిశ్చయమూ!
నిను వనముల బొమ్మనిన నన్నునూ నిశ్చయముగ బొమ్మని నటులే! 2

తల్లి దండ్రి నాత్మజుడు జెలులునూ తగ తానును గతికాదు సుమా!
ఇహ పర లోకములందు బ్రమదకును నింపుగ భర్తయె గతిసుమ్మా!
దుర్గమ వనముల బ్రయాణించుచో నిర్గమింతు నీ ముందుగనే
కుశ కంటకములను నలగ జేయుదును కుశలముగా నీ మార్గమునూ! 3

మహావీర! నను మన్నింపుము దయ మాట నీదు మన్నింపను మా!
ఈర్ష్య రోషముల బరిత్యజింపుము నింపుగ నను వని గొనిపొమ్మా!
పాపమును లేదు సుమా! మఱి యెట్టి కష్టమును గలుగదుగా!
...కమున నీతో గొనిపొమ్మా! నాథ! జే కొనుము! నా వినతిన్! 4

ప్రాసాదాగ్రములందు నున్ననూ భవ్య నివాసము లందున్నన్!
భర్త పాద చ్ఛాయయె స్త్రీజాతికి భవ్యాశ్రయ మది యోచింపన్!
తలిదండ్రులచే ధర్మ విషయములు దగ బోధింపగ బడితిని నే!
ఎటుల నేను వర్తింపవలయునో యెవ్వరు దెలుపగ పనిలేదూ! 5

దుర్గమ వనమును జనశూన్యంబును దుష్టమృగములను గూడినదీ!
అట్టి వనమునకు నేను వచ్చెదను నలరి భయము నే జెందకనూ!
ఇతర విషయముల జింతింపక నే నింపుగ పతి శుశ్రూషలచే
పితృభవనమున నుండిన యట్టుల ప్రేమమీర సుఖముగ నుందున్! 6

నిత్యంబును నీ సేవ జేయుచును నియతి బ్రహ్మ చర్యంబుననూ!
మధుగంధిషు వనముల చరించుదును మాకుగ నీతో విహరింతున్ !
అన్యజనుల రక్షణమును గూడను నడవులందు దగ జేయుదువూ!
నామాటను మఱి చెప్పనేల యిక నాథ! దెలుప వలెనా యదియున్! 7

నీతో బాటుగ నడవికి వచ్చెద నిస్సంశయమిది గొనిపొమ్మా !
మహాభాగ! ననునెవ్వరు గూడను వఱల్ప శక్త్యులు గారు నికన్!
కందమూల ఫలములను భుజింతును! యందమైన వనముల యందున్!
నీకు దుఃఖమును గలిగింపకనూ! నివసింతును నీతో గూడీ! 8

ధీమంతుడవగు నీతో గూడుక ధీరత నిర్భయముగ వనిలో!
నదీనదములను బర్వతంబులను నయముగ వనమున గాంచెదనూ!
వీరుడవగు నీ సరసనుండి నే విమల సరస్సుల గాంచెదనూ!
హంసలు, కారండములు గూడినా యమల పద్మినీ సరసులనూ! 9

విశాలాక్ష! దృఢవ్రతనై వనముల విమల సరస్సుల మునుగుచునూ!
పరమానందము బొందుచు నీతో భవ్య విహారము జేయుదునూ !
ఈవిధముగ నే వేల వర్షములు నింపుగ గడిపెద నీతోడన్!
నీవులేని యా స్వర్గమైననూ నే గోరను నొక క్షణమైనా! 10

సుదుర్గమగు వనముల నే వచ్చెద సుందరమగు పశుపక్షులచే
నాకీర్ణంబగు నడవులందు నే నానందముగా గడిపెదనూ!
నియమ వంతురాలుగ నీ పదముల నిరతము సేవను జేయుచునూ !
పుట్టినింట సుఖమున నున్నటులుగ స్ఫూర్తితోని ప్రకృతి యొడిలోన్! 11

అనురాగమునే గోరుచుంటి నే నన్యభావములు లేకుందన్ !
నీవియోగ మేర్పడిన పక్షమున నిశ్చయించితిని మరణింపన్!
నను వనముల సీతో గొనిపొమ్మా! నా ప్రార్థనన మన్నింపు మీకన్!
నీ కేమియు బాధయు గలుగదు నూ! నీతో నను గొనిపోవగనూ! 12

ఆవిధముగ యా సీతాదేవియు యా రాఘవుతో బలికినసూ!
మనసునందు నంగీకరింపకను మర్మముగను జనకజ తోడన్!
వనమునందు వాటిల్లు నాపదలు వతుసగ దెలుపగ మొదలిడియెన్!
వన గమనంబును మాన్పగ సీతను ఘన భీకరముల బేర్కొనుచున్! 13

(అయోధ్యాకాండమునందు 27వ సర్గ సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## ఇరువదియెనిమిదవ సర్గము

(శ్రీరాముడు సీతాదేవికి వనవాసము నందలి కష్టములను వివరించి వనములకు రావలదని వారించుట)

ధర్మవత్సలుడు రాఘవు డంతట ధరణిజ వాక్యములను వినుచున్!
వనములందు గలిగెడి యాపదలను వరుసగ మనమున యోచించీ!
వన గమనోద్యమమును దప్పింపగ వినయముగా బలికెడి సీతన్
కంటినీరు జే దుడిచి రాముడును గరుణమీర యిటుల ను బలికెన్! 1

ఉత్తమ కులమున జనన మందితివి యురుగుణ శీలవు గద సీతా!
ఇచటినుండి పాలింపు ధర్మమును నింపగు సుఖమును గలుగు గదా!
అబలవైన సీతా! జేయుము నే నలరి తెలిపినటు సిద్ధంబై!
వనమున కష్టము లనేకములు సుమ! వానిని దెలిపెద స్పష్టముగా! 2.

వననాసము జేసెడి సంకల్పము మనసున విడువుము వై దేహీ !
ప్రవేశింప శక్యము కాని దదీ బహుదోషంబులతో నుండున్ !
వనము సర్వదా దుఃఖమయంబును వాసిగ కంటకమయ మదియున్!
సుఖము గలుగదట యెన్నడును విను! జూడ భయంకర దృశ్యములున్!3

గిరులనుండి ప్రవహించెడి యేఱులు గీచుగీచుమను శబ్దములున్ !
గిరి కదరముల సింహధ్వనులును గీయను భీకర నిస్వనముల్!
వనవాసము బహు దుఃఖనిలయ మది జనకజ! నడువకు నడవులకున్! 4

జనశూన్యంబగు నరణ్యమందున నసయము మహా మృగంబులు సూ !
మానవులను జూడగనే మీదికి మదమున పై విజృంభించున్!
వనవాసము బహు దుఃఖదాయకము జనకజ రాకుము! నడవులకున్! 5

నదులు బంకమున నిండియుండునూ నానా జలచర జీవులతోన్ !
నిండి యుండు మఱి దాటనశక్యము మెండుగ యుండును గఠిన శిలల్!
వనవాసము బహు దుఃఖదాయకము జనకజ రాకుము నడవులకున్ ! 6

లతా కంటకములును దారులునూ లలి కృకవికంబుల ధ్వనులున్!
జలము లభింపదు, మార్గములుండవు జలదరించు బెను వృక్షములున్!
వనవాసము బహు గష్టభరితమది జనకజ రాకుము! వనములకున్ ! 7

పర్ణశయ్యలను నిదురింపగ వలె బన్నుగ భూతల మందుననే!
పగలంతయు శ్రమ బడవలయును సుమ! బన్నుగ నాహారంబునకై!
కావున వనవాసము బహుకష్టము కాంత! రాకుమా వనములకున్! 8

అహో వ్రాతములు నియమము దోడుత నాత్మ దృప్తి జెందగ వలయున్!
రాలిన ఫలముల భుజింప వలయును! రంజిలవలె జెట్టుల నీడన్!
కావున వనవాసము బహు కష్టము కలికీ రాకుమా యడవులకున్! 9

శక్త్యనుసారము నుపవాసములను భక్తిజేయగను వలయునుమా !
నారచీరలును, జటాభారమును నయముగ ధరింప వలయునుగా !
కావున వనవాసము బహుకష్టము కలికి! రాకుమా! యడవులకున్ ! 10

దేవతలను మఱి పితృదేవతలను దీక్షను బూజింపగవలయున్!
వచ్చిన యతిథుల విధి పూర్వకముగ మచ్చిక బూజింపగ వలయున్!
కావున వనవాసము బహుకష్టము! కాంత రాకుమా! వనములకున్! 11

అడవులందు నివసించెడి వారలు నీతినియమమున బ్రతిదినమున్!
ఉదయ సాయ మధ్యాహ్నములందున నొప్పుగ స్నానము జేయవలెన్!
కావున వనవాసము బహుకష్టము కాంత! రాకుమా! వనములకున్! 12

స్వయముగ తెచ్చిన కుసుమంబులతో సానుకూలముగ యర్ఘ్యవిధిన్
వేదిక యందున బూజింపగవలె వినయభక్తితో గూడికొని !
కావున వనవాసము బహుకష్టము కాంత! రాకుమా! యడవులకున్! 13

కానలందు నివసించెడి వారలు కాంత! నియమితాహారులుగా
వనమున లభించు ఫలముల దినుచును మనసున దృప్తిని బొందవలెన్!
కావున వనవాసము బహు కష్టము! కాంత! రాకుమా! వనములకున్! 14

అరణ్యమున బెనుగాలులు వీచును నాకలి బాధయు మఱియుండున్!
తిమిరము నత్యధికముగా నుండును నమిత భయంబును గలిగించున్!
కావున వనవాసము బహుకష్టము కాంత! రాకుమా యడవులకున్! 15

బహురూపములగు సరీసృపంబులు బహుస్వేచ్ఛగ దిరుగుచు నుండున్
అనుక్షణ మాపదలకును మూల మది యతి భయంకరంబుగ నుండున్!
కావున వనవాసము బహుకష్టము! కాంత! రాకుమా! యడవులకున్! 16

నదులయందు నివసించు సర్పములు నదుల వోలె నడిచెడి నవియున్!
మార్గ మడ్డగించుచు నట నిలుచును మర్మముగా శత్రుల వోలెన్!
కావున వనవాసము బహుకష్టము! కాంత రాకుమా! యడవులకున్! 17

పక్షులు, లేళ్లను, గీటకంబులును బరగ యీగలును, దోమలునూ!
నిత్యము నందఱ బీడించును సుమ! నీరజాక్షి! నీ వోర్వవుగా!
కావున వనవాసము బహు కష్టము! కాంత! రాకుమా! యడవులకున్ 18

వృక్షములును, దర్భలు, కాశములూ యక్షయముగ ముండ్లను గూడి!
ఒకటి నొకటి పెనవేసి యుండునట యొద్దిక శిఖరాగ్రంబులతో!
కావున వనవాసము బహుదుఃఖము కాంత! రాకుమా! వనములకున్! 19

శరీర కష్టము లనేకముండును సహియింపగ వలె నోరిమితో!
వివిధ భయంబులు వనమున నుండును విమలవాణి! సుఖ ముండదుగా!
కావున వనవాసము బహుకష్టము కాంత రాకుమా! వనములకున్! 20

క్రోధ లోభముల విడువగ వలయును గూర్మి దపస్సున నిలుపవలెన్!
భయపడవలసిన స్థితి యందునను భయము లేక చరియింపవలెన్!
కావున వనవాసము బహుకష్టము కాంత రాకుమా! వనములకున్! 21

ఆ కారణముల వనవాసమునకును నలరి రాకుమా వైదేహి!
సుకుమారివి! కానలలో నుండుట నీకు దగినదియు గాదుగదా!
ఆలోచించిన కొలది వనమునను నతిశయ కష్టములే యుండున్!
రాణి వాసమున గడిపిన దానవు! రమణి యెటుల వత్తువు వనికిన్? 22

అని పలుకగ శ్రీరామచంద్రుడటు ! నడలుచు నా వైదేహియునూ!
కన్నీరును బ్రవహింప జేయుచును కాంత పలికె నిటు రామునితో! 23

[అయోధ్యాకాండమునందు 28 సర్గము సమాప్తము]

## అయోధ్యాకాండము - ప్రథమ భాగము

### ఇరువది తొమ్మిదవ సర్గము

(తానుగూడ వనమునకు రామునితోపాటు కలిసి వెళ్లుట యుక్తమని సీతా దేవి వాదించుట)

భర్తృ వాక్యములు విని యా సీతయు బహు భంగుల దుఃఖించుచుసూ!
ప్రసక్తాశ్రుముఖియై రాఘవుతో బహు నెమ్మదిగా నిటు లనియెన్!
వనియందలి దోషముల నన్నిటిని వర్ణింపంబడె నీ చేతన్!
నీ స్నేహంబది గలిగి యున్నచో నిజముగ యగు నన్నియు గుణముల్! 1

శార్దూలంబులు సింహ గజములును శరభంబులు మఱి పశులుసూ!
నీ రూపము నెన్నడును జూడకను నిన్ను గాంచి మది భయబడుచున్!
పరుగు లిడుచు మఱి పారిపోవునూ! చరియింపగ వేఱొక చోటన్!
భయకారణములను గలిగినపుడు మఱి భయపడకుండెడి వారెవరూ? 2

పెద్దల యాజ్ఞను శిరసున దాలిచి పేరిమి నీతో వనములకున్!
గోవలయును మఱి వియోగమొదవిన బొలుపుగ యసువుల విడిచెదసూ!
ు సమీపమున నే నుండిన మఱి నింగి దేవతల రాజైనా!
శక్రుడు గూడను దన తేజస్సును దేరి జూడగా లేడు సుమా! 3

భర్తృ హీనయగు బడతి జగతిలో బహు కాలము జీవింపదనీ!
ఈ ధర్మంబును విప్పి జెప్పితిని నింపుగ యుపదేశంబుగనూ!
మహాప్రాజ్ఞ! విను మఱియొక మాటను మానుగ పితృ గృహంబుననూ!
వనవాసము బోవుదువని విప్రులు మానుగ తెలుపగ వినియుంటిన్! 4

లాక్షిణికులు జెప్పిన మాటలు నా లలిత హృదయమున నాటుకొనెన్!
నిత్యము వనవాసము నిమిత్తమై యుత్సాహంబును బడుచుంటిన్!
వనవాసంబునకై యాదేశము వానిగ పొందగ వలయు గదా!
నీతోడనె నే నడవుల కొచ్చెద నీ యాజ్ఞను గోరుచు నుంటిన్! 5

విప్రుని వచనము నిలబెట్టుటకై వేగ వచ్చెదను నీ తోడన్!
ఆతని మాట సత్యంబగుటకునై యాసమయం బిపు డొచ్చినదీ!

నే నెఱుగుదు వనవాసము నందున నిఖిల దుఃఖములు గలవంచున్!
అకృతాత్ములకు మాత్రము వచ్చును నా కష్టంబులు వని యందున్! 6

పితృ గృహంబున కన్యగ నుండగ భిక్షుక స్త్రీ పలుకగ వింటిన్!
వనమునందు నే వసింతు ననుచును వాసిగ తల్లికి దెలుపంగన్!
సేవ జేసితిని బహుకాలము నీ స్నేహ-కృపను నే బొందితినీ!
కలిసి వనములో జీవింపగ నా కమ్మని కోరిక మన్నింపూ! 7

నాటి నుండియును వనవాసమునకు నేటి దనుక యుత్సాహమునన్!
వేచియుంటి రామా! గొనిపోమ్మా! విపుల పురుష! నను వనములకున్!
శూరుల చర్యలు, నాదర్శములును సూనృత వ్రత! నా కిష్టంబుల్!
భర్తవైన నిను ప్రేమ పూర్వకము భరింపు మనుచున్న ప్రార్థింతున్!
భర్త దైవమని భావించుచు నే బరగ వచ్చెదను నీతోడన్! 8

మరణానంతర మందున గూడను మానుగ నీతో కలిసుందున్!
తల్లి దండ్రులే స్త్రీని పురుషునికి జలపూర్వంబుగ యిచ్చెదరో!
మరణానంతర మందున గూడను మానిని యాతనితో నుండున్
బ్రాహ్మణోత్తములు బుణ్యావాక్యములు బన్నుగ తెలుపుచునుందురుగా! 9

నీ దానను! నే నుత్తమురాలను! నీ సహజీవిని పతివ్రతనూ!
నీతో నను గొని బోవకుండుటకు నిజము దెలుపు! మది దాపకనూ!
నీ సుఖమే నా సుఖమని దలతును నీ దుఃఖమె నా దుఃఖమనీ!
భక్తురాల! నా ప్రార్థన మది విని బన్నుగ నీతో గొనిపోమ్మా! 10

దుఃఖించెడి నను దూరముజేసిన దూలిపడెద విషమును ద్రావీ!
జలమున గానీ! యగ్నిని గానీ! విలయము జేయుదు నీ తనువున్!
ఈ విధమున దను వని గొమ్మంచును యేక విధిని ప్రార్థించిననూ!
ఎన్నో బాధలు వని గలవంచును సున్నితముగ వివరించుచునూ!
వెనుకాడెను శ్రీరామ చంద్రుడును విపుల కష్టముల మది దలచీ! 11

జన శూన్యంబగు ఘోరాటవులకు జనక సుతను దా గొనిపోవన్!
బహు కష్టంబులు వచ్చుననుచునూ బాధ జెంది తన మనసుననూ!
జనక సుతను నోదార్చెగాని మఱి జనక నందినియు వినదు గదా!
కుండపోతగా నశ్రుధారలను కుమిలి కుమిలి నేలను దడిపెన్!

(అయోధ్యాకాండములో 29వ సర్గము సమాప్తము)

## ముప్పదియవ సర్గము

[సీత వనమునకు వచ్చుటకు దుఃఖింపగా శ్రీరాముడు చివరకు అంగీకరించుట- గృహములోని వస్తువుల నన్నింటిని బ్రాహ్మణాదులకు దానము జేయుమని శ్రీరాముడు సీతాదేవిని యాదేశించుట]

వనములకును రావలదటంచునూ వాసిగ రాముడు జనకసుతన్!
ఓదార్చిననూ శోకము తోడను నొప్పగ రామునితో బలికెన్!
విశాల వక్షుడు శ్రీరామునితో విమలవదన యా సీతయునూ
ప్రణ-యాభిమాన భావముచే రాముని బలువిధముల నాక్షేపించెన్! 1

పురుష విగ్రహము గలిగిన వనితవు! బొందుగ మిథిలా యధిపతియున్!
అల్లునిగా నెటులను నిను బొందెనో విల్లును విఱచితివని యేమో!
బలహీనుడవని లోక మన్నచో బహు బలాఢ్యుడవు లోకమునన్!
రవిబింబములో కాంతి లేదనుట కాంతి నీయందు లేదనుటన్! 2

హీన పరాక్రముడవు గాదు సుమా! మానవంతుడవు నిక్కముగా!
ననుగొని పోవమి కారణ మేదో నయముగ యుండును శ్రీరామా!
ఎవరులేని నను నీగతి విడిచీ నిరువుగ వనికిని బోవుచునూ!
ఎందుల కీ గతి దిగులుబాటు మఱి యెందుల కీ భయ కారణమూ? 3

సత్యవంతు నీ యనుసరించుచును సావిత్రియు దా నుండునటుల్!
నీవశవర్తిని యని మది తెలియుము! నీతో నుండెద నెల్లపుడున్!
కులపాంశిని యగు వనితను గానూ కూడి చరింతును నీతోడన్!
అన్యపురుషు నే మనసున జూడను ధన్యను జేయగ కొనిపొమ్మా 4

కౌమారిని భార్యను బతివ్రతను గల కాలము నీతో నుంటిన్!
శైలూషగ పరులకు నన్నివ్వగ స్వయముగ కోరెద విది తగునా?
ఎవరికొఱకు న న్నడ్డగించుచును నెవరి హితము మది గోరితినో!
వారి వారలకు విధేయుండవై వర్తిలుచుండుము వశ్యుడవై!
కాని నన్ను వారల విధేయగా గడుపు మనుట యది సరికాదూ! 5

అన్నియు దెలిసిన నీవు నన్నిటుల యడవులకును గొనిపోవకనూ!
బోవుటయుక్తము కాదు, కాదు నూ! బొలుపుగ యాలోచింపు మదిన్!
తపమైనను మఱి యరణ్యమైనను స్వర్గమైననూ నీతోడన్!
నీ సాన్నిధ్యము లేక పోవుచో నిఖిలము శూన్యము శ్రీరామా! 6

నీ వెనుకను నే వచ్చు చుందునూ నీకు నెట్టి శ్రమ గలుగకయున్!
విహార శయనాదుల యందుననూ నింపుగ శ్రమ లేకయు నుందున్!
నీతో కలిసి ప్రయాణ మగునపుడు నిర్ఝర దర్భలు కాశములున్!
దూదిపింజలుగ మృగ చర్మంబుగ మృదువుగ నుండును నడచుటకున్! 7

పెనుగాలికి రేగిన దూళిని నే బ్రీతిచందనముగా దలతున్!
వనమునందు నివసించుచు మఱి నే వనమధ్యంబున బచ్చికలన్
శయనించెడి యా సుఖము గలుగురా నయముగ చిత్ర సుకంబళులన్!
పత్రమైన ఫలమూలము లైనను బహుప్రీతిని నీ విచ్చెడివే
అమృతముగ భావింతును వానిని యధికమైన లేశం బైనన్! 8

ఆ యా ఋతువుల ఫల పుష్పంబులు ననుభవించుచును మది యందున్!
తల్లి దండ్రి గృహముల స్మరింపనూ తలచి విచారింపను మదిలో!
విప్రియ మేమియు గలుగబోదు సుమ! వినయవంత! నీ కేమియునూ!
పోషింపగ నే భారముగానూ! పూర్ణ! నీకు శోకముగానూ! 9

నీదు సాహచర్యము స్వర్గము సుమ! నీ వియోగమే నరకంబున్!
ఈవిధముగ మది దెలిసి నను గూడి నిరతానందము బొందు మికన్!
నను గొనిపోవనిచో వనమునకును వసుధాధిప! విను నిశ్చయమున్!
చూచుచుండగనె విషము ద్రావెదను సూనృతవ్రత! నే నిపుడిపుడే! 10

నన్ను వీడి నీ వడవుల కేగిన నాథ! యటుపైని దుఃఖముతో!
ప్రాణంబుల నే విడుతును; యందున ప్రాణము లిపుడే వదులుదు నే!
ఈ శోకంబును ముహూర్త మైనను నిల నే నైపను బ్రదుకుచునూ!
పదునాల్గేడులు నెటుల సహింతును బరగ నిదియు దెలుపగ వలెనా? 11

ఈ విధముగ జాలిని గలిగించుచు నీవిధముగ బహు శోకముతో!
కౌగలించుకొని పతిని జానకియు బహు ఓగ్గరగా రోదించెన్!

బాణాదులచే గొట్టబడిన యా బలిమి యాడ యేనుగు వోలెన్!
ఆపి యుంచినా హృదయ శోక మవు దరుదెంచెను నగ్నికి వోలెన్! 12

జనకజ నేత్రములను వెడలిన యా సరస స్వచ్ఛమగు గన్నీరున్!
పంకజముల నుదకము వెడలిన యటు నింపుగ స్రవియించెను నపుడున్!
ఆయతలోచన యమల చంద్రనిభ యా జానకి ముఖ కమలంబున్!
నీటినుండి బెరికిన పద్మము వలె నీరవమై వాడిన దాయెన్! 13

అపుడు రాఘవుడు దుఃఖితు రాలై యమిత శోకమున మూర్ఛితయై
యున్న జానకిని గౌగలించుకొని యోదార్చుచు దా నిట్లనియెన్!
దేవీ! దుఃఖింపకు! దుఃఖింపకు! దివినైనను నే ద్యజియింతున్!
బ్రహ్మదేవునికి వలె నే నెవరికి భయపడువాడను గాదు సమా! 14

శుభాననే! నిను సంరక్షింపను శూరుడ నైనను నీ మనసున్!
దెలిసికొనక నిను వని గొనిపోవుట తీరుగాదనియు దలచితినీ!
సీతా! విను! నాతోడను గలసి స్థిరవనవాసము జేయగనూ!
బ్రహ్మ సృజించెను ననుకొందును నే భవ్య సాంప్రదాయము గలుగన్! 15

ఆత్మవంతు డే విధమున కీర్తిని యలరి విడువడో యటువలెనే!
నిన్ను విడువ జాలను వైదేహీ! నిశ్చయ మది! దుఃఖము వలదూ!
పితృవాక్య పరిపాలన ధర్మము ప్రీతిగ జేసిరి సత్పురుషుల్!
వారి ధర్మమును ననుసరింతు నే వారి బాట నే బయనింతున్! 16

ధర్మముచే పరిపుష్టమైన మా తండ్రి వచనములు నదవులకున్!
ననుగొనిపోవుచు నున్నది సీతా! నేను జనెద కాలుచ వులకున్!
తల్లి దండ్రులకు వశమై యుండుట తగిన ధర్మమని దలచెదనూ!
ఆ ధర్మము నే నతిక్రమించుచు నలరి బ్రతుకగను గోరను నే! 17

స్వాధీనులు నగు దల్లిదండ్రులును దగు గురువులనూ బోనాడి!
అస్వాధీనంబగు దైవము నెటు నారాధింపగ వలయు నిలన్?
తల్లి దండ్రి గురువును మువ్వురునూ దగ త్రిలోకములు యోచింపన్!
సమానులెవరును లేరు ధాత్రిలో సదమల మతి బూజింపవలెన్! 18

సత్య దానములు యజ్ఞ దక్షిణలు సమ్మతి బలకరములు గావూ!
తండ్రి సేవతో సమానమైనది ధాత్రిని మఱి యొకటియు లేదూ!
పితృనాజ్ఞ బాలించుట చేతను ప్రీతి గలుగు సర్వంబు నిలన్!
ధనధాన్యంబులు విద్యాపుత్రులు దగ స్వర్గము సుఖములు గలుగున్. 19

తలిదండ్రుల సేవలు జేసినచో దగ లభించు బహు పుణ్యంబుల్!
దేవ గంధర్వ గోలోకములును దీప్తి నొందుదురు మహనీయుల్!
సత్య ధర్మ పథముల వర్తించెడి సాధు మూర్తి నా తండ్రియునూ!
ఎటులాజ్ఞాపించిన నడిచెద నటు నిది సనాతనంబగు మతమూ! 20

సీతా! నిను వని గొనిపోవుటకును స్థిర యుత్సాహము లేకుండెన్!
కాని యడవులకు గదిలి వత్తునని కఠినముగా బలికిన పలుకుల్!
కృతనిశ్చయవై యుంటి వనుచు నే మఱి నిశ్చయమున కొచ్చితినీ!
అనుమతించితిని! రమ్ము! వనమునకు నమల పతివ్రత పథములలో!

నాకును నీకును మన కులమునకు నయముగ నుత్తమ నిర్ణయమున్!
గైకొంటివి! సీతా! యిది మంచిది! కాంత! యనుసరింపుము నాతోన్!
వనవాసమునకు దగిన కార్యములు వల నొప్పగ చేయగ వలయున్!
నీవులేని స్వర్గములో నైనను నివసింపగ నే వాంఛింపన్! 22

కోరివచ్చినా వేద విప్రులకు కూరిమి రత్నములను నిమ్మా!
భిక్షకులకు భోజనములు బెట్టుము బిర బిర త్వర త్వరగా వలయున్!
భూషణములు మఱి పట్టువస్త్రములు భూరి సాధనములను వేగన్!
నీ పోషణలో నుండు వారికిని నిర్మలులగు విప్రులకిమ్మా! 23

తానుగూడ కాననలకు వచ్చుట తన భర్తకు సమ్మతి యనుచున్!
సంతసించుచు దానములను వే కాంత జేయ ప్రారంభించెన్!
మనస్వినియునగు సీతా దేవియు మరి మాటాడక వే వెంటన్!
నిండు మనసుతో ప్రారంభించెను దండి దానములు సర్వంబున్! 24

(అయోధ్య కాండములోని ముప్పదియవ సర్గము సమాప్తము)

★ ★ ★

## ముప్పది యొకటవ సర్గము

(రామ లక్ష్మణుల సంవాదము - లక్ష్మణుడు దివ్యాయుధములను ధరించి, వనమునకు బయలుదేరుట - ధనమంతయు బ్రాహ్మణులకు ధానము జేయుమని రాముడు లక్ష్మణుని యాదేశించుట)

సీతారాముల సంవాదం బట చిత్రముగా జరుగుచు నుండదన్!
అంతకు పూర్వం బచటనుండినా యా లక్ష్మణుడును దుఃఖితుడై!
కంటినీటితో గలత హృదయుడై చంటిపాప వలె నేడ్చుచునూ!
అన్న పాదముల నలరి బట్టుకొని యతి దీనముగా నిటు లనియెన్! 1

మృగ గజాయుతంబైన యడవులకు దగ తరలగ నిశ్చితమైనన్!
ధనుర్ధరుడనై ముందు నడచెదను వనముల నీతో నే వత్తున్!
మృగపక్షుల సంఘముల యలపులను మిగుల ధ్వనించెడి యడవులలో
నాతో కలిసీ సంచరించెదవు నయముగ నే రక్షగనుండన్! 2

నీవు లేనిదే స్వర్గమునైనను నే గోరను విజయము నైనన్!
అమరత్వంబును నే గోరను సూ! యాధిపత్యమును త్రిలోకముల్!
వనవాసమునకు నిశ్చయించినా వినయ శీలునకు లక్ష్మణుకున్!
రావలదంచును ననేక విధముల రమ్యరీతి నోదార్చినసూ!
లక్ష్మణు డంతట వినయవాక్యముల లలిత రీతి యిటులని పలికెన్! 3

ఇంతకు బూర్వము నాజ్ఞ యిచ్చితివి యింత మదిని జింతింపకనూ!
ఇపుడీ విధముగ రావలదంచును నీసడింప గారణ మేమీ?
నీతో నడవికి రావలెనంచును నే నుండగ రావలదంచున్!
అడ్డు పెట్టుటకు కారణ మేమీ? విడ్డూరంబగు చున్నదిగా! 4

ఎదుట నిలిచి యాలక్ష్మణు డంతట మదిని భక్తి వినయాంజలితో!
ముందుగ తానే వనముల కేగెడి చందము గని రాముం డనియెన్!
స్నేహశీలుడవు! ధర్మనిరతుడవు! శ్రీకరముగ సన్మార్గుడవూ!

నా యాజ్ఞను బాలించు వాడవును నా ప్రాణమునకు బ్రాణమవూ!
సోదరుడవు మాత్రము కాదు సుమా! మది వెలిసిన మిత్రుండవునూ! 5

సౌమిత్రీ! నాతో వచ్చినచో సమ్మతి శుశ్రూషల తోడన్!
మనతల్లుల నెవ్వరు బోషింతురు మహా శోకముల నాపుదురూ?
మహారాజు దశరథుడు భూమిపై మానుగ బర్జన్యుని వోలెన్
మన కోర్కెల వర్షించెడి నాతడు మమత జిక్కె కాముని వలకున్!

ఎందుచేతనన రాజ్యము నందిన చందముచే కైకేయినూ!
దుఃఖితలగు దన సవతుల నందఱ దూరముంచు సౌఖ్యంబులకున్!
రాజ్యము నందిన భరతుడు గూడను రమణికైక వచనములు వినున్!
దుఃఖితులగు కౌసల్య సుమిత్రల దుఃఖము నాపడు; స్మరింపడున్! 7

లక్ష్మణ! యిచటనె యుండి నీవు మఱి లాలిత రాజానుగ్రహముడున్!
అంది తల్లులను బోషింపు మిటన్ కందకుండ మన తల్లులనూ!
ధర్మజ్ఞుడు లక్ష్మణ! యిటు జేసిన దగ సంతోషము నందుదునూ!
పెద్దల శుశ్రూషయు జేయుదువూ! పేర్మి ధర్మమును సిద్ధించున్! 8

రఘునందన! నే జెప్పినట్లుగా రహిజేయుము నా కొఱకైనన్!
మన వియోగమున మన తల్లులకును మహా శోకమును గలుగు సుమా!
వాక్యకోవిదుడు రాము డీ విధము వాక్యజ్ఞుడు లక్ష్మణు దోడన్!
బలుక సుమిత్రా తనయుడు బలికెను పాలు తేనియల రుచుల వలెన్! 9

రామా! భరతుడు నీ శౌర్యమునకు రయమున బీతిని తల్లులనూ!
వినయవంతుడై భరింప గలడూ! యనయము సందేహము లేదూ!
వేయిగ్రామములు కౌసల్యాసతి విమలైశ్వర్యముననుగలవూ!
వేయిమంది లక్ష్మణులసైననూ విమలత బోషించును వినుమా! 10

కీర్తిమంతు రాలగు పెద తల్లియు నార్తి లేక రక్షించుకొనున్!
నాతల్లిని నావంటి వారినీ నయముగ పోషించును మిగులన్!
నను నీ యనుచరుగా గైకొనుమా! న్యాయ విరుద్ధము లేదిందున్!
నే కృతార్థుడను నగుదును మఱియును నీ కార్యము సిద్ధిని బొందున్! 11

ధనుర్బాణములు మఱి సనపంబును దగ పిటకంబును గైకొనుచున్!
నీకు మార్గమును జూపుచు నడిచెద నీ ముందే నే బయనింతున్!
నీకు నిత్యమును ఫలములు దుంపలు నిర్మలమగు శుభ జలములనూ.
మునిసేవితములు నగు వస్తువులను ముదమున దెత్తును నెల్లపుడున్! 12

గిరి సానువులను సీతను గూడుక సరి విహరించెడి సమయమునన్
మేల్కొనియున్నను, నిదురించిననూ, మేలిమి సకలంబును జేతున్!
ఆ మాటలు విని రాము డంతటను నలరి సంతసంబున బలికెన్!
లక్ష్మణ! బొమ్మిక మిత్రుల గాంచీ లాలిత దీవెన గొని రమ్మా! 13

జనకుడు జేసిన మహాయజ్ఞమున ననయము వరుణం డిచ్చినదీ!
దివ్య ధనుస్సులు దివ్యకవచములు దివ్య బాణ తూణీరములున్!
దివ్యఖడ్గములు కులగురు వింటను దివ్యపూజ లందుచు నుండెన్!
వాని నన్నిటిని గొని తెమ్మిప్పుడు మనవెంటను గొనిపోవుదమూ! 14

లక్ష్మణుడంతట మిత్రులందఱికిని లాలిత నీడ్కోలును దెలిపి!
వసిష్ఠునింటను నాయుధంబులను వరుస దెచ్చె రాముని కడకున్!
పూలమాలికల యలంకృతము లగు బూజల నందిన యాయుధముల్!
రామునకిచ్చెను లక్ష్మణుండు దా రమ్యాయుధముల నన్నిటినీ! 15

వచ్చిన లక్ష్మణు గాంచి రాముడును మచ్చిక ప్రేమలు బొంగంగన్!
నేను గోరినా సమయంబునకును నీవు వచ్చితివి మెచ్చితినీ!
నా ధన మంతయు వేద విదులకును నయముగ నివ్వగ గోరెదనూ
ఆశ్రయించినా వారికి నివ్వగ యలరి కోరెదను నే నిపుడే! 16

ద్విజులందున శ్రేష్ఠుడు నుత్తముడును దివ్య వసిష్ఠుని పుత్రుండున్!
పూజ్యుడైన యా సుయజ్ఞు నిప్పుడు బొలువుగ యిచటికి గొనిరమ్మా
సదాచారులగు బ్రాహ్మణు లందఱు యథావిధిని నే బూజించీ!
అరణ్యమునకును బోవుద మిపుడే యాలస్యంబును లేకుండన్! 17

(అయోధ్యకాండమున-31వ సర్గము సమాప్తము)

* * *

## ముప్పది రెండవ సర్గము

[శ్రీరాముడు సీతా సమేతుడై వసిష్ఠుని పుత్రుడు సుయజ్ఞుని బిలి పించి సర్వసంపదలు దానము జేయుట-లక్ష్మణునితో గూడికొని దానములు జేయుట-త్రిజటుని వృత్తాంతము]

శుభకర ప్రియకర శాసనమును గొని శోభాకరుదగు లక్ష్మణుడున్!
సుయజ్ఞు నింటికి బోయి తెలిపెనూ సుందర ప్రియ మృదు వాక్యములన్!
అగ్ని గృహములో నున్న సుయజ్ఞుని నాదరమున యంజలి తోడన్!
రాముని యింటికి నాహ్వానించెను రమ్య విషయమును దెలుపుచునూ! 1

సంధ్యోపాసన బూర్తి జేసికొని సరగున లక్ష్మణుతో గూడన్!
లక్ష్మి నిలయంబైన రామునీ లలిత గృహమునకు నేతెంచెన్!
సీతా సహితుండై రాఘవుడును జేరి సుయజ్ఞుని యంజలితో!
అర్చితాగ్నికిని బోలె బ్రదక్షిణ యలరి జేసె బహు వినయమునన్! 2

అంత రాముడును స్వర్ణయుక్తమగు నంగదములు మఱి కుండలముల్
మణులు గూర్చినా హేమ సూత్రములు మఱి సువర్ణయుత వలయంబుల్!
కేయూరములును బహు రత్నములును కీర్తిమంతుడగు రాముండున్!
సుయజ్ఞు కిచ్చెను భక్తిని మ్రొక్కుచు నూరిజనంబులు గీర్తింపన్!

సీత ప్రేరణను రాముకు పలికెను జేరి సుయజ్ఞుని వినయమునన్!
సౌమ్యసఖా! నీ భార్య కొఱకునై రమ్య హారమును సూత్రములున్!
వడ్డాణంబును నీకు నివ్వగా వాసిగ జానకి వాంఛితమున్!
వీనిని గూడను గొనిపొమ్మిప్పుడు గొని మము ధన్యుల జేయుమికన్! 4

వనము బోవు జానకి నీభార్యకు వన్నెల యంగదములును మఱిన్!
చిత్రములగు గేయూరంబులనూ మిత్ర! గొనుము! నీ భార్యకునూ!
శ్రేష్ఠమైన యాస్తరణము గలిగిన చిత్రరత్న పర్యంకమునూ!
నీకు నివ్వగా గోరుచున్నదీ నిర్మలమతి వే గొనిపొమ్మా!

ద్విజపుంగవ! శత్రుంజయ మనునది ద్విపము మాతులుఁడు నిచ్చినదీ!
ఇచ్చు చుంటినీ! వేయిగజములను నింపుగ గైకొను శుభవేళన్!
రాముడు దెలిపిన రీతి సుయజ్ఞుడు రమ్య బహూకృతు లందుకొనీ
రామలక్ష్మణులకును జానకికిని రంజిల దీవెనలను నొసగెన్! 6

బ్రహ్మదేవుడల త్రిదశేశ్వరునకు బలుకు బలికినటు రాఘవుడున్!
సోదరుడగు లక్ష్మణుతో బలికెను నాదరమున యవ్యగ్రమునన్
సౌమిత్రే! ఆగస్త్య, కౌశికుని సరగున వారిని బిలిపించీ
సస్యముపై వర్షించిన విధమున సౌమ్య రత్నముల బూజింపూ! 7

మహాబాహూ గో సహస్రములతో మహామూల్య మగు ధనములతో!
స్వర్ణ రజితముల చే వారలకును సరసరీతి బూజింపు మికన్!
తైత్తరీయులా యాచార్యుండును దగ కౌసల్యకు దీవెనలన్!
ఇచ్చునట్టి పండితునకు నిమ్మా! నింపుగ కోరిన వస్తువులన్! 8

తండ్రిగారి సచివుండును సారథి తగ చిత్రరథుడు వానికినీ!
ధన ధాన్యంబుల నిచ్చి బనుపుమూ! వినయంబున సంతసమందన్!
శత కలాప శాఖలకు జెందినా సరసవేద పారాయణులున్!
బ్రహ్మచారులగు వారికి నిమ్మా! బహుగోధన సంభారములున్! 9

వేదాధ్యయనము జేయునట్టి యా విమల బ్రహ్మచారులు గలరూ!
వారందఱికిని గోవుల నిమ్మా! వారు గోరినవి యన్నియునూ!
నే నెచ్చెడి యాదక్షిణ లన్నియు నిరవున నాతల్లియు జూచీ!
ఆనందించెడి విధమున నిమ్మా! నలరి విప్రులను బూజింపూ! 10

పురుష శ్రేష్ఠుడగు లక్ష్మణు డంతట బొలుపుగ రాముడు తెలుపువిధిన్!
ధనమునంతయును గుబేరునకు వలె దగ బంచెను మఱి యందఱికిన్!
పిమ్మట రాముడు బరిచారకులను సమ్మతి బిలిచెను వేదనతో!
జీవికకై బహు దనముల నిచ్చెను జిరస్నేహము బొంగారంగన్! 11

లక్ష్మణు గృహమును నాగృహంబునూ లాలితముగ గనుచుండవలెన్!
శూన్యము గాకుండగ గాంచుడు మఱి సుందరములుగా నుండునటుల్!

దుఃఖితులగు బ్రదిచారకు లందఱ దుఃఖమునాపుచు ధైర్యముతో!
తన ధన మంతయు వే గొనిరమ్మని ధనదాధ్యక్షునకును దెలిపెన్! 12

అటు పిమ్మట నా ఉపజీవనులును నా రాముని ధన మంతయునూ!
తెచ్చి ముందుగా గుప్పగ బోసిరి ధీరుగ నా ధనమంతయునూ!
రామలక్ష్మణులు దానము జేసిరి రహి బాలురకును, వృద్ధులకున్!
వేదవిదులకును నర్పణ జేసిరి పేదలకును మఱి దీనులకున్! 13

త్రిజటుండను నొక పేదబ్రాహ్మణుడు తేజోవంతుడు నడవులలో!
గొడ్డలి నాగలి గునపంబులతో గుదురుగ నేలను ద్రవ్వుచునూ!
కందమూలముల సంపాదించుచు చందముగా సంతానంబున్!
పోషించుచు జీవించు నతండును బొలుపుగ నాకాలమునందున్! 14

యువతి యైన యాతని భార్యయునూ! యువనతయై దారిద్ర్యమునా!
పసిపాపల జూపుచు వృద్ధునితో బన్నుగ మధురముగా బలికెన్!
గొడ్డలి నాగలి బారవేయునూ! కూరిమి నావచనము వినుమా!
రాముని దర్శింపుము వేగముగా రహి లభింపగలదేమైనా! 15

భార్య మాట విని త్రిజటుం డంతట బన్నుగ గొడ్డలి నట విడిచీ!
ప్రాత యుత్తరీయమును గప్పుకొని బయలు దేరె రాముని కడకున్!
భృగుమహర్షివలె యంగీరసు వలె వెల్గుచుండె దేజస్సులతో
ఐదవ వాకిలి వఱకును నెవ్వరు యడ్డు పెట్టలే దెవరైనా! 16

త్రిజటుం డంతట రాముని తోడను రాజపుత్ర! బహుదీనుడనూ!
బహు పుత్రులు గల వాడను! బీదను! బ్రాహ్మణుండ గర్గ్యుండను సూ!
కంద మూలముల ద్రవ్వుకొనుచు నే కాలము గడుపుచు నున్నాడన్!
నను నొక కంటను గాంచి బ్రోవుమూ! నయముగ వచ్చితి నీకొఱకున్! 17

అదివిని రాముడు బరహాసముతో నా గర్గ్యునితో నిటు లనియెన్!
ఒక గోసహస్రమును గూడ నే నొప్పుగ చేయను దానమునూ!
దండమెంత దూరము విసరెదవో మెండుగ గోవుల నిచ్చెదనూ!
అని రాముడు బరిహాస మాడగా నా గార్గ్యుండును మోదముతో! 18

అంత త్రిజటుడును నానందముతో జింత దీర పై వస్త్రమునూ
కటి ప్రదేశమున జుట్టి నేలపై కఠినముగా దండము గొట్టీ
తన బలమంతయు నుపయోగించుచు దండము విసిరెను వేగముగా!
ఆ దండము సరయూనది దాటి నటబడె గోవుల మందలనూ! 19

ధర్మాత్ముడు శ్రీరాముడు గార్గ్యుని దగ యంజలితో గోవులనూ!
సరయూనది తీరము వఱకునూ సరినిండగ యాతని కిచ్చెన్!
రాము డాతనిని గారవించుచును రహి మధురము నీ విధి బలికెన్!
పరిహాసము గొఱకై యట్లంటిని బాధ బడకు! గోపము చేతన్! 20

దురత్యయము సుమ! నీ తేజస్సును దుర్భర మెవ్వరు గమియింపన్!
కనుగొనవలెనని జేసితి నీపని కామితార్థమును నెఱవేరెన్!
కోరుకొనుము మఱి యింకేమైనను కోరికలను మదిగోరునదీ!
తీర్చెద నిప్పుడు సఫల మొందగా దీరుగ కోరిన వన్నియునూ! 21

నిజము దెలుపుచుంటిని విప్రవరా! నిజముగ కోరుము! నేదైనన్!
ఇంతగోంగా నియమము లేదూ! యెంతయినను నీ యభిమతమూ!
నా ధనమంతయు విప్రుల కొఱకే నయముగ నివ్వగ బూనితినీ!
ప్రీతి యశస్సులు నాకు గలుగు మఱి పేరిమి శాంతియు సౌఖ్యములున్! 22

ఆ మాటలు విని గర్గ్యు డంతటను నమితానందమునను దేలి
భార్యాసహితుండై ధేనువులను బ్రతిగ్రహించుచు రామునకున్!
కీర్తి బలంబులు, ప్రీతి సుఖంబులు ప్రేమ మీర దీవెన లొసగీ!
ఆశ్రమంబునకు జనెను త్రిజటుడును నలరి భార్యతో గూడికొనీ! 23

అంత రాముడును సంతసంబునను నలరుచు బ్రేరణ వాక్యములన్!
ధర్మ సమ్మతముగా తన బలమున తా సంపాదించిన ధనమున్!
విప్రులకును మఱి భృత్యుల కొసగెను మిత్రులకును మఱి దీనులకున్!
అందఱికిని గారవమున నిచ్చెను నందఱు బొందిరి సంతృప్తిన్! 24

అయోధ్యాకాండమున 32వ సర్గము సమాప్తం

* * *

## ముప్పదిమూడవ సర్గము

[సీతాలక్ష్మణులతో గూడికొని శ్రీరాముడు పలు విధములగు ప్రజల
సంభాషణలు వినుట—తండ్రిని జూచుటకై
కైకేయీ భవనమునకు పోవుట]

ఈ విధముగ యా రామలక్ష్మణులు నింపుగ సీతా దేవియునూ!
బహుధనముల బ్రాహ్మణులకు నిచ్చి భద్ర దీవెనల నందుకొనీ!
వనవాసమునకు బోవుట కొఱకై! వినయముగా నన్నియు జేసీ
దశరథరాజును జూచుట కేగిరి దగ నాశీస్సుల బొందగనూ! 1

రామలక్ష్మణుల యాయుధంబులకు రమ్య పుష్ప మాలికలుంచెన్!
పూజలు జేసెను బసుపు గుంకుమల పూజాక్షతలను జానకియున్!
ఆ యాయుధములు జూచెడి వారికి యంతులేని యావేదనయున్!
భయమును గలిగించుచు భీతిల్లిగ బాధయు గలిగించుచునుండెన్! 2

రాజమార్గమున సీతారాములు రమణీయముగా నడువగనూ
ప్రాసాదంబుల విమానములనూ బన్నుగ గాంచిరి ప్రజలంతా!
అసంఖ్యాకులగు జనులను నిండిన యామార్గమునను గనలేకన్
మిద్దెల మేడల నెక్కి జూచిరీ తద్దేవతలను సంప్రీతిన్! 3

ఛత్రము విడిచీ పాదచారియై జనుచుండిన రాఘవు గాంచీ!
జనులందఱు శోకముచే గూడుక వినయముతో నిట్లనుకొనిరీ!
రథాశ్వగజములు బదాతి దళములు రాముని గూడుక యుండెడివీ!
పాదచారియై జనుచుండె నహో! పన్నుగ జానకితో గూడన్! 4

సంపదలను రుచి జూచిన వాడును సంపదలను నిచ్చెడి వాడున్!
తండ్రి పలుకులను సత్యము జేయగ తరలిపోవు చుండెను వనికిన్!
అంతఃపురమున నుండెడి జానకి వింతగ జన సంకీర్ణమునన్!
రాజమార్గమున బోవుచున్నదీ రహి జనులందఱు గనుగొనగా! 5

అంగరాగముల రక్త చందనము నలరెడి జానకి యీనాడున్!
ధూళిరేగు నీ జనవీధులలో మాలిమి దిరుగుచు నున్నదిగా!
భూతమేదొ బట్టినది రాజునకు బొలుపుగ యీ విధి బలుకుటకున్!
పుత్రుని బంపున యే రాజయినను బోయి రమ్మనుచు వనములకున్! 6

గుణములు లేని పుత్రుని సహితము గోరి పంపరే యడవులకున్!
సుగుణరాని శ్రీరాముని నరపతి చోద్యమగును వనికిని బంపన్!
క్రూరత్వము లేకుండ శీలమును కూరిమి జాలియు విద్యయునూ!
శమదమాదులను నాలు గుణంబులు సదయుని యందవి గలవు సుమా! 7

గ్రీష్మంబున జలజంతువు లడలిన భీష్మముగా శ్రీరామునకున్!
అపకారంబును సహింప నేరక యడలుచు నున్నారీ ప్రజలున్!
పుష్ప ఫలంబుల నున్న వృక్షమును బూనిన మొదలును నటికినచో
వృక్ష మంతకును నష్టము గలిగిన విధి జనమునకును గలిగినదీ! 8

రాముడు మూలము ధర్మ సారమును రాముడు ప్రజలకు వేదంబున్!
ప్రజలందఱు బత్రములు బుష్పములు బన్నుగ రాముడు వృక్షంబౌ!
అట్టి రాఘవుడు నాత్మ బంధువులు నిట్టె బోవుచును నున్నారో!
ట్టి చోటి కందఱము బోవుదము యెట్టి యోచనలు లేకుండన్! 9

్యానములును, పొలములు, గృహములు నురు వ్యాపారములను విడిచీ!
్మాత్ముడు రామునితో బోదము ధర్మ మార్గమున నడువంగన్!
 సుఖములను బంచుకొందమూ కానలందునను నివసించీ!
ాముడు లేని యయోధ్యయందున రహి నివసింపగ లేముగదా! 10

న సుందరమును వనికి బోవగా మధురమైన యీ యయోధ్యయున్!
ాడువడును; జెడు నందములన్నియు బన్నుగ నిధులన్నియు బోవున్!
ధనధాన్యంబులు నితర సంపదలు ధర్మములన్నియు నశియించున్!
గృహములపై ధూళియు జెలరేగును గృహదేవతలును బోయెదరూ! 11

పవడిన యా గృహములందునను బరగ యెలుకలును నడుతలునూ!
ుగుచునుండును నెచట జూచినను దీవెలు' బొదలును, కంటకముల్!

ఉదకముగానీ, ధూమముగానీ యురుగుణవంతులు గనరారూ!
బలికర్మలు, యజ్ఞములు, హోమములు బన్నుగ జరుగవు నెచ్చోటన్! 12
బ్రద్దలైన కుండల పెంకులు నిక మొద్దులు బ్రానులు మఱి మొలుచున్!
రక్కసి పొదలును ముండ్లకంపలును రహి పిల్లులు కుక్కల తోడన్!
గ్రుడ్లగూబలును నఱచుచు నుండును గృహములన్ని జనములు లేకన్!
అట్టి గృహములను కైక యేలు నిక యిట్టె భరతుడును రాజగుచున్! 13

రాముడు వనమును బోవుచుండగా రమ్య నగరమగు నావనమున్!
మనము వదిలినా యీ నగరంబే మానుగ వనమగు గాత యికన్
మనలజూచి వన మృగము లన్నియును మానుగ బరువెత్తును గాతన్!
గజ సింహంబులు విష సర్పంబులు గదలుగాత! భయమును జెందీ!
అవి యన్నియునూ వనము విడిచి యీ యయోధ్య యేతెంచును గాతన్!14

పుత్రబాంధవులతో కైకేయియు క్రూర వన్య మృగ పశులతో!
తృణ మాంసాదుల దినెడి బంతువులు దీరుగ బాలించును నింకన్!
మన మందఱమును వనము బోవుదము మహిమాన్వితమగు దండకకున్!
రాముని తోడుత గలిసియుంద మిక రమ్య ధర్మ మార్గము దోడన్! 15

రాముడిటుల జను లాడెడి మాటల రమ్య భావనల మది వినుచున్!
వినియుగూడ నాతని మానసమున విచక్ర మింతయు గనలేదూ!
ధర్మాత్ముడు మాతంగ విక్రముడు దగ శ్రీరాముడు దూరమునన్!
తండ్రి గృహంబును సమీపించె నది దగ కైలాసము వలె నున్నా! 16

వినయము దోడుత నిలిచియుండినా వీర పురుషులను వీక్షించీ!
రాజగృహంబును బ్రవేశించి నట రహి సుమంత్రునీ వీక్షించెన్!
అచటనున్న దుఃఖితులను గాంచీ యలసట జెందక వేదనతో!
చిఱునవ్వును జిందుచు నున్నట్లుగ చిత్రముగా కానం బడుచున్!
తండ్రి యాన జెల్లింప గోరుచును దండ్రిని జూచుటకును బోయెన్! 17

ధైర్యవంతుడును మహాత్ముండునగు ధార్మికుండు శ్రీరాఘవుడున్!
దుఃఖితుండు నగు సుమంత్రుగాంచీ దురపిల్లుచు దన మదియందున్!
రాజును జూడగ వచ్చె ననుచునూ రయముగ సుమంత్రునకు దెలిపీ!
తాను వచ్చినటు దెలుపు మనుచునూ తగ సుమంత్రు తోడను బలికెన్! 18

(అయోధ్యాకాండమున-33వ సర్గము సమాప్తము)

# అయోధ్యకాండము - ప్రథమ భాగము

## ముప్పది నాల్గవ సర్గము

(సీతా లక్ష్మణ సమేతుడై శ్రీరాముడు దశరథ మహారాజు నొద్దకు బోయి వనవాసమునకు సెలవడుగుట — శోకముచేత- దశరథుడు మూర్ఛనొందుట — శ్రీరాముడు తండ్రికి నచ్చబలుకుట దశరథుడు మరల మూర్ఛనొందుట)

పద్మ పత్రముల వంటి కనులుగల పన్నగ శ్యామల గాత్రుడునూ!
మహాపూజ్యుడగు రాము డంతటను మానుగ సూత సుమంత్రునితో!
తాను వచ్చినట్లుగ తన తండ్రికి దగ తెల్పుమనగ సూతుడునూ,
శీఘ్రముగా నిట్టూర్చుచున్న యా శ్రీమంతుని రాజును గాంచెన్! 1

గ్రహణము పట్టిన సూర్యుని వలెనూ కప్పబడిన భస్మాగ్ని వలెన్!
జలములేని యా తటాకంబు వలె విలయము నందిన భూమి వలెన్!
కాంతి హీనుడై యున్న నరేంద్రుని గనుల జూచి యా సుమంత్రుడున్!
ప్రాంజలితో విజయీభవ! యనుచును బన్నుగ బలికెను గద్గదికన్! 2

నీ కుమారు డిదె రాముడు వచ్చెను నిను గనులారగ జూడగనూ!
ధనమంతయు నా వేద విదులకును దగ తన భృత్యుల కర్పించెన్!
అడవికి బోవుచు నిను జూడగనూ యలరి ద్వారమందున నిలిచెన్!
సత్యపరాక్రముడైన రామునికి సరగున దర్శనమును నిమ్మా! 3

సత్యవాది ధర్మాత్ముడు రాముడు సంద్రమువలె గంభీరుండున్!
ఆకాశమువలె మలినము లేకను నలరువాడు శ్రీరాముండున్!
జగతీపతి శ్రీరామచంద్రు డదె జనుచుండెను వన భూములకున్!
కిరణంబులతో నాదిత్యునివలె సర్వరాజ గుణముల తోడన్!
ప్రకాశించు నా రాముని గనుమా! వికాసించు గన్నుల తోడన్! 4

దుఃఖముతో గుమిలెడి యా నరపతి దురపిల్లుచు సూతుని తోడన్!
'నా భార్యల నందఱ గొనిరమ్మా నయముగ వారలతో గలిసీ!
ధర్మాత్ముని శ్రీరామచంద్రునీ తగ జూడగ గోరుచు నుంటిన్! 5

అంతఃపురమును బోయి సుమంత్రుడు నా రాణుల యందఱ వేగన్!
రాజు బిలుచు చున్నాడని తెలిపెను రమ్యరీతి నా ప్రమదలునూ!
రాజాజ్ఞను నా రమణు లందఱులు రహి నేగిరి రాజును జూడన్!
ఒక్కొక్కరుగా రాజ భవనమును జిక్కి వేదనను శోకమునన్! 6

సుందరీమణులు బతివ్రతలు నగు సురచిర శీలము గలవారున్!
మూడువందలా యాబది మందియు ముదిత కౌసల్య గూడికొనీ!
మెల్లన వచ్చిరి కనుల నీటితో నల్లన బలికెను నరేంద్రుడున్!
'ఓ సుమంత్ర!' నా సుతుని రాముని నొప్పుగ నిచటికి గొనిరమ్మా! 7

అంతట సుమంత్రు డా వచనము విని కాంత సీత శ్రీరాములనూ!
లక్ష్మణ కుమారులను గొనిపోయెను యాక్షణమున భూపతి కడకున్
అంజలితో నొచ్చెడి రామునిగని యాదశరథుడును శోకముతో!
స్త్రీ జన సంవృతుడగు నాతడు వే స్థిరాసనము నుండియు లేచెన్! 8

చేరి రాముని గౌగిలింవగా జేర వేగమున బరువెత్తెన్!
చేరకమునుపే మూర్ఛను మునిగెను భారముగా నేలను వడియెన్!
దుఃఖమూర్ఛితుండైన రాజునూ దూరముగా బడి పోవుటయున్!
కాంచి వేగమున బరువు లెత్తిరీ కరమున రాముడు లక్ష్మణుడున్! 9

అంత రాజ గృహమందు ధ్వనించెను నతివల యార్తధ్వని మిగులన్!
'హా! హా! రామా!' యనుచు బలుకుచును నార్తనాదములు వినిపించెన్!
రామలక్ష్మణులు సీతను గూడుక యా దశరథునీ యెత్తుకొనీ!
మెత్తని యాసనమున గూర్చుండగ యొత్తుచు నాతని పాదములన్! 10

అంతట రాముడు లబ్ధసంజ్ఞుడగు నా దశరథ రాజును గాంచీ!
శోకసంద్రమున నున్న రాజునకు శుభ నమస్కృతుల గావించీ!
మహారాజ! నే బోవుచుంటినీ! మహారణ్యములకును నేడున్!
సెలవు గోరుచుంటిని! నను జూడుము! నిల ప్రభుడవు గద! యందఱికిన్!

లక్ష్మణునకునూ యనుజ్ఞ నిమ్మా! లలితగుణుడు సుకుమారుండున్!
సీతగూడ నన్ననుసరించుచును జేరవచ్చు చున్నది వనికిన్!

సత్యమైన యెన్నో కారణములు సరసరీతి జెప్పినగూడన్!
అనుమతింపకను నాతో వనికిని! ననుగమించుచున్నారు సుమా! 12

మహారాజ! మా కనుజ్ఞ నిమ్మా మానుగ దుఃఖంబును విడిచీ!
ప్రజాపతియు ప్రజలను గాంచి నటుల బస్నుగ మమ్ముల గననగునూ!
అని పలుకగ రాముడు నరేంద్రుడును నారామునితో నిటు లనియెన్!
కనుల నీరు గాలువలు గట్టగా గద్గద స్వరమున రుద్ధముగా! 13

తనకిచ్చిన వరములు గారణముగా తగ వంచించెను గైకేయీ!
నిగ్రహించి నను నయోధ్యపొందుము! నేర మేమి లే దిందుననూ!
అని వలుకగ దశరథుడు రాముడును నాత్మ ఘందు సంక్షోభించెన్!
అంజలితో డుత నమస్కరించుచు నా నరేంద్రునకు నిటు లనియెన్! 14

వర్ష సహస్రములను నేలితివీ!వసుమతి నంతసు ధర్మముగా!
నా నిమిత్తమై సత్యము దప్పుట న్యాయముగాదు గదా తండ్రీ!
పదునాల్గేతులు వనము జరింతును సంపూర్తిని నే జేసికొని!
నీ పాదములకు నమస్కరింతును నిర్మలమతి యనుమతి నిమ్మా! 15

సత్యా పాశమున జిక్కిన రాజును సరగున కైక సరహస్యముగా!
రాముని వనమునకును బంపుమనీ! రాజును ప్రేరేపింపగనూ!
దుఃఖము దోడుత దురపిల్లుచునూ! దూవి వోలె బడి యేడ్చుచునూ!
ప్రియ పుత్రునితో నిట్లని పలికెను ప్రేమమీద గళ బాష్పముతో! 16

ఇహపరముల శ్రేయస్సు కొఱకునై నింపుగ వని జని వే రమ్మా!
మార్గము మంగళప్రదమగు గావుత! మఱి భయ దుఃఖంబులు లేకన్!
రామా! నీవును సత్యరూపుడవు! రమ్య ధర్మ శీలుండవునూ!
నీ బుద్ధిని మఱలింప నశక్యుడ! నీతి నిలిపితివి ధరయందున్! 17

ఈ రాత్రికి నీ విచట నుండుమా! నింటను గడుపుము సౌఖ్యముగా!
ఒకరోజైనను నిన్ను జూచుచును నిక నే నుండెద సౌఖ్యముగా!
నను, నీ తల్లిని జూచుకొనుచు మఱి నయముగ భోగములను నందీ!
ఉషోదయంబున బోదువుగానీ యుర్వి దుఃఖమును సమయింపన్! 18

దుష్కర కార్యము జేయుచుంటినీ దుఃఖ మనక కాఱదవులకున్
నాకు బ్రియంబును జేకూర్చుటకై నయముగ బోవుచు నుంటివిగా!
ఇష్టజనంబుల నందఱ వదిలీ నిష్ట సుఖంబుల త్యజియించీ !
ఎవ్వరు జేయగ జాలని పనినీ యీభువి జేయుచు నుంటివిగా! 19

వని బోవుట నాకిష్టము లేదూ! విను! సత్యము దెలుపుచు నుంటిన్ !
నివురుగప్పినా నిప్పును వలె నను నీతి మాలినా స్త్రీ జెఱచెన్!
ఉత్తమ నడనడికను జెఱచెడి యా మత్త మాతంగి ప్రేరణతో !
వంచన నుండీ నను గాపాడగ యంచిత కీర్తీ బూనితివీ! 20

జ్యేష్ఠ సుతుడనై జన్మించితివీ! జనక సుతను దెండ్లాడితివీ!
తండ్రి మాటనూ నిజము సేయగా దగబూనితివీ నిశ్చయమున్!
భీకరాటవుల జరియింపగనూ జీకటులను దొలగింపగనూ!
బూనుకొంటివీ! యబ్బుర మందను ఆదివిష్ణు నంశమవుగదా! 21

విలపించెడి యా తండ్రిని గాంచుచు విల విల రాముడు లక్ష్మణుడున్!
రోదించిరి యటుపిమ్మట రాముడు రూఢి వాక్యముల నిటు లనియెన్!
ఇచటనుండి యీనాడు భోగముల నింపుగ బొందిన మఱి రేపున్!
ఎవరిచ్చెద రిక యా భోగములను నిపుడే విడుచుట మంచిదగున్! 22

అనేక రాష్ట్రంబులు గలదియును ననేక జనములు గూడినదీ !
ధనధాన్యంబుల సమృద్ధమైనా ధాత్రిని వే వదులుచు నుంటిన్!
అట్టి ధరిత్రిని భరతుని కిమ్మా! యలరి కైకయును సంతసిలన్!
వని బోవలెనను నా నిర్ణయమది విను! నరేంద్ర! మారగబోదూ! 23

వరముల నిచ్చెడి మహారాజ! విను! వాసిగ కైకకు నే వరముల్ !
ఇచ్చిన వరముల బూర్తిగ నిమ్మా సచ్చరిత్రుడవు గమ్మికనూ!
నీకు నేను జెప్పిన విధి యాజ్ఞను నిర్మల మతినై బాటింతున్ !
పదునాల్గేడులు వన వాసులతో వనమునందు నివసింతు నికన్ ! 24

తండ్రీ! వలదిక యాలోచనలును దగ రాజ్యము భరతున కిమ్మా!
రాజ్యముగానీ! సుఖమును గానీ! రహి కాంక్షించుట లేదు సుమా!

యాజ్ఞను బాలించుట నీ యిష్టము నిఖిల సంపదలు గోరను నే
కన్నీ రొలుకకు! దుఃఖము విడువుము! గడకు ద్రోయుమా వేదననూ! 25

రాజ్యము నందును, సుఖము నందునను, రమణి మైథిలీ యందుననూ!
సకల భోగముల యందున గానీ స్వర్గ సుఖము లందునగానీ !
జీవితంబునను గోరిక లేదూ! ప్రవిమల ధర్మములందునా!
ఆచరింపగను ననుసరింపగను నలరుదు మానవ ధర్మమునూ! 26

పురుషశ్రేష్ఠ! సత్యము గాపాడగ పూనిక గోరుచు నుంటినినే !
అసత్యవంతుడవును గాకూడదు యానబెట్టుచుంటిని తండ్రీ !
మహారాజ! తండ్రీ! క్షణమైనను మన జాలము నిట సుఖముగనూ !
భీరతదోడుత శోక మాపుకొను మారదుగా వా నిశ్చయమున్! 27

వనముల కేగు మటంచు గోరినది యెప్పుగ నా పిన తల్లియుసూ!
వీగెదనని నే నొప్పుకొంటినీ! ఇది సత్యము! నే బాలింతున్ !
ఉత్కంఠుడవై చింత నొందకుము! నుల్లసిలగ వనముల యందున్!
పశుపక్షులతో నానందించుచు ననయము విహరింతుము మేమున్! 28

దేవతలకు మఱి తండ్రి దైవమని భీరత శ్రుతులను గలదు గదా!
తండ్రియె దైవంబను నిశ్చయమున తండ్రి వచనములను గావింతున్ !
పదునాల్గేడులు గడిచిన పిమ్మట పరగ మఱల నే వచ్చెదనూ!
అపుడు మఱల నను జూడ గలుగుదువు నందున మానుము! దుఃఖంబున్!29

దుఃఖించెడి యాజనుల నందఱిని దుఃఖము దొలగగ జేయకనూ!
నీవే యిటులను విక్రియ నందగ నిన్నేమవగను వచ్చు నికన్ !
రాష్ట్రము, భూమిని వదులు చుంటినీ! ధాజ్యమంత భరతుని కిమ్మా!
నీ యాజ్ఞను బాలించుచు వనమున నిండు మనస్సున వసియింతున్! 30

నేక పర్వత నదులను గూడిన యనేక పట్టణ నగరములున్!
ంగళ ప్రదనుగు భూమి యంతయును మఱి యర్పించితి భరతునకున్!
రతుడు మాత్రము బరిపాలించును భవ్యమైన యీరాజ్యబున్ !
నీవు జెప్పినటు జరుగును గావుత! నీతి నిలువ నీ ధరపైనన్! 31

శిష్ట సమ్మతంబగు నీ యాజ్ఞను జేరి నిలుచునో నా మనసూ!
భోగములందును, ప్రియములందు నిను బొలుపుగా నిలువదు క్షణమైనా!
నీదు సత్యవ్రతమును జెఱచుచు నే నిఖిల రాజ్యమును, భోగములన్!
సుఖమునుగానీ, సీతను గానీ సౌఖ్య జీవితము గోరను నే!
నీ వ్రతమిక సత్యంబగు గావుత! నిలుచుగాత! నిల ధర్మంబున్! 32

విచిత్ర పాదపములు గలిగిన యా విమల వనంబులకును నేగి!
కందమూల ఫలముల భక్షించుచు అందముగా విహరించెదమూ!
గిరి పర్వతముల నదీ సరస్సుల జరియల విహరించుచు మేమూ!
సుఖమందుదు మట! ప్రకృతి మాత యొడి సుఖము నీకు గలుగును గాతన్!33

ఈ విధముగ వ్యసనములో జిక్కియు నిలపై బడుచు ను లేచుచునూ!
దశరథేశ్వరుడు శోకము దోడుత దగ మనసున వ్యథ గూడుకొనీ!
పుత్రుని రాముని గౌగలించుకొని స్ఫూర్తిని, స్మృతినీ గోల్పోయి!
మూర్ఛపోయి, చేష్టారహితుండై మోహము నందున జిక్కుకొనెన్! 34

అటుపిమ్మట నాకైక దప్ప మఱి యందఱు రాణులు గూడికొనీ!
ఒక్కపెట్టునా రోదన జేసిరి మిక్కిలి బాష్పము లొలుకుచునూ!
సుమంత్రుండు నట రోదన జేయుచు స్రుక్కి భూమిపై బడిపోయెన్!
కైక గృహంబంతయు నేడ్పులతో వికలం బయ్యెను నా క్షణమున్! 35

అయోధ్యాకాండము 34వ సర్గము సమాప్తము

★ ★ ★

# అయోధ్యకాండము-ప్రథమ భాగము

## ముప్పది యైదవ సర్గము

(సుమంత్రుడు ఎంత బ్రతిమాలినను కైక వినకుండుట—
కేకయరాజు వృత్తాంతము)

అంత సుమంత్రుడు దలను గదల్చుచు వింతగ నిట్టూర్పును విడిచీ!
హస్తమునందున హస్తము జేర్చి యటునిటు మర్దించుచు వేగన్!
దంతములను గటగట లాడించుచు వింతగ కన్నులు నెఱ్ఱవడన్!
కోపావిష్టుండై దుఃఖించుచు గూరిమి దశరథు జూచుచునూ! 1

వాడి వచన బాణంబుల తోడను వనిత కైకేయి హృదయంబున్!
కంపింపగ జేయుచు నా దన్విని గలవరబఱచుచు నువ్వటులన్!
శీఘ్రముగా వచ్చెడి వాక్యములను శిరసున బడు పిడుగుల వలెనూ
కైక హృదయమును చేదించుచునూ కడు దీవ్రముగా నిటులనియెన్! 2

కైకేయీ! యీజగతి కంతకును గమ్మని ప్రభు వీ దశరథుడున్!
రఘుకుల తిలకుడు బ్రజల నేలినా రమ్య రంజకుడు గద తల్లీ!
అట్టి ప్రభువు ని విటుల జేసితివి యసమంజసమగు గోరికలన్!
నీవే స్వయముగ పరిత్యజించీ నిలువుగ చీల్చితి విక యేమీ? 3

ఇంద్రునివలె బహు పరాక్రమవంతుడు సాంద్ర గిరుల వలె నచలుండున్!
సంద్రమునకు వలె నక్షోభ్యుండును చంద్రునివలె జల్లనివాడున్!
అట్టి నరేంద్రుని యిట్టి కర్మలను నలసట బెట్టుచు బాధించీ!
చంపుచు నుంటివి సకల కులమునే నింపుచుంటివీ యపకీర్తిన్! 4

వరముల నిచ్చుచు బోషించెడి యా వరదు నిటుల జేయందగునా?
కోమలికుండును భర్త కోరికయె కోటిమంది పుత్రుల కంటెన్!
రాజుగతించిన రాజగు జ్యేష్ఠుడు రాజ్యములను బాలింపుదురూ!
రాముని విషయంబున యప్రశుతిసీ రమణి మార్చ దలబెట్టితివీ! 5

నీ కుమారుడగు భరతుడు రాజై యీధర బాలించును గాతన్!
రాముడు బోయిన చోటికి మేమును రయమున బోదుము నిపుడిపుడే!
చేయుచున్న పని నీతిమాలినది జేయరు సమ్మతి నీతివిదుల్!
బ్రాహ్మణు డెవ్వడు నివసింపడు సూ' పరగ నీదు రాజ్యము నందున్! 6

రాముడు బోయిన వన మార్గంబున రమణి! మేము నిక బోయెదమూ!
బంధువులను బ్రాహ్మణులల చేతనూ భవ్య సాధుబురుషుల చేతన్!
పరిత్యజింపగ బడితివి! పుడమిని భవ్య సుఖము లెటు బొందెదవూ?
అమర్యాద కర్మలను జేయగా నవతరించితివి వంశమునన్! 7

ఇటుల నీవు వర్తింప విచిత్రము! నీచరిత్రయును జీలికలై!
నిను తనలోపల గలుపక యున్నది నింగి దేవతలు జూడంగన్!
రాముని వనమును బంపజూచు నిను రమణి! ఋషులు సృజియించన యా
'ఛీ!'యను వాగ్దండము నిను దగ్ధము జేయదేదు యాశ్చర్యముగన్! 8

గొడ్డలితో మావిని బడవేసీ గూర్మి నింబకును దుగ్ధముతో!
పరిచర్యలు జేసిన ఫలమేమీ? ఫలితము లుండవు నీ వలెనే!
జన్మను వచ్చిన స్వభావమది నీ జన్మనిచ్చినా తల్లివలెన్!
నింబనుండి తేనెలు స్రవించవను నీతిగలదు లోకము నందున్! 9

నీ తల్లికినీ చెడ్డ పట్టుదల నిలిచి యుండెనని నే వింటిన్!
ఒక సత్పురుషుడు నీదు తండ్రికిని నొప్పగ యుత్తమ వరమిచ్చెన్!
ఆప్రభావమున సర్వ భూతముల నలరు సంజ్ఞలను ధ్వనులన్ని
తెలిసికొనియెడి జాగృతి నందెను యిల ప్రాణుల భాషల నన్ని!

ఒక్కనాడు దన శయన సమీపము నొక్క జృంభ యను జీమయునూ!
పలుకు బలుకగా దాని భావమును బరగ దెలిసి రసభరితుండై;
ఫక్కున నవ్వెను నీదు దండ్రియును బన్నుగ నీ తల్లియు వినగా!
నీదు తల్లియును గోపగించినది నిష్ఠుర పణితిని గ్రోధమునన్! 11

తను జూచియె తన భర్త నవ్వెనని తన ప్రియభర్తకు నిటు లనియెన్!
సౌమ్యుడవగు ఓరాజా! తెలుపుము సరగున నవ్విన కారణమున్!

తెలిసికొనగ నే గోరుచుంటినీ తేట తెల్లముగ తెలుపుమికన్!
అని నీ తల్లియు నడుగ తండ్రియును నలరి పలికె నిటులను బ్రీతిన్! 12

ఓ రాణీ! కారణము దెలుపగను నొప్పగ నే మరణింతుచుగా
చెప్పగూడనివి యుండు లోకమున జేరి వినగ కూడనివియునూ!
అన నీ తల్లియు కేకయ రాజును యతి నిష్ఠురముగ వాక్రుచ్చెన్
జీవింపుము! లేదా మరణింపుము! చింత లేదు, నీ నవ్వునకున్!
కారణంబు దెలుపంగ వలయు సుమ! గడు హాస్యమునకు బనిలేదూ! 14

అని పలుకగ నీతల్లి కేకయయు యా వర మిచ్చిన విజ్ఞునకున్!
విషయమంతయును విప్పిజెప్పి దా వివరముగా దుది మొదలుగనూ!
ఆ సత్పురుషుడు నీదు దండ్రికిని యలరి దెలిపె నీ విధముగనూ! 14

ఓ రాజా! ఓ కేకయ రాజా! యొనర రాణి మరణించిననూ!
నీవు మాత్ర మా రహస్య మంతయు భావంబును దెలుపగ నీకూ!
ప్రసన్నుడగు నా ముని పలుకులు విని ప్రాజ్ఞుడైన నీ తండ్రియునూ!
నీదు తల్లినీ తిరస్కరించెను నిండు కుబేరుని వలె నుండెన్! 15

పాపదర్శినీ! తల్లికి వలెనే పట్టుదలను, గఠినత్వముతోన్!
అజ్ఞానముతో వర్తిలుచుంటివి అందచందములు జూచుకొనీ
తండ్రి గుణంబులు బుత్రుల కొచ్చును తల్లి గుణంబులు గూతులకున్!
వచ్చుననియెడి ప్రవాదమున్నది యచ్చముగా సత్యంబయ్యెన్! 16

తల్లి పోలికలు గలదానవుగా దగని పోకడల బోవకుమా!
రాజు దెలిపినది శిరమున దాల్పుము! రహి దీర్పుము బ్రజగోరి కలన్!
పాపాత్ములు జెప్పిన మాటలు విని పరగ యింద్రసముడగు భర్తన్!
అసద్ధర్మమున బడవేయకుమా! యందఱు నవ్వగ జేయకుమా! 17

అనఘుండును శ్రీమంతుండును నగు నా దశరథుడును తన మాటన్!
తప్ప దెన్నటికి దగ నీవే యిక విప్పవలెను ముడి! మార్చుకొనీ!
రాముడు జ్యేష్ఠుడు నుదారభావుడు రమ్యగుణుడు సకల ప్రియుడున్!
అట్టి రామునకు బట్టము గట్టగ యలరి బూనుకొను గైకేయీ! 18

రాముడు దండ్రిని విడిచి పోయినా రహి నీకొచ్చును నపవాదున్!
రాముడె రాజ్యము బాలించు నటుల రమణి జేయుమా సుశ్రీలన్!
మనసునందు సంతాపము విడుపుము మహనీయమునగు గీర్తిగనూ!
రాజ్యము బాలింపగ సమర్థుడా రాము డొక్కడే గలడు సుమా! 19

రాముని రాజుగ చేసిన పిమ్మట రాజు దశరథుడు వే వెంటన్!
పూర్వపురుషులను ననుసరింపగా బొందుగ బోవును నడవులకున్!
సుమంత్రు డీ విధి దశరథు నెదుటను సుభాషితములను గైకకునూ!
కలతజెందునటు దెలిపి నిలబడెను గమనీయంబగు నంజలితో! 20

అటుల సుమంత్రుడు నెన్ని దెలిపినను నా కైకేయియు నిశ్చలతన్!
కదలక మెదలక నిలిచి యుండెనట కఠిన శిలకు వలె మౌనముగా!
మనసునందు నే మాత్రము నలతయు మఱి కలతయునూ లేదుగదా!
ముఖవర్ణములో మార్పును లేదూ! శిఖివలె వెలిగెను లోలోనన్! 21

(అయోధ్యాకాండములో 35వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## ముప్పదియారువ సర్గము

(దశరథుడు శ్రీరామునితో ధనమును, సేనను బంపగోరుట, కైకేయి వ్యతిరేకించుట, సిద్ధార్థుడను మంత్రి కైకకు నీతి బోధించుట)

వరముల నిచ్చెద నంచు దశరథుడు వరవర్ణినిచే గలుషితుడై!
మాటిమాటికిని నిట్టూర్పులతో మఱి సూతునితో నిటు లనియెన్!
రామునితో వని బంప రత్నములు రహి గజాశ్వ రథ పదాతులన్
సిద్ధము జేయుము! సర్వ వస్తువులు శీఘ్రముగా రాముని వెంటన్! 1

వాదిన్యాదీ రూపజీవనులు వలనొప్పగ బహు ధనికులునూ!
కుమార రాఘవుతో జనుదేరగ కూర్మి సిద్ధమును జేయుమికన్!
రాముని యాశ్రయమున జీవించెడి రహి క్రీడాకారులకు మఱిన్!
బహుధనంబులను నిచ్చి జేర్పుమా! దగ సైన్యంబున వేగముగన్! 2

ముఖ్యమైన యాయుధములు భేరులు ముదమున యరణ్య బోయలునూ!
కాకుత్థ్సునితో కదిలి వెళ్ళవలె కలకల నాదములను గూడి!
మృగముల గజముల వేటాడుచునూ నగముల దేనెల ద్రావుచునూ!
అనేక నదులను గాంచుచు సుఖముగ అయోధ్య నిక స్మరియింపకనూ! 3

ధన కోశంబును, ధాన్య కోశమును దరలింపుము రామునితోడన్!
నిర్జన వనమున బాధను జెందును నిర్ధనుడై నా రాముండున్!
పుణ్యక్షేత్రముల యాగంబులనూ పుణ్యకర్మలను జేయుచునూ!
వనమునందు ఋషి మునులను గలిసీ మోదముతో రోజులు గడుపున్! 4

మహాబాహు భరతుడు బాలించును మహా కోసలను సంప్రీతిన్!
భోగ్య పదార్థములన్నియు బంపుడు బొలుపుగ సమస్త వస్తువులున్!
దశరథు డీ విధి బలుకుచుండగా దగ భయమందెను గైకయునూ!
శోషించెను ముఖమును మఱి స్వరమును స్రుక్కిపోయి దుర్బలమయ్యెన్!

దుఃఖముతోడను, భయము దోడనూ దురపిల్లుచు రాజును జూచీ!
రుద్ధకంఠమున నిటుల పలికెనూ కడు విచారమున వేదనతో!
రాజా! యందుఖ బోయిన పిమ్మట రహి మిగులును నీ దేశమునన్?
మద్యము ద్రావిన భాండములకు వలె మఱి యీరాజ్య మదెందులకూ?
సారవిహీనంబైన యీ ధరణి భరతున కక్కఱలేదు సుమా! 6

ముక్త లజ్జయగు కైకేయిని గని మునిసముడగు నా దశరథుడున్!
దారుణంబులగు బలుకుల వినుచును దగయిట్లని కైకకు బలికెన్!
కైకేయీ! నను గడితివి కాడికి కర్మవశంబున నిటులైతిన్!
లాగుచుండ తాడిని ములుకోలను వేగ బొడుచుచున్నావు గదే! 7

అనార్యురాలా! ముందు ముందుగనె యాపని యెందుకు జేయకనూ!
చూచుచుంటివీ విడ్డూరముగా సుదతివిగా దొక రాక్షసివీ!
రాజు కోపమున బలికిన పలుకులు రయమున మఱింత కోపముతో
కైకబలికినది నరపతి తోడను గడు విషాదమగు వాక్యములన్! 8

నీ వంశంబున సగరుడను రాజు నిర్మలమతి యసమంజసునీ!
జ్యేష్ఠ బుత్రునీ వెడల నంపెనూ యిష్టరాజ్యమును నీకుండన్!
ఆ విధముగ శ్రీరాముడు గూడను నలరి ధరిత్రియు బొందకనూ
దేశ బహిష్కృతుడయి తీరవలెను దీరునిగా వని దిరుగవలెన్! 9

ఈ విధముగ బలికిన కైకేయిని యినవంశజు డా దశరథుడున్!
'ఛీ!' యని మాత్రమె పలికి యూరుకొనె బిత్తము మిక్కిలి క్షోభింపన్!
అచ్చటగల వారందఱు సిగ్గున చెచ్చెర వాల్చిరి శిలములనూ
ఇంత జరిగినను కైకేయీ సతి యింత వెనుకకును బోలేదూ! 10

కైకపలుకు విని సిద్ధార్థుండను గడువృద్ధుండగు మంత్రియునూ!
మోమాటము నింతయు లేకుండగ ముదిత కైకకును నిటులనియెన్!
"దుర్మతి యగు నా యసమంజసుడును దురిత మనక పసిపాపలనూ!
సరయూ జలముల బడవైచుచు బహు సంతసమందెడి వా డతడున్! 11

అంతపౌరులును గోపగించుకొని యా రాజును గని యిట్లనిరీ!
దుష్టుడు నసమంజసు గోరెదవో నిష్టుల మగు మము గోరెదవో!

కోరుకొమ్మనగ సగర రాజునూ కూరిమి పౌరులతో ననియెన్!
భయమునకును మఱి కారణ మడుగగ బాధను బౌరులు నిట్లనిరీ! 12
భ్రాంతి జెందినా యసమంజసుడును బన్నుగ యాడెడి పాపలనూ!
సరయూ నదిలో బారవైచుచును సాటిలేని యానందముతో!
మురియుచున్న వాడని ప్రజ బలుకగ మోదముతో నా సగరుండున్!
అసమంజసునీ విడిచివైచెనూ! నందఱు సంతస మందంగన్! 13
అసమంజసునీ, యతని భార్యనూ యపుడే రథమును నెక్కించీ!
యావజ్జీవము దేశబహిష్కృతు గావింపగ యాజ్ఞాపించెన్!
పాపకర్ముడగు నసమంజసుండు బలుచోటుల దా దిరుగుచునూ!
గిరి దుర్గంబుల బట్టి పోయెనూ గిరుల మూల ఫలములు దినుచున్! 14
పాప కర్మములు జేసిన పుత్రుని బన్నుగ సగరుడు బొమ్మనియెన్!
రాముడేమి పాపము జేసెను నిల రాముని బొమ్మన కారణమూ?
రామునిలో మాకే దోషంబును రహి గనిపించుట లేదు గదా!
చంద్రునందు నే దోసముండదో సాంద్రతేజు రాముని యందున్! 15
రాముని యందే దోషము గలదో రహి దెలుపుము విధిగా మాకున్!
తదుపరి బంపుము రాముని వనికిని దగ నందఱికిని దెలియంగన్!
సత్పథమున చరియించు వానినీ సరస గుణుడు శ్రీరాఘవునీ!
వనికిని బంపుట బహు దోషమునూ! యొనరి యరిష్టములును గూడున్! 16
కైకేయీ! రాముని వని బంపకు! గఠినమైన పని జేయకుమా!
లోకమునం దపవాదము గలుగును శోకము జెందును భూప్రజయున్!
ఆ సిద్ధార్థుని వచనములను విని యా రాజును గళబాష్పముతో!
కైకేయిని జూచుచు నిటు పలికెను గంపిత హృదయా వేదనతో! 17
కైకేయీ సిద్ధార్థుని మాటలు గమ్మని హితమును గైకొనకన్!
చెడు మార్గంబున దోవుచుంటివీ విడివడకను జెడు జేష్టలనూ!
నీ హితమును మఱి భరతుని హితమును నెఱె జూడక ధర నవ్వంగన్!
రఘువంశమునకు వదువు నీవు మఱి రమణి మానుమా! యీ శఠమున్! 18
ఈ రాజ్యము! సుఖమును, ధనములను నిల సర్వస్వము ద్యజియించీ!
రామునితోడుత వనముల కేగెద రమ్య జీవితము గడుపంగన్!
రాజమాతవై నీవును, భరతుడు రాజుగ నేలుడు నీ ధరణిన్!
చిరకాలంబును రాజ్య సుఖములను శ్రీలను బొందుడు! దుదిదాకన్! 19
(అయోధ్యకాండమున-36వ సర్గము సమాప్తము)

## ముప్పదియేడవ సర్గము

[శ్రీరామ లక్ష్మణులు నారచీరను ధరించుట- సీత నారచీరను ధరించుట జూచి అంతఃపుర స్త్రీలు గలతజెందుట- వసిష్ఠుడు కైకేయిని నిందించుట]

మహామంత్రి వచనంబులను విని మహాత్ముడగు దశరథు తోడన్!
వినీతవంశతుడు రాముడు పలికెను వినయ వాక్యములను నిట్టులనూ!
మహారాజ! భోగములను విడిచీ మహిమాన్వితములు వనములకున్
కందమూలముల దినియెడి నాకును ఘనపరివారము లెందులకూ? 1

ఘన గజమును నర్పించి యెవడు మఱి గజము నడుము ద్రాడును గోరున్?
కుంజరంబునే యిచ్చినవానికి గూర్మి త్రాచు మఱి యెందులకూ?
నాకును నట్లే గజాశ్వ రథములు నయముగ నేనను బనిలేదూ!
నయముగ నన్నియు భరతుని కిచ్చితి నార చీర లిమ్మా నాకున్! 2

పదునాల్గేడులు వనమునుండగా బన్నుగ నే బోవుచు నుంటిన్!
ఖనిత్రమును మఱి పిటకంబును నిక ఘన బరికరముల నిక నిమ్మా!
అంత కైక నా జనసమూహమున యింతయు సిగ్గును లేకుండన్!
స్వయముగ తెచ్చెను నారచీరలను శీఘ్రము గట్టగ రామునకున్! 3

నారచీరలను గ్రహించి రాముడు నయముగ సన్నని వస్త్రములన్!
వదిలి, కట్టుకొనె నారచీరనూ వనవాసంబును జేయుటకై
లక్ష్మణుండు మఱి తాను ధరించిన లలిత వస్త్రముల దొలగించీ!
మునివస్త్రంబులు ధరించె నంతట మోదముతో జనకుని యెదుటన్! 4

కౌశేయంబులు ధరించు సీతయు కైక బంపినా వస్త్రములన్!
గని వల జూచిన లేడిపిల్లవలె గలత నొంది మది తల్లడిలెన్!
ధర్మజ్ఞయు శుభలక్షణ సీతయు దగ సిగ్గును మది బొందుచునే!
కైక హస్తముల నుండి గ్రహించెను కమనీయములగు కుశ చీరల్! 5

అశ్రుపూర్ణ నేత్రముల జానకియు నారామునితో నిట్లనియెన్!
కుబేర సన్నిభుడైన భర్తతో గూరిమి సన్నగ నిటుబలికెన్!

'వనమునందు మునిపత్నులు జీరలు వాసిగ ధరింతు రెటువలెనో?'
అనుచు రామునితో బలికి జనకజయు నలవి గాక ధరియింపగనూ!
మాటిమాటికిని బ్రయత్నించి మఱి మౌనముగా నట నిలువ బడెన్! 6

ధర్మభృతుడు శ్రీరాముడు వేగము దరుణి సీత కడ కేతెంచీ!
పట్టువస్త్రముల పైననె గట్టెను బరగ స్వయముగా గుశచీరన్!
ఆవిధముగ శ్రీరాముడు సీతకు నలరి నారచీరను గట్టన్!
అంతఃపురమున యతివ లందఱును జింతను నేడ్చిరి గొల్లుమనీ! 7

రమణు లందఱును దుఃఖించుచునూ రామునితోడను నిట్లనిరీ!
వత్సా! నీతో బాటుగ సీతను వనవాసమునకు వెళ్లమనీ!
ఆజ్ఞాపింపగ లేదుగదా మఱి యతి సుకుమారిని జనకజనూ!
అడవి కేల గొనిపోవుచుంటివీ? నిడుముల బెట్టుట యెందులకూ? 8

...ండ్రి వచనమును సత్యము సేయగ తరలిపోవుచుంటివి వనికిన్!
...ఱలి వచ్చువఱకును సీతను మది సంతోషింతుము జూచీ!
...త్రక! లక్ష్మణు సహాయుగాగొని పొందుగ పొమ్మిక యడవులకున్!
...ంగళ రూపిణి సీత వనంబున రంగుగ మునివలె యెట్లుండున్! 9

...ర్మనిత్య! నీ విట నుండుటకును దగగోరుటయును లేదు గదా!
మా ప్రార్థన యంగీకరింపుమా! మధుమతి నిచటనె యుండగనూ!
దశరథాత్మజుడు వారల మాటలు దగ వినుచుండియుగూడ మఱిన్!
తుల్యశీలయగు జనకజ చేతను భవ్య నారచీరను గట్టెన్! 10

కులగురువగు నా వసిష్ఠు డంతట కూర్మి సీత చీరను గొనగన్!
నివారించుచును గైక రాణితో నిష్ఠురముగ నిటువలె బలికెన్!
అతిప్రవృత్తే! దుర్మేధే! విను! నా దశరథు వంచించితివీ!
ప్రమాణ సమ్మత న్యాయమార్గమున బ్రవర్తించుటయు లేదు గదా! 11

శీలవర్జితే! యడవుల కెందుకు సీతబోవలయు దెలుపు మికన్?
సీత యిచటనే యుండును రాముని సింహాసనమున గూర్చుండున్!

గృహస్థు లందఱికిని భార్యయు మఱి కూర్మి యాత్మ వంటిది సుమ్మా!
రాముని యాత్మయె సీత గావునను రాజ్యము బరిపాలించు నికన్! 12

అటులగాక సీతయు రామునితో నడవికి బోయినచో మేమున్!
ఆమె ననుసరించియే బోయెదమూ అయోధ్య నగరం బంతయునూ!
భార్యా సహితుడై శ్రీరాముడు బరగ నెచట నివసించెడినో
అంతపాలురను, సహోపజీవులు సలరు నగర రాష్ట్రింబులనూ!
అచటికి బోవును బరివారంబును నా పరివారముతో గూడన్! 13

భరతుడు మఱి శత్రుఘ్నుడు గూడను భవ్య నార చీరల తోడన్!
అన్నగారితో నడపి వసింతురు జెన్నుగ నీతో జెప్పకనూ!
ప్రజలందఱు నిను వినిపోవుటచే బాడు పడిన యీ వసుమతినీ!
చెట్టు చేమలను బరిపాలింపుము! కట్టి నెత్తిపై బెట్టుకొమా! 14

రాముడులేనిది కోసల దేశము రాజ్యము గాజాలదు సుమ్మా!
రాముడు వసించు వనభూములు యిక రమ్యరాజ్యమగు కైకేయీ!
భరతుడు రాజుకు పుట్టినచో మఱి ప్రభువు ఇవ్వనీ రాజ్యమునూ!
పరిపాలింపడు; నీయందునసూ పుత్రుని వలె వర్తింపడు సూ! 15

భూమినుండి నింగికి కైకేయీ! పొలుపుగ జేరగ గలిగిననూ!
పూర్వుల చరితలు తెలిసిన భరతుడు బొలతి! వినడు నీ మాటలనూ!
పుత్రప్రేమతో నీవు బుత్రునకు చిత్రముగా నపకారంబున్!
జేయుచుంటివీ యిక శ్రీరాముని జేరి గొలువనీ వారెవరూ? 16

పశువులు, మృగములు, గజములు, పక్షులు బరగ రాముతో జనుచుండన్!
తరులుగూడ శ్రీరాముని వైపున దలలు ద్రిప్పగా జూచెదవూ!
కైకేయీ! యా నారచీరనూ కడకు దీసి నీ కోడలుకూ!
ఉత్తమ యాభరణములను నిమ్మా! మెత్తని వస్త్రము లిక నిమ్మా! 17

అనుచు నిష్ఠురత వసిష్ఠదేవుడు నా కైకేయికి బలుకుచునూ!
భూమిజ కుశవస్త్రములు ధరింపగ బొందుగ నాపెను నొక క్షణమున్!

రాముని కొక్కనికే విధించితివి రమణి కైక! వనవాసంబున్
అలంకారములతో నా సీతయు నడవి రాముతో వసియించున్! 18

రాజపుత్రి! సీతయు దా బోవును రమ్య వాహనములను గూడి!
పరిచారికలను, బహుశస్త్రంబులు బహువిధ యుపకరణంబులతో!
కైకరాణి వరముల గోరితివి! కాంత సీతకై కాదు గదా!
వనికేగగ యీ జనక పుత్రియును వరముల గోరగలేదు గదా! 19

విప్ర ముఖ్యుడును, కుల గురువుండును విమలుడు వసిష్ఠ దేవుండున్!
అటుల జెప్పుచున్నను భూపుత్రియు నంతరంగమున నిర్మలతన్!
భర్తకు శుశ్రూషలు జేయంగను పతివ్రతయగు నా సీతయునూ!
వనము బోవుటకు నిశ్చయించెనూ వాసిగ పతితో గూడికొనీ! 20

(అయోధ్యాకాండము-37వ సర్గము సమాప్తము)

★ ★ ★

## ముప్పదియేనిమిదవ సర్గము

(సీత నార చీరలను ధరించుట యనుచితమని దశరథుడు బలికి కైకను నిందించుట —— శ్రీరాముడు తల్లి కౌసల్యను దయతో జూడమని రాముడు తండ్రిని కోరుట)

నాథవతియు నా సీతాదేవియు నయముగ యనాథ స్త్రీవోలెన్!
కుశచీరలను ధరింప నందఱును గొల్లున నేడ్చిరి బిగ్గఱగా!
ఛీ! ఛీ! యనుచును దశరదేశ్వరుని ఛీత్కారములను జేయుచునూ!
నిందించిరి శాపములను బెట్టుచు గుందుచు గందుచు హృదయమునన్! 1

ఆర్తనాదమును వినుచు దశరథుడు శక్తివీడి బహు దుఃఖితుడై!
జీవితమందును, ధర్మము నందును, చిర యశమున శ్రద్ధను వీడెన్!
వేడివేడి నిట్టూర్పులు విడుచుచు వినతుడైన రాజిటు లనియెన్!
నారచీరలును ధరించి జనకజ నయముగ వనికిని బోరాదూ! 2

సీత బాల సుకుమారియు సుఖవతి చీకు వనంబుల కెటు లేగున్!
గురువులు జెప్పిన మాటలు సత్యము గూర్మి వినగ దగినవి సుమ్మా!
నార జీరలను ధరించి శ్రమణిగ నయముగ మూర్ఛల దేలుచునూ!
జనుల మధ్య దా నిలబడి యున్నది జనక తనూజ తపస్వినిగా!
ఎవరికేమి యప కారము జేసెను నెవరికి జేసెను దప్పిదముల్!

జనకుని కూతురు సీతాదేవియు ముని వస్త్రంబులు ధరియింపన్!
పనిలేదుగదా! యిట్టి వరంబును బడతీ! యివ్వగ లేదుగదా!
అందుచేత యీ రాజ పుత్రియును నమూల్య వస్తు సమూహముతో
వనమున కేగును గాత రాముతో జనము జూచి సంతసమందన్! 4

జీవించుట కర్హతయులేని నే స్థిరమగు నీ నిర్బంధముచే
క్రూరమైన ప్రతినను జేసితినీ కుదురుగ బానిసనై నేనున్!
మూర్ఖత్వముతో నీవు జేయుపని నిర్మలమగు వేణువు లోనన్!
అత్మ పుష్పమే దహించి నటులను యలరి నిన్నునూ దహియించున్! 5

పాపే! యధమే! కైకేయీ యిక బరగ రాముడే యప్రియమున్!
జేసినాడో యేమోకానీ యిక సీత జేసె నే యప్రియమున్!
తపస్వినీ, మృదుశీలయు నగు నా తరుణి సీత గుణశీలవతీ!
అట్టి సీత నే యపకారము నిట్టిజేసె వే తెలుపగదే! 6.

క్రూరురాల! రాముని వనమునకును గూర్మి బంపుచున్నావు నికన్!
అదియు జాలకను నీపాపంబును నలరి జేయుచున్నావు గదే!
అభిషేకము సందర్భ సమయమున యారాముఢు నిటకున్ రాగన్!
ఏమి తెలిపితో యంతమాత్రమే బాముగ ప్రతిజ్ఞ జేసితిసీ! 7.

ఆ ప్రతిజ్ఞకును మించి జానకిని యా కుశ చీరలు ధరియింపన్!
జూడ గోరుచుంటివి! పాపిని! యిక జూరగొందు వా నరకంబున్!
ఆవిధముగ విలపించు రాజునకు నా దుఃఖమునకు నంతంబున్
లేక పుత్రవ్యసనముతో గూడుక శోకముతో నేలను వడియెన్! 8.

వనము బోవ సంసిద్ధుడైన యా వనజాక్షుడు శ్రీరాముండున్!
తలను వంచి కూర్చున్న రాజుతో దగ యిటులనె మృదువచనములన్!
మహారాజ! నా తల్లి కౌసల్య మహా యశస్విని వృద్ధయునూ!
నీచ స్వభావము గలదికాదు గద! నిను నెన్నడు నిందింపదుగా! 8

మహారాజ! పూర్వం బెన్నడునూ మానుగ నెఱుగదు గష్టములన్!
వనములకును నే బోవుట చేతను మనసున వేదన దహియింపన్!
శోకసంభ్రమున మునిగి పోవుచును రాక కెదురు జూచుచు నన్నున్!
అట్టి తల్లినీ యా కౌసల్యను యాదరంబునను జూడ దగున్! 10

నన్ను గూర్చి యోచించుచు నామెయు జెన్నుగ శోకమునను గూడున్!
అట్టి శోకమును జెందకుండునటు గట్టి యత్నమును జేయు మికన్!
ఆదరించి యభిమానించినచో నలరు శాంత భావము తోడన్! 11

నీవే మూలముగా జీవించును నిండు శోకమును విడనాడి!
నేబోయిన పిమ్మట వనములకును నిండు శోకమున కృశియించి!
యమక్షయమునకును బోవకుందునటు యాదరమున గను నా తల్లిన్! 12

అయోధ్యాకాండములోని ముప్పది యెనిమిదవ సర్గము సమాప్తము

* * *

## ముప్పది తొమ్మిదవ సర్గము

(దశరధుని విలాపము —సుమంతుడు రథమును గొనివచ్చుట.... కోశాధిపతి సీతకు అమూల్య వస్త్రములను, ఆభరణములను నిచ్చుట— కౌసల్య సీతకు పతిసేవ నుపదేశించుట — రాముడు తల్లిని, తండ్రికి శుశ్రూష జేయమనుట — తల్లులందఱిని సెలవడుగుట.)

రాముని మాటలు విని దశరథుడును రాముని ముని వేషము గాంచీ!
విగతచేతనుం డయ్యె భార్యలును వేగ తేరుకొని నరేంద్రుడున్!
సంతప్తంబగు హృదయము దోడుత జింతతోని రాముని ముఖమున్!
చూడజాలకను పోయెను మఱియును సూటిగ మాటాడక పోయెన్! 1

ముహూర్త మాత్రము సంజ్ఞలేకనూ ముసముస కన్నీటిని రాల్చి!
రాముని గూర్చియె యాలోచించును రహి మనసున యిటులను దలచెన్!
పిల్లల తల్లుల నుండి కఠినముగ ప్రీతిలేక విడదీసితినీ!
ప్రాణుల నెందఱినో హింసించితి పన్నుగ యీ యాపద వచ్చెన్!

కాలము రాకను ప్రాణము బోవదు కర్మఫలము బొందగ వలయున్!
పట్టు వస్త్రములు విడిచి బదులుగా జెట్టు నార చీరల తోడన్!
పావకునికి వలె ప్రకాశించు నా ప్రవిత్రుల రాముని జూచుచునూ!
మృత్యువు లేకను బ్రతికి యుంటినీ మోదముతో గైకను గనుచున్! 3

స్వప్రయోజనమునకు జింతించుచు సంశ్రయించె యీ నికృతినీ!
ఒక్క కైక కొఱకై జనులందఱు మిక్కిలి నొందిరి బాధలనూ!
ఈవిధముగ బలుకుచు నరేంద్రుడును నింద్రియముల వశమును దప్పి
'రామా!' యనుచును పలికె నింతియే రహి మాటాడక పోయెనుగా! 4

కొంతసేపటికి తెలివి తెచ్చుకొని చెంతనున్న సూతుని తోడన్!
కన్నీరును నొలుకుచు ధరణీంద్రుడు జెన్నుగ యీవిధమున పలికెన్!
హయములతో దగు రథమును గూర్పుము! నలరగ దోలుచు శ్రీరామున్!
జనపదంబులకు నావల నుండిన వనభూములకును జేర్చు మికన్! 5

సత్పురుషుడు వీరుడు నగు బుత్రుని సహజ ప్రేమ విడనాడుచునూ!
కాఱడవులకును బంపుచుంటినీ కఠిన యాజ్ఞలను బడ్రదోసీ!
గుణవంతుని నిటు మంచి గుణంబులు గుదురుగ యున్నందులకు నిటుల్!
ఇదియె ఫలంబని మనసున దలతును నీ ధర లీలగ భావింతున్! 6

రాజు మాట విని సుమంత్రు డంతట రయమున సుందర హయములతో!
కట్టిన రథమును దెచ్చి నిలిచెనూ యిట్టె బలికె శ్రీరామునితో!
కనకభూషితంబగు రథమును నే గడువేగములగు గుఱ్ఱములన్!
రథము సిద్ధమని దెలిపె రామునకు నా దశరథ రాజేంద్రునకున్! 7

దేశ కాలములు దెలిసిన వాడును ధీరుడు నిశ్చిత బుద్ధియునూ!
దశరథు డంతట గోశాధ్యక్షుని దగ పిలిచియు నిటులను పలికెన్!
పదునాల్గేడులు వనమున నుండును బరగ సీత యాసంఖ్యలతో!
వస్త్రంబులు మఱి యలంకారములు వరుస దీసికొని వే రమ్మా! 8

రాజాజ్ఞను నా కోశాధ్యక్షుడు రయమున యా యా వస్తువులన్!
తెచ్చియిచ్చె నా ధరణి సుతకును తీరుగ నందఱు జూడగనూ!
భూషణాంబరములను ధరించి యా భూపుత్రియు బహు తేజమునన్!
ఉదయభానునీ కిరణజాలమున యుర్వి ప్రకాశం బగు నటులన్! 9

వన ప్రస్థితమగు సీత సుజాతా వరవర్ణిని యా భూషణముల్
సుందరమగు నవయవయము లందునను సురుచిరముగ వే ధరియించెన్!
అట్టి సమయమున గూడను జనకజ నడలక సంతసమున నుండెన్!
కౌగలించి సీతను కౌసల్యయు కమ్మని మాటల నిటు లనియెన్! 10

భర్త లెంతగా గౌరవించినను బరగ యసత్యలు నీ యుర్విన్!
పతి దుర్దశలో నున్న వేళలో బరగ జూతు రవమానముతో!
ఎన్ని సుఖంబుల ననుభవించినను జెన్నుగ పతితో సౌఖ్యములన్!
చిన్నియాపదను కూడ సహింపరు వన్నెల స్త్రీ లీ ధరయుందున్! 11

భర్తను గూడను బరిత్యజింతురు భావమునందున గర్వముతో
ఇది లోకములో స్త్రీల స్వభావము నింపుగ విను! నా వచనములన్! 12

చెడు యాలోచనగల యువతు లిలను గడు దుశ్శీలన వర్తనలన్!
ఒక్క క్షణములో భర్త్యనురాగము నొలక బోయుదురు గద నేలన్!
వారి హృదయమును నాకర్షించుట వలనుగాదు హరి బ్రహ్మలకున్!
వారి మనసులను దెలిసికొనుటయును వలనుగాదు ఘన జోదులకున్! 13

సత్కులమును నుపకారముగానీ సద్విద్యయు దానము గానీ!
ఆదరంబుగానీ స్త్రీ హృదయము నాకర్షింపవు మిక్కిలిగా!
నిత్య హృదయులు స్త్రీఅలుగదా! మఱి యతిచంచల హృదయులు వారున్!
శీల సత్య శమ శ్రుతులయందునూ స్థిరముగ నుండెడి పతివ్రతకున్!
భర్తయె వనితకు బరమవస్తువుగ భావింపగబడు నెల్లపుడున్!
వనమున కేగెడి నా కుమారునీ వనమం దవమానింపకుమూ!
ధనమున్నను లేకున్నను భర్తను దగ భావింపుము దేవతగా! 15

ధర్మార్థములకు ననుకూలములగు దగ కౌసల్యా వచనంబుల్!
విని సీతయు నర్థంబు జేసికొని వినయాంజలితో నిటులనియెన్!
పూజ్యురాల! నీ యాజ్ఞాపించిన స్ఫూర్తి జేసెదను నంతయునూ!
భర్త విషయమున బ్రవర్తించు విధి బన్నుగ తెలియును; విని యుంటిన్!
పూజ్యురాల! నను దుష్టజనముతో బోలుపుగ భావింపకుము! మదిన్!

కాంతి చంద్రునీ విడువజాలనటు శాంతి ధర్మమును విడజాలన్!
తీవెలేని వీణియ మ్రోవదుగా తేరును లేకయు చక్రములున్!
నడువదుగా! మఱి భర్తలేని స్త్రీ నయముగ నూర్గురు బుత్రులునూ!
గలిగినగూడను సుఖసౌఖ్యములను గలిగియుండ నేరదు బుడమిన్! 17

తల్లియు దండ్రియు గుమారుండునూ దగ స్త్రీకిచ్చెడిదియును మితమే!
అమితంబును నిచ్చెడి భర్తను దా నలరి భజింపని సతి యుండున్?
ఇట్టి యోచనల్గు గలిగిన దానిని అట్టి ధర్మములు గల్లదానన్!
భర్త నెటుల నే నవమానింతును? భర్తయె స్త్రీలకు ధర్మంబున్! 1.

హృదయంగమములు సీత వచనముల మది కౌసల్యయు హర్షమునన్!
దుఃఖ హర్షజములగు బాష్పములను దొలకరి వలె వర్షించె నహో!

అంతరాముడును కౌసల్యకు దా నమిత సత్కృతిని యంజలితో!
ప్రదీక్షిణము గావించి పలికెనూ పరగ భక్తి పొంగారగన్! 19

అమ్మా! కంటను నీరు బెట్టకుము! యమ్మ! కలత జెందకు మింకన్!
తండ్రిగారి శుశ్రూషజేయుమా! తరలివత్తు నే త్వరలోనన్!
పదునాల్గేడులు నిదురకు వలె నే పరగ గడిపెదను వనియందున్!
మిత్రుల తోడుత నన్ను జూచెదవు మేదుర నయోధ్య నగరమునన్! 20

రాము డీ విధము దల్లితోడుతను రయమున బలుకుచు యోచించీ!
మూడువందలా యేబది మందిని ముదితల దల్లుల బరికించెన్!
కౌసల్యకు వలె రోదనజేసెడి కరుణామయులగు దల్లులకున్!
నమస్కరించెను భక్తిశ్రద్ధలకు రయమున రాముడు నిటు బలికెన్! 21

చిర పరిచయమున వలనగాని మఱి బిర యజ్ఞానముచే గానీ!
చేసిన తప్పులు మన్నింపుడు నను సెలవు దీసికొని జనుచుంటిన్!
ధర్మయుక్తమగు రాముని బలుకులు ధరణీ పతి సతులందఱునూ!
శోకాక్రాంతములగు జిత్తములను శోకించిరి క్రౌంచము లటులన్! 22

పూర్వమందు నీదశరధు గృహమును బొలుపుగ మేఘధ్వని వోలెన్!
మురజ పణవ వీణా మృదుస్వనముల మోదము నందుచు నుండెదియున్!
ఇపుడు వ్యసనముల జిక్కి కరంబున యేడ్పులతో పెను బొబ్బలతో!
ప్రతిధ్వనించుచు నున్న దిపుడు మఱి ప్రతికూలింపగ దైవంబున్! 23

అయోధ్యాకాండమున 39వ సర్గము సమాప్తం

★ ★ ★

# అయోధ్యకాండము - ప్రథమ భాగము

## నలుబదియవ సర్గము

(సీతా రామలక్ష్మణులు దశరథునకు ప్రదక్షిణ మొనరించుట — సుమిత్రాదేవి లక్ష్మణునకు ఉపదేశించుట — సీతా రామలక్ష్మణులు రథ మెక్కి వనమునకు బోవుట — పౌరజన సంతాపము — రాజు, రాణులు శోకించుట.)

అంత రామలక్ష్మణులు సీతయును నా దశరథునకు గడుభక్తిన్!
అంజలి తోడను ప్రదక్షించిరీ యలరి పాదముల స్పృశియించీ!
ధర్మజ్ఞుడు రాముడు సీతయునూ తగ దశరథు నాజ్ఞను బొందీ!
కౌసల్యాసతికిని మ్రొక్కిరి గడు నలతజెందు మనసుల తోడన్! 1

రాముడు నమస్కరించిన పిమ్మట రహి కౌసల్యను లక్ష్మణుడున్!
జేరిమ్రొక్కి తనతల్లి సుమిత్రకు జేర్చె శీర్షమును బాదములన్!
తల్లియైన యా సుమిత్రదేవియు దనయుని లక్ష్మణుబైకెత్తీ!
శిరసును ముద్దిడి రోదన జేయుచు సిద్ధిని గోరుచు నిటు లనియెన్, 2

కుమార లక్ష్మణ! సృజింపబడితివి! కూర్మి సుహృజ్జన మేలునకై!
వనముల కేగెడి సీతారాముల గని రక్షింపుము నెల్లప్పుడున్!
ఏమరుపాటును నింతలేక మఱి వీక్షింపుము గనురెప్పవలెన్!
తిరిగి రమ్ము! సీతారాములతో దివిరి దేవతలు రక్షింపన్! 3

కష్ట సుఖములను గలిసియుండుమా! కలిమి లేములను రామునితో!
జ్యేష్ఠుని యాధీనమున నుండుటే జ్యేష్ఠ గుణంబది లోకమునన్!
జ్యేష్ఠ సోదరుని ననుసరించుటయు ధీరుల లక్షణ మీ జగతిన్!
సత్పురుషులకును సమ్మత మైనది సహజ ధర్మమది లోకమునన్! 4

దానములును, యజ్ఞములు జేయుటయు యనిలో బాణము లొదులుటయున్!
సనాతనంబగు మన యాచారము సహజ సిద్ధమగు పద్ధతియున్!
రామునియందలి ప్రేమను గలిగిన భీమ పరాక్రము లక్ష్మణునిన్!
గచ్ఛ!' 'గచ్ఛ!' యని పలికె సుమిత్రయు గరుణ దీవెనల నిచ్చుచునూ!

దశరథుడని భావింపుము రాముని దగ సీతను నను జూచినటుల్!
అడవి నయోధ్యగ భావింపుము సుత! కడు సుఖముగ వనికిని జనుమా!
అంత సుమంత్రుడు నమస్కరించుచు కాంతి మంతు శ్రీరామునితో!
మాతలి శక్రునితో బలికినటుల్ మధురముగా మఱి ధీరతతోన్! 6

రాజపుత్ర! రథ మారోహింపుము! రహి క్షేమంబును నగురీతిన్!
ఎటుబోయెదవో దెలుపుము శీఘ్రము నటు గొనిపోయెద నే నిపుడున్!
పదునాల్గేడులు వనము నుండవలె పన్నుగ కైకేయీ యాజ్ఞన్!
ఆ వర్షంబుల బ్రారంభింపగ యవసర మున్నది గద నేడున్!

సుందరియగు నా సీతయు శీఘ్రము సురుచిర భూషణ కాంతులతో!
సూర్యునివలె భాసించు రథమునను శుభము దలంచుచు దా నెక్కెన్!
అగ్నివోలె భాసించెడి రథమును నా చామీకర భూషితమున్.
రామలక్ష్మణులు గూడ నెక్కిరీ రయము నాయరదము బైకిన్! 8

భర్తతోని వని జనుచున్న యా పరమ పతివ్రత సీతకునూ!
దశరథు డిచ్చెను వస్త్ర భూషలను బదునాల్గేడులు సరిపోవన్!
రామలక్ష్మణుల యుపయోగార్థము రహి యాయుధములు గవచములన్!
డాలు హస్తకవచంబులు గూడను నరదము పై నుంచెను వేగన్! 9

రామలక్ష్మణులు సీతాదేవియు రథమెక్కుటయు గమనించి!
సుమంత్రు డంతట రథమును దోలెను సురుచిరమగు నా యశ్వములన్!
చిరకాలము వనమున నుండుటకై సీతారాములు వెడలగనే
నగరమంతయును శోకము నందెను నయముగ బలమును గోల్పోయెన్!

అప్పు డా నగము మదగజములచే నంతట రేగెను బృంహితముల్!
హయశింజిత నిర్ఘోషంబులతో నలచిగాని స్వనములు చెలగెన్!
పట్టణ మంతయు వ్యాకుల యాయెను బన్నుగ యపశకునంబులతో!
కంటినీరు దొలకని వారెవ్వరు గానగ రారల నగరములోన్! 11

బాలవృద్ధులును స్త్రీ పురుషులునూ బహు దుఃఖితులై యందఱునూ!
ఘర్మార్తులు సలిలంబు గోఱకునై కడు శీఘ్రము బరువెత్తునటుల్!

రాముని జూడగ పరుగులెత్తిరీ రమ్యవీధులను నడ్డుకొనీ!
రథము జుట్టు ప్రజ మూగుచు నిలిచిరి రథము గదలకను యుండంగన్!

రథము ముందునను వెనుకకు ప్రక్కల రయమున గుంపుగ జుట్టుకొనీ!
అశ్రు పూర్ణ ముఖములతో జనములు నడలుచు బలికిరి యీ రీతిన్!
సూత సుమంత్రా! మెల్లగ నడుపుము! సురుచిరముగ రాముని ముఖమున్!
జూడగలుగుదుము! జూడముగా యిక సుందర రాముని దర్శనమున్!

దేవ కుమారుని వంటి రాముడదె దేశము వీడుచు జనుచుండన్!
మాతృమూర్తి కౌసల్య హృదయ మది మామగ శిల యది కాబోలున్!
బ్రద్దలవదు; రవ్వలుగా జెదరదు సిద్ధ తపస్విని వలె నిలిచీ!
జూచుచున్నదీ సుందర రాముని వీచికవలె దూగాడుచునూ! 14

ధర్మమందు ననురక్తిని గలిగిన ధరణీసుత భర్తను గూడీ!
సూర్యకాంతి మేరువును విడువనటు సుదతీమణి రామునితోడన్!
వనమున కేగుచు నున్నదిగద యిక వానిగ చూడము! జనకసుతన్!
తుదిసారిగ చూతము! జనకజనూ మది పొంగగ సాకేతమునన్! 15

లక్ష్మణ! నీవును రాముని గూడుక లలిత సేవలను నందింపన్!
వనమున కేగుచు నుంటివి! నహహా! భ్రాతృభావ మెంతటి ఘనమో!
అన్నను గూడుక యడవి కేగుటయు నదియొక సిద్ధియె మది దలతున్!
అదియె యభ్యుదయ యానందంబులు నదియే స్వర్గం బగుగునూ! 1

ఆవిధముగ బలుకుచు దీనముగా నా యిక్ష్వాకుని దోడుతనూ!
జనెడి జనులు గన్నీటిధారలను గడలిగ జేసిరి మార్గంబున్!
అంతట దశరథ రాజు రాణులను శాంతముగా నూతము గొనుచున్!
ప్రియపుత్రుని నే జూచెదనంచును బ్రీతి గృహము బయటకు వచ్చెన్! 1

స్త్రీలందఱు బిగ్గఱగ నేడ్చుచును జిరతరమగు నా శోకంబున్!
కుంజరమును బంధింప యేనుగులు గురుతర ధ్వనులను జేసిదిటుల్!
ఆరాణులు జేసిన శోకధ్వని యంతట నిండెను మార్గములన్!
శోక వాహినులు ప్రవహించినవీ శూలి శిరసు గంగకు వోలెన్! 1

శ్రీమంతుడు కాకుత్థ్సుడు రాముడు స్థిరకాంతుడు నా దశరథుడున్!
గ్రహణకాలమున పూర్ణశశికి వలె కాంతి గలిని క్షీణత బొందెన్!
అంతట రాముడు శోభాయుక్తుడు నాసూతునితో వేగముగన్!
రథము దోలుమని యాజ్ఞాపించెను రహి దృశ్యములను గనలేకన్! 19

రథము దోలుమని రాముడు పలుకగ రథము నాపుమని ప్రజ పలుకన్!
సూత సుమంత్రుడు రెండు పనులనూ సురుచిరముగ చేయకపోయెన్!
రాముడు జూడగ వచ్చిన జనముల రహి త్రొక్కిడి భూ పరాగమున్!
పౌరజనంబుల యశ్రుధారలను దగ శాంతించెను మార్గములున్! 20

రాముని ప్రయాణ సమయమందునను రహి రోదనలను గన్నిటన్!
హాహాకారములను జేయుచు ప్రజ యలసట జెందిరి మూర్ఛలతో!
మీనచలనమున తామరపూవులు మిక్కిలి బిందువు లొలికినటుల్!
స్త్రీలకన్నులను జలజల రాలెను శ్రీరాముని వనవాసమునన్! 21

ఆవిధమున దుఃఖించు జనుల గని యానరేంద్రుడును దుఃఖముచే!
మొదలు నఱికినా వృక్షమునకువలె మేదినపైనను బడిపోయెన్!
భృశ దుఃఖితుడై నేలబడిన యా భూవల్లభునీ గనుగొనుచున్!
నులు జేసినా యార్తనాదములు వినబడె రామునకును వెనుకన్! 22

! రామా! యని కొందఱుపలుకగ హా! కౌసల్యా! యని రాణుల్!
లశోకమున యంతఃపురమును స్థిరముగ యేడ్చిన యటులుండెన్!
ముడు వెనుకకు దిరిగి జూడగా రహిదుఃఖముతో దలిదండ్రుల్!
గి పోవుచున్నటుల గనబడిరి మఱిగిన వేదన కలతలతోన్! 23

శముచే బంధింపబడిన యా పన్నగ గుఱ్ఱపు బిల్లయునూ!
న తల్లిని జూడగ జాలనటుల్ ధర్మపాశమున జిక్కిన యా!
రాముడు గూడను దల్లిదండ్రులను రమ్యముగా జూడకపోయెన్!
కాలవశముగద! కర్మమంతయును గతి దప్పింపగ లేరుగదా! 24

వృద్ధులునూ మఱి దుర్బలులైనా విమలులైన తలిదండ్రులనూ!
లిసదకతో వచ్చుట యును గని గాంచలేక యా దృశ్యమునూ!

బహువేగముగా దోలు మటందును బలికె రాముడును సూతునితో!
తలిదండ్రులు పడునవస్థ రాముడు దా జూడగ లేకను పోయెన్! 25

పురుషోత్తముడగు రాము డంతటను బొలుపుగ నంకుశమును జేతన్!
పొడువబడిన మద గజమునకు వలె జడువివోలె బాధను బొందెన్!
లేగయందు గల ప్రేమచేత యా లేగ గట్టి స్థలంబునకున్!
ధేనువునకువలె బరుగు లెత్తెనూ దీక్షను నా కౌసల్యా సతియన్! 26

కౌసల్యయు నా రథము వెంటబడి కన్నీరును ధర నొలుకుచునూ!
హా రామా! హా సీతా! యనుచును నటు నిటు జూచుచు నుండెనహో!
మోహము జేతను నూగి బోవుచును ముందుకు బడబోయెడి తల్లిన్!
మాటిమాటికిని దిరిగిజూచెనూ! మదిలో చింతయు బెనుగొనగా! 27

'ఆగు మాగు'మని రాజు బలుకగా నా రాముడు 'నడుపుము!' నంచున్!
అపుడు సూతుడగు సుమంత్రు మనసును నారథ చక్రములకు మధ్యన్!
పడినయటుల భావించుచుండెమా! పాలుపోక యే వంకకునూ!
ఆగిపోవ యత్నించును మఱియును సాగిపోవ యత్నము జేయున్! 28

'రథమెందుకు నీ వాప లేదనుచు' రాజు బలుకునెద పిమ్మటనూ!
'వినబడలే'దని తెలుపగ వచ్చును వివరముగా దరువాతయునూ!
కాని వీరి దుఃఖమును బ్రస్తుతము గన్నుల జూడగలేను సుమా!'
అని శ్రీరాముడు సుమంత్రుదోడుత నలరి దెలిపె బహు వేదనతో! 29

సుమంత్రు డంతట రాముని యానను సురుచిరముగ యా ప్రజ యానస్!
గైకొని రథమును బహువేగముగా కానలకును బరువెత్తించెన్!
అయోధ్య నగర నివాసు లందఱును నారామునకు బ్రదక్షిణమున్!
జేసి వెనుకకును మఱలిరిగానీ చిత్తము వెనుకకు మఱలదుగా!
కనుమఱుగైనను రాముని యరదము గనుల నీరు మఱుగవదు గదా! 30

పుట్టెడు దుఃఖముతో కౌసల్యయు బొరిబొరి దశరథుడును గూడన్!
ముందుకు బోవగ ప్రయత్నింపగా గందుచు మంత్రులు నిలు లనిరీ!

'ఎవరు దిరిగి రావలెనంచును మది నింపుగ మన మటు గోరుదుమో!
చాల దూరమటు సాగనంపగా జనద'ని లోకోక్తియు వినమే? 31

వారి మాటలను వినియు నరేంద్రుడు వడివడి బోవక యట నిలిచెన్!
శరీరమంతయు స్వేదము బట్టెను సహజకాంతియును నశియించెన్!
భార్యల తోచుత ముందుకు బోవక బహుదీనను నటు జూచుదునూ!
కనుమఱుగయ్యెను రాముడు రథమును గానరాదు రథ ధూళియునూ! 32

(అయోధ్య కాండమున 40వ సర్గము సమాప్తము)

* * *

## నలుబది యొకటవ సర్గము

(శ్రీరాముని యరణ్యగమనముచే అంతఃపుర స్త్రీల విలాపము— నగర పౌరుల వ్యాకులత జెందుట.)

పురుషోత్తముడగు రామచంద్రుడును బొలుపుగ యంజలితో గూడి!
వని కేగుచు నుండగ యంతఃపురి వరకాంతలు నేడ్చిరి కరమున్!
రక్షలేని వారము; దుర్బలులము రాముడు గతియై యుండెనుగా!
రక్షకుడగు శ్రీరాము డెచటికో రయమున బోవుచు నుండెగదా! 1

కోపింపడు; గోపించిన నాతడు గోపము మాన్పించెడి వాడున్!
సమదుఃఖుడునగు నట్టి రాముడును మము విడుచుచు నెటకేగె నహో!
తల్లి కౌసల్య సతి నెటు జూచునొ తగ మమ్మును జూచును నటులే!
అట్టి మహాత్ముడు మమ్ముల విడుచుచు నడవుల కేగుచు నుండెగదా! 2

కైక రాణిచే గష్ట పెట్టబడి కడకు రాజుచే వనములకున్
ప్రేరేపింపగబడి రాము డదే ప్రీతి వనికి బోవుచు నుండెన్!
ప్రాణు లందఱికి యిష్టుడైన మన రాముని వనికిని బొమ్మనియెన్!
ముసలి రాజునకు మతి లేదుగదా! మోసమాయె మన కందఱకున్! 3

ఈవిధముగ యా దశరథ రాణులు నీవిధి బొక్కుచు నేడ్చిరహో!
లేగలనుండీ దూరమైన యా యావుల రీతిని దుఃఖిల్లి!
పుత్రశోకమున బొక్కెడి రాజును బొగిలిన రాణుల యేడ్పులతో
రాజు దుఃఖ మది రెట్టింపాయెను రాజుకు గ్రహణము పట్టినటుల్! 4

ద్విజులగ్నిని బూజింపరుగా మఱి భోజనములు లేవా ప్రజకున్!
తమతమ పనులను జేయరు జనమును తపింపదాయెను సూర్యుండున్!
గజములు గళములను గ్రక్కెను మఱి గస్నీరును హయములు గార్చెన్
తొలిచూలున పుత్రుని కని తల్లియు దూలిపోదు సంతోషమునన్! 5

కుజుడు త్రిశంకువు బుధుడు గురుండును క్రూరగ్రహము లన్నియు గలిసీ!
చంద్రునితోడను గలిసి యుండె నట ఇంద్రధను నిలువున బొడిచెన్!
నక్షత్రములను గాంతులు లేవా! నయముగ గ్రహముల తేజస్సున్!
విశాఖ నక్షత్రము నంతయునూ విలవిల ధూమము వ్యాపించెన్! 6

మహాసముద్రము మధించి నటులను మానుగ పొంగెను నిలయముగా!
అయోధ్యనగరము జలించి పోయెను నా రాముడు వని బోవగనూ!
దిక్కులన్నియును వ్యాకులంబులై దిశలన్నియు జీకటు లాయెన్!
గ్రహనక్షత్రంబులు ప్రకాశింపకను కాంతి విహీనంబయ్యె నటన్! 7

నగరము లోనీ పౌరు లందఱును నయముగ దీనత్వము నందీ!
ఆహారము నందున విహారమున యా ప్రజలకు మక్కువ లేదూ !
అయోధ్యయందలి ప్రజలందరునూ యమిత దుఃఖమున బీడితులై
దీర్ఘమైన నిట్టూర్పుల విడిచిరి దేశ విభుని నిందించుచునూ ! 8

రాజ మార్గమున జనులందఱు నట రహి కన్నీళ్ళను గలుషితములై
సంతోషంబున నున్నవా డొకడు సరసత గనిసింపడు నెందున్!
చల్లగ వాయువు వీచుట లేదూ శశి సౌమ్యతయును లోపించెన్!
సూర్యుడు కాంతిని దేజరిల్లడూ శూన్యమాయె లోకంబెల్లన్! 9

పుత్రులకును మఱి తల్లిదండ్రులకు బొలుపుగ నాసక్తియు దగ్గెన్!
పతులకు బత్నుల విషయంబున మఱి పరమాసక్తియు లోపించెన్!
సోదరులును మఱి యట్లే యైరీ యాదర మింతయు లేకయునూ!
సకల జనంబులు సకలము విడిచిరి సదా రాముని చింతనతో ! 10

రాముని మిత్రులు దుఃఖ భారమున రమ్య కర్మలను త్యజియించీ!
తమ శయనంబుల వీడక యుండిరి తగ చీకటిని స్మరించుచునూ!
రాముడులేని యయోధ్య నగరము రహి పర్వత వన భూమి వలెన్
ఇంద్రుడులేని స్వర్గంబును వలె చంద్రుడు లేనీ రాత్రివలే
దప్పియుండెను సాకేతము గజాశ్వములునూ రోదించెన్! 11

(అయోధ్యకాండమున-41వ సర్గము సమాప్తము)

* * *

## నలుబదిరెండవ సర్గము

దశరథుడు నేలపైబడి రామునికై విలపించుట — కైక గృహమును వీడి దశరథుడు కౌసల్యా గృహమున కేగుట. అచ్చట గూడ రామునికై దుఃఖము అనుభవించుట.

రాముడు రథమున బోవుచుండగా రథమ్ము పరాగము జూచుచునూ!
దృష్టి మఱల్పక జూచుచుండె నట దృష్టినిలిపి యా దశరథుడున్!
ధార్మికుడగు నా దశరథేశ్వరుడు దగ నటు జూచుచు నుండగనూ!
ఆనందము గలిగింప బరాగము నలరి పెరిగినట్లుండె నటన్! 1

రాముడు రథమున బోవుచుండగా రాముడు గనబడు నంతకునూ!
తెప్పవాల్పకను జూచుచుండె నట భువి నిలిచి తన దారులతో!
ప్రియ పుత్రుని దా చూచుచున్నపుడు ప్రేమమీర యరదము పైకిన్!
అధికమైన దూరము సృజించినటు యా ధరణియు నున్నటు లుండెన్! 2

రథ పరాగమును మాసిపోయె నా రథి దశరథుని వెనువెంటన్!
విషణ్ణవదనుండై యార్తుడునై విలవిల ధరపై బడిపోయెన్!
దశరథేశ్వరుడు ధరపై బడగా దగ కౌసల్యయు గైకయునూ!
కుడి యెడమలకును జేర వచ్చిరి దురితము నెత్తగ దశరథుని !

నీతి ధర్మ వినయములను గూడిన నిర్మల మూర్తియు దశరథుడున్!
వ్యథితేంద్రియుడై కైకను జూచుచు గటువు మాటలకు నిటులనియెన్!
కైకేయీ! ఓ దుష్టచారిణీ! రదను కొమ్ము! నను ముట్టకుమూ !
నిను జూచుట నా కిష్టము లేదూ! నీవు భార్య, బంధువు కాదూ !

నీకును మఱి నీ బంధువులకునూ నే నేమియు కాదే కుటిలా!
అర్థమునం దాసక్తి గలుగు నిను సద్ధర్మముగ త్యజించితినీ
అగ్నిసాక్షిగా బరిణయ మాడితి యట్టి సర్వమును నొదిలితినీ!
ఇహపరముల సంబంధమునంతను నిపుడె త్యజించుచు నున్నాడన్!

అక్షయమగు నీ రాజ్యము జూచి యా భరతుడు సంతసమందన్!
పితృకార్యముల జేయ ననర్హుడు శత్రువుగను నే భావింతున్!
నేలపడిన యాదశరథ రాజును నేల నుండి పైకెత్తియునూ!
శోక కర్శితయు నగు కౌసల్యయు శోకముతో గృహమున కేగెన్! 6

ధర్మాత్ముండగు దశరథేశ్వరుడు దగ రాముడు ముని వేషమునన్!
వనవాసము బోవుట మది తలచి ననయము జెందుచు దాపమునూ!
బ్రహ్మహత్య జేసిన వాని వలెన్ బరగ నిప్పు బెట్టిన రీతిన్! 7

రథమార్గంబును దిరిగి జూచుచును రహి దశరథు నాకారంబున్!
రాహు గ్రస్తమగు సూర్యుని పోలిక రహి ప్రకాశ హీనంబయ్యెన్!
ప్రియపుత్రుని మదిలో స్మరియించుచు ప్రేమమీద శోకించె మదిన్!
పుత్రుడు నగరము దాటెనంచు విని బోరున నిటులను విలపించెన్! 8

రాముని గొనిపోయిన యశ్వము లా రమ్య జాడలవి గననయ్యెన్!
కాని మహాత్ముడు రాముడు మాత్రము గంటి కగుబడుట లేదుగదా!
శ్రేష్ఠుడైన నా రాముడు బురమున శ్రేష్ఠమైన చందనములతో
వింజామరలను వీచు చుండగా విమల దలగడల నిద్రించెన్! 9

అట్టి రాముడిపు డరణ్యమూలలో నాశ్రయించు దరునీడలనూ!
ఉపధానంబుగ చేసికొనును దా యుర్విని శిలలను గాష్ఠములన్! 10

దీనుడైన రాముడు దూళులచే దీనముగ నిట్టూర్చుచునూ!
ప్రస్రవణపు గిరినుండి లేచినా ప్రబల గజమునకు వలె లేచున్!
లోకనాథుడగు రాఘవు దంతట లోలత దీనత నందగనూ!
వనచరులందఱు గాంచెద రప్పుడు వన్నెలు దఱిగిన శ్రీరామున్! 11

సుఖముల దేలిన జనకుని కూతురు చోద్యముగా వనిబోవుచునూ!
కంటకాక్రమణ క్లాంత చింతయై గడు దుఃఖము నొందుచు నుండున్!
అడవులజూడని జానకి యిప్పుడు నాకసమంటెడి వృక్షములన్!
క్రూరమృగంబుల శబ్దము వినుచును గ్రుంగిపోవు భయ భీతులతోన్! 12

కైకేయీ! నీ కోరిక దీరెను గమ్మగ నేలుము రాజ్యంబున్!
పురుషశ్రేష్ఠుడు రాముడు లేకను బొందుగ జీవింపగ జాలన్!
ఈ విధముగ విలపించుచు రాజును యింతనరానీ శోకముతో
జనసముదాయము తోని గూడికొని తన రాణులతో నడుచుచునూ! 13

మృతి స్నానంబును జేసినవాడును గతిదప్పిన దన గృహముననూ!
ప్రవేశించినటు నా దశరథుడును బ్రవేశించె దన పురముననూ! 14

అట్టి సమయమున యయోధ్య నగరము నిట్టె చిన్నబోయెను జింతన్!
చతుష్పథంబులు జనమధ్యంబులు జనశూన్యంబై యుండెనటన్
అంగళ్లను దేవాలయంబులును సంగతి మూతలు బడియుండెన్!
జనులందఱు బహు శోకాన్వితులై కన వినరానీ గతినందెన్! 15

రాజమార్గములు బాడుపడియె నట రమ్య శోభలవి నశియించెన్!
మూల్గుచుండె నా నగరమంతయును మూర్ఛనొందెనా యను నటులన్!
ఆ నగరంబును జూచి దశరథుడు నా రాముని స్మరియించుచునూ!
సూర్యుడంబుదము బ్రవేశించినటు సూటిగ తనగృహమును జొచ్చెన్!
రామలక్ష్మణులు సీతయులేనీ రహి చెడి యున్నా సదనంబున్!
దీపములేనీ గృహము జేరినటు బాపము జేసిన వాని వలెన్! 16

అటుపిమ్మట నా వసుధాధిపుడునూ బటు శోకంబున విలపించీ!
మృదు మందార్థములైన వచనముల మది పొంగగ యిటులను బలికెన్!
రాజమాత కౌసల్య గృహమునకు రయమున నను గొనిపొండిపుడున్!
నా హృదయమునకు శాంతి గలుగదూ! నయముగ మఱి యెచ్చట నైనన్!
రాజుమాట విని ద్వారపాలకులు రహి కౌసల్యా సదనమునన్
వినయపూర్వకము బరుండ వెట్టిరి విమల శయ్యపై భద్రముగన్! 17

కౌసల్యా గృహమందు నుండినను గమ్మని శాంతిని బొందిననూ!
ఆ దశరథునీ హృదయ మంతయును సలత కలతలను నొందినదీ!
పుత్రద్వయమును, కోడలు సీతయు బోలుపుగ లేనీ యాగృహమున్!
నష్ట చంద్రుడగు నంబరమును వలె గష్టముతో రాజును గాంచెన్! 18

మహావీరుడగు నా దశరథుడును మానుగ యా సదనము గాంచి!
అయ్యో! రామా! నను విడిచితివా! యనుచు బిగ్గఱగ శోకించెన్!
పదునాల్గేడులు గడుచు వఱకునూ పన్నుగ జీవించెడి, వారున్
తిరిగి వచ్చు శ్రీరాముని గాంతురు జేరి కౌగలింతురు ప్రీతిన్!
అయ్యో రామా! యట్టి సుభాగ్యము నందలేను గద! జీవించి! 19

అంతట రాజుకు కాలరాత్రివలె చెంత నిలిచె నా రాత్రియునూ
మధ్యరాత్రి కౌసల్యను బిలిచి మానుగ పలికెను గద్గదికన్! 20

కౌసల్యా రామునితో బోయెను గలత నంది నా దృష్టియునూ!
మఱల తిరిగి రాకున్నది నీవును మానుగ కనిపించుట లేదూ!
నను స్పృశింపుమా! నీ హస్తమునను నాకు శాంతి గలిగెడి విధమున్! 21

శయనముపైని బరుండియు గూడను జలించు నా దశరథుగాంచి!
హస్తముతో నాతనిని స్పృశించుచు నపరిమితంబగు దుఃఖముతో!
సమీపమున గూర్చుండి కౌసల్య చక్కని రాముని రూపంబున్!
కన్నులలోపల నిలుపుకొనుచు మఱి కడు నిట్టూర్పులతో నేడ్చెన్! 22

అయోధ్యాకాండములో 42వ సర్గము సమాప్తము

★ ★ ★

## నలుబది మూడవ సర్గము

### (కౌసల్యాదేవి విలాపము)

అంత కౌసల్య పుత్రశోకమున జింత జేయుచును దుఃఖితుడై
కృశించియున్నా దశరథు గాంచి స్మరించుచును దానిటు లనియెన్!
సర్ప స్వభావము గల కైకేయీ సర్వశ్రేష్ఠుడగు రామునిపై!
విషమునాటినది యికపై కుబుసము విడిచిన ఫణివలె వర్తించున్! 1

రాముని వనికిని బంపి కైకకును రమ్యగోర్కె నెఱవేరెగదా!
ఇక నను వేధించును యత్నంబున యింట నున్న సర్పము వోలెన్!
రాముని దాసునిగా జేసినచో రహి బాగుండెడిదియును గదా!
గృహ గృహమున భిక్షాటన జేయుచు గేహమునం దుండెడి వాడున్ 2

కైక యనుమతిని రాము ద్రోసితివి కడకు క్రిందపడు నట్టులుగా!
అహితాగ్నిని పర్వమున దేవతల కర్పించెడి యా హవ్యంబున్!
రాక్షసులకు నర్పించితి విప్పుడు రమ్య మంత్రముల జరుపుచునూ!
రాముని రాజ్యము భరతుని కిచ్చి రాముని యడవికి బంపితివి! 3

వీర ధనుర్ధరుడైన రాఘవుడు వీర ధనుర్ధరు లక్ష్మణుతో!
సీతను గూడుక యరణ్య మందున జేరియుండు నిది నిశ్చయమూ!
రామలక్ష్మణులు సీతా దేవియు రహి కష్టంబుల నెఱుగరుగా!
అట్టి వారలను నడవి కంపితివి యిట్టి కష్టముల బడుదంచున్!

అనుభవింప వలసిన కాలమున యనుభవ రహితుల జేసితివి!
కంద మూలముల ఫలముల దినుచును గాఢవుల నెటు గడుపుదురో!
సీతాలక్ష్మణులను గూడికొని శ్రీరాముడు నిటు కొచ్చెడినో!
శోకక్షయము మంగళప్రద కాలము జూచెదనా మఱి యెప్పుడైనన్? 5

వీరులైన యా రామలక్ష్మణులు వేగ రాగ నీ పురజనముల్!
ఎత్తిన ధ్వజ తోరణముల నెప్పుడు నెత్తుగ యెగురగ వేసెదరో?

రామలక్ష్మణులు రాగజూచి యీ రమ్య నగరమం దంతటనూ!
పర్వమందు సంద్రంబునకును వలె పర్వులెత్తి యుప్పొంగు నాకో! 6
మహాబాహువులు గల శ్రీరాముడు మానుగ వృషభము గోవు వలెన్!
సీతను రథమం దుంచుకొనుచు మఱి శీఘ్రము వచ్చునా యయోధ్యకున్?
శత్రు భయంకరులైన కుమారులు చరచర యయోధ్య కొచ్చెదరో?
వేలకొలది జనములు సంతసమున విరులు లాజలును జల్లెదరో! 7
కుండలముల ధరియించి సోదరులు గూడిన యాయుధముల తోడన్!
పర్వత సముఁగు రామలక్ష్మణులు ప్రవేశింప బురి గాంచెదనో?
కన్యలకును మఱి ద్విజోత్తములకును కమ్మని ఫలములు బుష్పంబుల్!
పంచిబెట్టుచును బ్రదక్షిణంబును బరగ జేయగను జూతునాకో? 8
ధర్మజ్ఞుడు శ్రీరామచంద్రుడును దగ బుద్ధిని మఱి వయస్సుచేన్!
పరిణత బుద్ధిని గలవాడగుచును బన్నుగ నా యెదుటను నిలుచున్!
మూడేండ్లును గల బాలకు డగుచును మురిపెముగా నాడుచు నెదుటన్!
నన్నానందింపగ జేయునొ కద చిన్ని కూనగా గన్నులకున్? 9
బూర్వజన్మమున వీరుద! విను! నే పొదుగుల గోసితి గోవులకున్!
పాలుద్రావ దలచిన వత్సములను బరాభవించితి నిక్కముగా!
పాపఫలము నే దనుభవించుచును బన్నుగ యుంటిని నే నిటులన్!
పుత్రులనుండియు వేఱు బడుచునూ! బుట్టెడు దుఃఖములో మునిగీ! 10
ఎంత ప్రేమ వత్సముపై గోవుకు నంత ప్రేమ రాముని యందున్!
సింహము వత్సము హరించి నటులను శ్రీరాఘవు కైకయు గొనియెన్!
సద్గుణంబులకు నిధి యగు రాముడు సర్వశాస్త్రముల బారగుడున్!
అట్టి రామునీ విడిచి యుండి నే గట్టిగ బ్రతుకగ జాలనుగా! 11
మహాబలుడు వీరుండును నగు నా మహాతేజు శ్రీ రాఘవునీ!
చూడకుండ నే నిలువజాలనూ! వీడకుండ నా ప్రాణములన్!
పుత్ర శోకమున గలిగిన యగ్నియు పూర్ణ హుతాశను జ్వాలలునూ!
గ్రీష్మకాలమున భాను తేజమున భీష్మ కిరణముల వేడిమిచే
భూమినంతటిని కాల్చివేయునటు బొలుపుగ నా తనువంతటినీ!
ప్రజ్వలింప జేయుచు నున్నది ప్రభు! బ్రతుకజాల నొక క్షణమైనా! 12

అయోధ్యాకాండములోని 43వ సర్గము సమాప్తము

# అయోధ్యకాండము-ప్రథమ భాగము

## నలుబది నాల్గవ సర్గము

[సుమిత్రాదేవి కౌసల్యాదేవిని యోదార్చుట]

ఈవిధి విలపించెడు కౌసల్యను నింపుగ మృదువుగ సుమిత్రయున్!
ధర్మ సమ్మతముగా నిటు పలికెను ధార్మిక నీతి సుయోక్తులతోన్!
సద్గుణవంతుడు బురుషోత్తముడును సకల జనుల ప్రియ పాత్రుండున్!
అట్టి మహాత్మునికై విలపించెదు నందఱి వాడుగదే యతడున్! 2

పూజ్యురాల! నీ పుత్రుడు రాముడు బొలుపు౹౹ ధర్మజ్ఞుడు బలుడున్
తండ్రి వచనముల సత్యము జేయగ తరలిపోయె వనభూములకున్!
శిష్టులందఱును నాచరించినది స్థిరముగ మరణానంతరమున్!
ఫలమునిచ్చు నా ధర్మమార్గమున బరగ నీ సుతుడు నిలువబడెన్!
అట్టివానికై యలసత జెందుచు నిట్టి దుఃఖ మందగ నేలా?

సర్వభూతములు దయగల వాడును సర్వలక్షణుడు లక్ష్మణుడున్!
రాముని యందభిమాన భక్తునిగ రమ్యరీతి వెంటనె యుండెన్!
సుఖముల దేలిన సీతయు గూడను దుఃఖములను వని నెఱుగుచునే
నీరాముని వెంటనె యున్నది గద! యారామునికిని నీడగనూ! 3

ధర్మ సత్యవ్రత ధర్మంబుల గొని సత్య నిరతుడై యీ జగతిన్!
కీర్తిపతాకను నెగురవేయగా యార్తినొంద నీ కేమిటికిన్?
పొందని సత్ఫలితము లేవో మఱి చందము దెలుపుము కౌసల్యా!
పురుషోత్తమునీ కంటిని కడుపున బోరున దుఃఖం బది యేలా? 4

రాముని శీల మహాత్మ్యము దెలిసీ రవియును దన కిరణంబులచే!
తపియింపగ జేయడు శరీరమును తథ్యము! నే దెలిపిన వాక్కున్!
శయనించిన రాముని జంద్రుండును చల్లని కిరణంబుల ప్రేమన్!
తండ్రివాలె ప్రీతిని గౌగిలిలో గమ్మని యానందము నిచ్చున్! 5

శంబరాసురుని పుత్రుని జంపెను అంబముహిషు జంపిన రీతిన్ !
రామున కిచ్చెను బ్రహ్మ సంతసిలి రమ్యాస్త్రములను దీవెనతో!
అట్టి రాము దడవులలో నుండిన యెట్టి యపాయము లేకుండన్!
ఇంట వసించిన రీతి యుండు వని వెంట దైవశక్తియు నుండున్! 6

రామబాణమున శత్రువు లందఱు రయమున నేలను గూలుదురున్!
అట్టి రామునికి ధాత్రి యంతయును నిట్టె వశము గాకెటు లుండున్?
శ్రీ, శౌర్యము, కల్యాణ సత్త్వములు స్థిరముగ నున్నవి రామునిలో!
పినివలన వనవాసము జేసియు వేగ రాగలడు నిచ్చటకున్! 7

రవికి రవికి వలె యగ్నికి నగ్నిగ ప్రభునకు ప్రభువుగా నుండున్!
శ్రీకి శ్రీకివలె కీర్తికి కీర్తిగ క్షమకు క్షమకు వలె నతనుండున్!
దేవతల, మఱి దేవత వలెనూ భూతములకు భూతము వోలెన్!
నుండురామునకు నిందు నందునను మెండుగ భయ మది యేముండున్?8

పృధివితోడనూ జానకితోడను బొలుపుగ శ్రీలక్ష్మి తోడన్ !
ముప్పురితోడను శ్రీరాఘవునకు మోదముతో నభిషేక మగున్! 9

వనమున నేగెడి రాముని గాంచీ! జనులందఱు నీ యయోధ్యలో!
కన్నీటిని మఱి జలజల రాల్చిరొ పెన్నడవికి కుశ చీరలతో!
రహి నేగెడి రామునితో సీతగ రాజ్యలక్ష్మియును నేగినదో!
అట్టి రామునీ పొందజాలనిది యిట్టి ధాత్రి మఱి యేముండున్? 10

ధనుర్ధరుడు లక్ష్మణుడు స్వయముగా బాణ ఖడ్గములు ధరియించీ!
రాముని ముందుగ నడుచుచుండగా రాముని కేమిక దుర్లభమూ?
వనవాసంబును బూర్తి జేసికొని వచ్చు నింక మన రాఘవుడున్!
చూడగలవు శోకమును మానుమా! వీడు మోహమును గౌసల్యా! 11

కల్యాణీ! కౌసల్యా వినుమా! కడు ప్రసాదమున నీ సుతుడున్!
తల్లివైన నీ పాదంబులకును దన్మయమై మ్రొక్కుచు నుండన్ !
ఉదయించిన చంద్రునివలె నాతని సదయుని పుత్రుని గనుగొనుచున్!
ఆనందంబున దేలియాడుదువు నభిమత కోరిక దీరంగన్! 12

పునఃప్రవిష్టుండైన రాముని స్ఫూర్తిని గాంచుచు గౌసల్యా!
అభిషిక్తుండగు బుత్రుని గాంచి యానందంబున దేలుదువూ!
అమంగళం బేమియు గలుగదు నూ! యారని దుఃఖము నందకుమా!
సీతాలక్ష్మణులను గూడికొని శ్రీరాముని వే గాంచెదవూ!. 13

అందఱ నోదార్పగ గల దానవు దందల మంచుచు సీ విటులన్!
జెందుచు దుఃఖము మది వికలముగా గందగ జేయుట యిది తగునా?
రామునివంటి కుమారుని గని రహి శోకించుట తగదు సుమా!
రాముని బోలెడు రమ్యగుణుడు ధర రహిలేడు గదా శోధింపన్! 14

మిత్రుల తోడను వచ్చి కుమారుడు మేల్మి వందనము లర్పింపన్ !
వర్షకాల మేఘముల పంక్తివలె హర్షింతువు హర్షాశ్రువులన్ !
వరముల నీ గల సమర్థుడగు నీ వర పుత్రుడు నీ పదములమా!
మెత్తని కరముల స్పృశింప గలుగును జిత్తము భక్తిని బొంగారన్! 15

మిత్రుల తోడను రామచంద్రుడును మేల్మి యంజలిని గావింపన్ !
మేఘపంక్తి పర్వతము దడిపినటు మిగుల దడుపుదువు హర్షమునన్ !
మాటలచే నుపచారము జేసెడి మంచి మనసు గల సుమిత్రయున్!
ఇట్టి వాక్యములచే పచరించెను నింపుగ కౌసల్యా సతినీ: 16

అల్పమైన యుదకము గల మేఘము నా శరత్తునను బుట్టినదీ !
తనకు దానె యుదకము హరించినటు దగ కౌసల్యము లోలోనే!
కన్నీళ్ళను మఱి కరుణ వేదనను కమనీయముగా దనయందున్!
అంతర్లీనము జేసికొనెను మది యింతి సుమిత్రా వచనములన్! 17

అయోధ్యాకాండము 44వ సర్గము సమాప్తము

* * *

## నలుబదియైదవ సర్గము

(శ్రీరాముడు పౌరులతో అయోధ్యకు మఱలిపొండని దెలుపుట-వృద్ధ బ్రాహ్మణులు శ్రీరాముని మఱల నయోధ్యకు రమ్మని గోరుట, రాముడు వారలతో తమసా నదీ తీరమును జేరుట.)

సత్య పరాక్రముడైన రాఘవుడు సరగున వని బోవుచునుండన్!
ప్రేమమీర పురి పౌరులందఱును బ్రీతి ననుసరించిరి రామున్!
దశరథుండు మఱి మిత్రవర్గమును దగ వెనుకకు బో నంపిననూ!
ప్రజలు వెనుకకును మఱలకపోయిరి పరగ ప్రీతిచే రామునిపై! 1

గుణసంపన్నుడు రామచంద్రుడును గూరిమి పౌరుల కందఱకున్!
పూర్ణచంద్రువలె నిష్టుం డాయెను బొలుపుగ సురుచిర సేవలచే !
ప్రజలందఱు బ్రార్థించిన వినకను బ్రేమమీర యౌదార్యచునూ!
తండ్రివచనమును నిజము సేయగా దరలి పోవ వని మది నెంచెన్! 2

రాముడంత ప్రజ సంతానంబుగ రహి గాంచుచు నిజ నేత్రములన్!
త్రాగివేయుచున్నటుల స్నేహమున దగ బలికెను నిటు మధురముగా!
అయోధ్యవాసులు! మీ రందఱునూ యలరు ప్రేమ గౌరవములనూ!
భరతునిపై జూపుడు! నటుజేసిన బహుప్రీతిని నే బొందుదునూ! 3

మంగళకరమగు చరిత్ర గలిగిన మహితాత్ముడు శ్రీ భరతుండున్!
హితమును, క్షేమము గలుగజేయు నిక ప్రీతిమీర మీ కందఱకున్!
జ్ఞానవృద్ధుడును వయస్సు నందున బాలుడు భరతుడు సద్గుణుడున్!
తగిన ప్రభువుగా ధర బాలించును దగ శుభములను సమకూర్చున్! 4

రాజగుణుడు శ్రీ భరతు డయోధ్యను రాజుగ నియోక్తుడైనాడున్!
దశరథు నాజ్ఞను బాలింపగ వలె దగ మీరును, నేనును, నితరుల్!
సంతసమును గలిగింప గోరుచో గాంతారము నే జనినంతన్ !
రాజు దుఃఖమును బొందకుండునటు రహి జూడుడు సంతోషింతున్! 5

రాము డీ విధము ధర్మమునందున రహి నిలిచెనా దృఢ నిశ్చలతన్!
ప్రజ లా విధముగ రాముని రాజుగ రహి గోరిరి దృఢ నిశ్చలతన్!
లక్ష్మణ సహితుండగు శ్రీరాముడు లాలితముగ నిటులను ప్రజలన్!
కన్నీటిని యొలికెడి యా పౌరుల చెన్నుగ గాంచెను సంప్రీతిన్! 6

జ్ఞానముజేతను వయస్సు జేతను తేజము జేతను వృద్ధులునూ!
వార్ధక్యముచే శిరసులు వణుకగ వాసిగ బలికిరి బ్రాహ్మణులున్!
'అశ్వములారా! ముందుకు బోకుడు! నలరి రాముగొని పోవకుడూ!
వెనుకకు మరలుడు నయోధ్య వైపుకు వేగము హితమును జేయంగన్! 7

చెవులుండును జంతువుల కన్నిటికి జెవులుండును మీకును మిగులన్!
గ్రహణశక్తి మిక్కుటమై యుండును గ్రహియింపుడు మా ప్రార్థననూ!
ధర్మజ్ఞుడు మీరుడు శ్రీరాముని దగగొని రావలె పురమునకున్!
పురమునుండి వని గొనిపో ధర్మమ? పూని జేసి మము దుఃఖితులన్! 8

ఈ విధముగ యా వృద్ధ బ్రాహ్మణుల నింపగు విలాప మాలించీ!
ద్విజుల మాటవిని రామచంద్రుడును దేరు దిగెను గడు వేగముగా!
సీతాలక్ష్మణ సమేతుండు నగు శ్రీరాముడు నడుచుచుబోయెన్!
వృద్ధ బ్రాహ్మణుల నభిముఖుండునై శ్రద్ధాభక్తుల గూడి కొనీ!

రథము వెంట నా వృద్ధబ్రాహ్మణులు రయమున వచ్చుట గమనించీ!
వారిని విడిచీ ముందుకు బోవగ వలనొప్పగ మనసొప్పకనూ!
వృద్ధబ్రాహ్మణుల కెదురుగ వచ్చెను సిద్ధ హస్తుడై యంజలినీ!
రాముని గాంచీ బ్రాహ్మణు లందఱు రహి శోకముతో నిట్లనిరీ!

బ్రాహ్మణులందఱు వచ్చుచుండి రదె బ్రాహ్మణ హితుడవు నీతోడన్
అగ్నులు గూడను మా మూపులపై యనుసరించె మాతో గూడన్!
వాజపేయ యాగమున లభించిన వాసిగ తెల్లని ఛత్రములన్!
మా వెనుకను వచ్చినవి కనుగొనుము మహిమాన్వితమగు ఛాయలత

ఛత్రము లేకను జనుచుండిన నీ చారుకాంతియుత శిరసుననూ!
శ్వేతఛత్రమున నీడ నిచ్చెదము జెదిరిపోవ రవి తాపంబున్!

తాత! రామ! మా బుద్ధెల్లపుడును దగ వేదంబులపై నుండున్!
అట్టి మా మనసు నిపుడు నీ కొఱకు నడవుల గోరుచు నున్నదిగా! 12

ఉత్తమంబగు వేదము లన్నియు చిత్తములందున నివసించున్!
మా భార్యలు చారిత్ర రక్షితలు మానుగ నుందురు గృహములలో!
నీ వయోధ్యకును దిరిగి రావలెను నిర్ణయించితిమి నిక్కముగన్!
వేఱు నిర్ణయము జేయబోకుమా! వేగ మఱలుమా ధర్మముగన్! 13

నేల దుమ్ము నంటిన హంసలవలె దెలనగు కేశంబులు గలుగన్!
శిరసులతో బ్రార్థించు చుంటిమీ! శీఘ్రము మఱలుము వెనుకకుమా!
వచ్చిన వారము బహు బ్రాహ్మణులము హెచ్చుగ యజ్ఞ సుయాగములన్!
ప్రారంభించితి మవి ముగియుట మఱి పరగ నీవు దిరిగొచ్చిననే! 14

స్థావర జంగమ భూతము లన్నియు శ్రద్ధాభక్తి ప్రపూర్ణములై!
నిన్ను బ్రార్థనలు సేయుచున్నవి నీవు స్నేహమును జూపు మికన్!
వాయువేగమున లేచిన తరువులు వాసిగ నీతో రాలేకన్!
కుములుచున్నవి శోకము తోడను గూరిమి జూచుచు నీవైపున్! 15

పక్షులు గూడను జేష్టలు మానీ వృక్షంబులపై గూర్చొనియున్!
సకల భూతముల జాలిగలుగు నిను వికలముగా బిలుచుచు నుండెన్!
రాముని వెనుకకు మఱల్ప ద్విజులును రహి యాక్రోశించుచు నుండన్!
తానుకూడ మరలింప దలచినటు తమసా నదియును నడ్డొచ్చెన్! 16

సుమంత్రు డంతట రథమును నాపెను సుందరమగు నా గుఱ్ఱములన్!
శీఘ్రముగా దొరలించి నేలపై శీఘ్రము నీటిని ద్రావించెన్!
శరీరంబులను గడిగి గుఱ్ఱముల చల్లని పచ్చిక బయలందున్!
తమసానది తీరమున మేపె దా దగు నందముగల ప్రకృతిని! 17

(అయోధ్యకాండమున-45వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## నలుబది యాఱవ సర్గము

(శ్రీరాముడు సీతా లక్ష్మణ సమేతుడై తమసానదీ తీరమున నిదు రించుట — అయోధ్యను గుఱించి చింతించుట — పురవాసులు నిదు రించు చుండగా వారిని విడిచి యరణ్యము వైపు బోవుట)

రాము డంతటను దమసా దీరము రమ్య సుందరత దర్శించెన్!
సీతను గాంచీ లక్ష్మణు తోడను జెలువుగ బలికెను రమ్యముగా!
లక్ష్మణ! మనము బంపగ బడితిమి లాలిత సుందర వనమునకున్!
వనవాసములో మొదటి రాత్రి యిది! వాసిగ భయమును జెందకుమా! 1

పక్షులు మృగములు జేరవచ్చినవి తమ తమ తావులకును నిపుడున్!
శూన్యమైన యీ యరణ్య మంతయు శోకించునటుల నున్నదియున్!
అయోధ్యలో నీ స్త్రీ పురుషులునూ యడలుచుంద్రు మనలను దలచీ!
విడివడి వచ్చిన యందులకును బ్రజ వేడి వేడి నిట్టూర్పులతో! 2

అనేక గుణముల బట్టి రాజుపై నలరుచు నాపై నీపైనన్!
భరతునిపై శత్రుఘ్నుని పైనను బహు ప్రీతియు బ్రజకును గలదూ!
తండ్రియు తల్లియు శోకింతురు బహు దగ నా కొఱకును జింతిలుచున్!
అంధులగుదురేమో యను జింతను గుందుచున్నదీ నా మనసూ! 3

ధర్మాత్ముడు భరతుండు నిశ్చయము ధర్మార్థములగు వాక్యములన్!
తల్లిదండ్రులను భక్తి శ్రద్ధలను దగ నాశ్వాసించుచు నుండున్!
భరతుని మంచి తనంబును గూర్చియు బలు విధములుగా యోచింపన్!
తలిదండ్రుల విషయంబున చింతయు దగ గలుగుట లే దింతయునూ! 4

మంచి జేసితివి! లక్ష్మణ! నీవును మానుగ నాతో వెడలితివీ!
సీతను రక్షింపగ సాయంబును స్థిరముగ యుండగ వలయుగదా!
ఈ రాత్రిని వే నుదకము జేతను నింపుగ గడుపుదు నిర్మలతన్!
అనేక విధముల వన్య వస్తువులు నొనరగ దొరుకుచు నుండిననూ! 5

రాముడు లక్ష్మణుతోని జెప్పి యిటు రహి సుమంత్రుతో నిటులనియెన్!
ఓ సౌమ్యుడ! ఓ సూత సుమంత్రా! నొప్పుగ యశ్వములను గనుమా!
అంతట సూర్యుడు నస్తమించెనూ చెంత మేసెడీ యశ్వములన్!
గట్టివేసి యాసూత సుమంత్రుడు కమ్మని పచ్చికలను వేసెన్! 6

సంధ్యోపాసన జేసి సుమంత్రుడు చక్కగ రాముడు లక్ష్మణుకున్!
శయనంబును నేర్పాటుల జేసెను చక్కని తమసా తీరమునన్!
తమసా తీరమునందు రాముడును దగ యాకుల యా శయనముపై
సీతాసమేతుడై శయనించెను జిత్రమైన ప్రకృతి యొడిలోన్! 7

సీతారాములు శయనింపగ గని శ్రీరాముని బహు గుణంబులన్!
సూత సుమంత్రునకును వర్ణించెను సుందర మధుర సువాక్యములన్!
తమసా తీరమునందు లక్ష్మణుడు దగ వర్ణించుచు నుండగనే
రాత్రిభగవతీ గడిచిపోయినది రవి యుదయించెను దూరుపునన్! 8

ఆ రాత్రిని శ్రీరామచంద్రుడును నా ప్రజతోడను, గోవులతో
ఆ తమసానది కల్లంత దూరము నలరుచు వసించె విశ్రాంతిన్!
మహాతేజుడగు రాముడు లేచీ మానుగ ప్రజలను నటు జూచీ
శుభలక్షణుడగు లక్ష్మణుతోడను శుభ యోచనతో నిటు లనియెన్! 9

లక్ష్మణ! జూడుము! పౌరు లందఱును లలిత బంధముల విడనాడీ!
ప్రేమతోని మనతో నిట కొచ్చిరి ప్రీతి బరుండిరి తరునీడన్!
వెనుకకు మఱల్ప శక్యము గాదిక వేగము ప్రాణములను విడువన్!
నిశ్చయించెదరు గావున మన మొక నిర్ణయంబు జేయగ దగునూ! 10

ఈ పౌరులు మేల్కొను లోపుగనే నింపుగ మనమును సరదముపై!
ఎట్టి భయంబును లేని మార్గమున గట్టిగ బోదము నిపుడిపుడే!
ఇటుజేసినచో నయోధ్య పౌరులు నీ విధి తరువుల నీడలలో!
నిదురించెడి యా యవసర ముండదు మది దుఃఖించెడి యవసరమున్! 11

పౌరుల దుఃఖము దొలగింపవలెను ప్రవిమల రాజకుమారులునూ!
స్వయముగ పురవాసులకును దుఃఖమును నయముగ జేయగ రాదునుమా!
అని పలుకగ రాముడును లక్ష్మణుడు అన్నతోని యిటులను పలికెన్!
నీవు జెప్పినది బాగున్నది సూ! నీతివంతమని బలుకంగన్! 12

ధర్మజ్ఞుడు రాముడు సుమంత్రుతో దగ నిటు పలికెను మందముగా!
సుమంత్ర వేగము రథమును గట్టుము! సూటిగ నరదము బోనిమ్మా!
ఈ ప్రదేశమును వీడుద మిప్పుడు నీ పౌరులు లేవకముందున్!
తిగిరిపోయెదరు నయోధ్య కప్పుడు తీరని నిరాశ మేఘములన్! 13

అంతట సారథి త్వర నశ్వములను చెంతనున్న రథమును గట్టెన్!
రథము సిద్ధమని రామచంద్రునకు రయమున జెప్పెను సుమంత్రుడుని!
మహాబాహూ! రామా! యిక నెక్కుము! మానిని సీతయు లక్ష్మణుడున్!
భద్ర మగుత మీకును వనమునకును భద్రమగుత! పురి యయోధ్యకున్! 14

అంతట రాముడు పరికరములతో జెంతనున్న యరదము నెక్కెన్!
భూపుత్రియు, లక్ష్మణుడు నెక్కెనూ భూరి వస్తు సముదాయముతో
సుడులతోని శీఘ్రముగా బోయెడి సుందర తమసానది నపుడున్!
దాటిరి రాముడు సీత లక్ష్మణుడు దగ రథంబునను గూర్చుండి! 15

తమసానదినీ దాటి వారలును దగ మంగళకర మైనదియున్!
మహా మార్గమున పయనము జేసిరి మాధుర్యము జిందగ వారున్!
కొంత దూరమటు బోయిన పిమ్మట చింతతోని సూతుని తోడన్!
రథము నాపుమని పలికి మఱల నిటు రయముగ పలికెను నాతురతన్! 1

సూత! సుమంత్రా! రథమును నెక్కి సురుచిరముగ యుత్తరమునకున్!
కొంతదూర మటుబోయి మఱలుమా! వింతగ ద్రిప్పుము నరదమునూ!
ఎటువోయినదీ వివరింపకుమా! పటు జాగ్రతలను గైకొనుమా!
నా విషయము పౌరులకు దెలుపకుము! నయముగ వత్తురు వెనువెంటన్! 1

సుమంత్రు డంతట రాము నాజ్ఞలను సురుచిరముగ నటు గావించి!
తిరిగి వచ్చి యరదము సిద్ధమని దీరుగ పలికెను రామునితో!
సీత తోడుతను రామలక్ష్మణులు శీఘ్రము నెక్కిరి యరదముపై
సుమంత్రు డంతట దోలె నశ్వముల శుభద తపోవన మార్గమునన్! 18

అంత సుమంత్రుడు నా యరదంబును గొంతదూర ముత్తరమునకున్!
మంగళకరమగు నిమిత్తములకై రంగుగ నా విధి నడిపించెన్!
మహారథుండగు రామచంద్రుడును మఱి సారథితో గూడికొని!
రథమునెక్కి యా తపోవనికినీ రయమున బోయెను వసియింపన్! 19

(అయోధ్యాకాండములో 46వ సర్గము సమాప్తము)

## నలుబదియేడవ సర్గము

[అయోధ్యాపురవాసులు ఉదయమున లేచి రాముని గానక విలపించుట-
అయోధ్యకు నిరాశతో మరలిపోవుట]

తెలవారగ నా పౌరులు రాముని తేరిజాడ లేకుండుటనూ!
శోకముచే బరివేదన జెందిరి సుందర రాముని గనలేకన్!
దుఃఖాశ్రువులను ధారలు గట్టుచు దూరప్రాంతముల గనుగొనిరీ!
రాముని జాడలు గన్పడలేదూ! రమణి సీత లక్ష్మణులయినూ! 1

మంచి మనసుగల యయోధ్యపౌరులు గాంచలేక రాముని యచటన్!
విషాదార్త వదనులుగా వారలు వేలు వేలు నిటు లనుకొనిరీ!
ఛీ! ఛీ! నిదురను నెంత జరిగినది ఛీ! నిదురను మది తెలియకనూ!
సుందర సీతా రామ లక్ష్మణుల సూటిగ గోల్పోతిమి నేడున్! 2

రామసేవ వ్యర్థము గాదెపుడును రమ్యమైన దే నాటికినీ!
భక్తజనుల నిటు విడిచివెళ్లెనూ! బహు దూరము వనిలోపలికిన్!
ఔరసపుత్రుల వలె బాలించెను నందలు సుఖ సంతోషములన్!
అట్టి రాముడిపు డరణ్యమునకును నిట్టె దెలుపకను బోయెనహో! 3

రాముడు లేనీ జీవిత మెందుకు? రహి మరణింతము నిచ్చటనే!
మరణించెడి వలకును బయనింతము మరి యుత్తరదిశ వైపునకున్!
ఇచట గలవు బహు నెండు కట్టెలును నిచట జితుల నేర్పఱచుదమూ!
మన మందఱమును నొక్క మాఱుగా మహాగ్నిలో బడుదము వేగన్! 4

జను లడిగిన మన మేమి తెలుపుదుము? జనప్రియుడగు శ్రీరాఘవునీ!
ముగ కంపి యిటు వచ్చితిమని వాక్కుల నెటువలె దెలుపుదుమూ?
డు లేకుండగ మన మఱిగిన రమ్య పురీజను లందఱునూ!
నందులై దీనత నొందుచు నిత్య దుఃఖితులు నయ్యెదరూ! 5

జితాత్ముడగు శ్రీరామ చంద్రుతో జేరి యిటకు మన మొచ్చితిమి!
ఆతడు లేకుండగ యయోధ్యపురి యరయుద మెట్టుల గన్నులతో?
ఆ విధముగ యా పౌరులందఱును యడలుచు బలుకుచు దుఃఖితులై
దూడలు బోయిన ధేనువులకువలె దురపిల్లుచు విలపించి రటన్! 6

అంతట నరదము జాడను వోయిరి కొంత దూర మటు నడవులలో!
జాడ గనబడక తల్లడిల్లిరి తపవడుచును బహు శోకమునన్!
అరదము పోయిన జాడ గనబడక యాపురి పౌరులు దలచిరిటుల్!
దురదృష్టులము నేమి సేయుదము! దూరమైతి మా రాములకున్! 7

అనుచు పలుకుచును బౌరులందఱును నా శ్రీరాముని దలచుచునూ
పొంగిన దుఃఖము జేత వచ్చిరీ పొలుపుగ యయోధ్య పురమునకున్!
వచ్చిన పౌరులు నగరము గాంచీ వచ్చిన యాపద గమనించీ!
శోక పీడితంబగు నయనములను! శోకాశ్రువులను రాల్చిరిగా! 8

రాముడు లేని నగరము నందున రమ్య శోభ లుప్తం బయ్యెన్!
నీలి మేఘములు గ్రమ్ముకొనిన యా నీలి రాత్రి వలె గనిపించెన్!
చంద్రుడు లేని రాత్రికి వలెనూ యింద్రుడు లేని సురలవలెన్!
ఉదకము లేని సంద్రము వలెనూ సదయుడు లేని స్త్రీకివలెన్! 9

గాంచుచు సంతోషంబు లేక మతి చంచలమగు మనసుల తోడన్!
మహా ధనంబులు గల తమ యిండ్లకు మానుగ జొచ్చిరి కష్టమునన్!
దుఃఖితులై తమ కెదురుగ నున్నను దూరబంధువుల మిత్రులనూ
తమవారిని, యితరుల ముఖంబులను దగ గుర్తింపరు శోకమునన్! 10

(అయోధ్యాకాండమున-47వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## నలుబది యెనిమిదవ సర్గము

### (అయోధ్యా నగర వాసులగు స్త్రీలు విలపించుట)

రామునితో వని బోయి వచ్చినా రమ్యగుణులు నా పౌరులునూ!
అతి దుఃఖితులై వేదన నందుచు మతి నతి గలతయు బొందుచునూ!
మరణింపగ కోరికతో వారును మఱి కన్నీటిని నొలుకుచునూ!
ప్రాణంబులు బోయిన వారికి వలె బేరులుండి రా సమయమునన్! 1

పౌరులందఱును జేరిరి గృహముల జోరులవలె మౌనము తోడన్!
పుత్రులు, భార్యలు జుట్టు నిలువగా బొల్లున నేడ్చిరి శోకమునన్!
ఆ పౌరులు హర్షింపలేదు మఱి యానందము బొందగ లేదూ!
ర్తకులును వస్తువులను నమ్మరు, వంటను జేయరు గృహస్థులున్!
ళంబులును బుణ్య స్థలములు దేజో హీనములై యుండెన్! 2

మన వస్తువు దొరికిన మనుజుడు బులకిత గాత్రుడు గాలేదూ!
క సంపదను బొందిన వానికి యానందంబును లేదుగదా!
మముగా బుత్రుని గనినందుకు స్ఫూర్తి నొందదుగ తల్లియునూ!
ముడు లేని యయోధ్య నగరము రాత్రివోలె జీకటి యయ్యెన్! 3

టింటను దుఃఖితలై స్త్రీలును కంటికి మంటికి ధారలుగా!
చ్చిన భర్తల పోటు మాటలను ముచ్చిక బొడిచిరి యింటింటన్!
ముని జూడని వారికేమి పని రమ్య గృహంబులు భార్యలతో?
నముతోని, మఱి పుత్రుల తోడను దగ సుఖములతో బని యేమీ? 4

సీతారాముల ననుసరించుచును జేరెను వని లక్ష్మణు డొకడే!
త్పురుషుండని జెప్పగ వచ్చును సకలలోకమున వీరుడనీ!
ద సరస్సులు, నదులు, జెఱువులను శుభకరుడగు శ్రీరాముండున్!
నమాచరించునో యవి ధన్యము! సకల పుణ్యములు లభియించున్! 5

అందమైన వనవీధులు కానలు చందమైన జలధారలునూ!
చరియలు గల గిరి శిఖరంబులునూ! జల జల జారెడి సరితలునూ!
రాముని యానందమున దేల్చుచును రాజిల్లును వని యంతయునూ!
సీతాదేవియు యానందంబున దేలియాడు ప్రకృతి తోడన్! 6

ఏ పర్వతమును సీతారాములు నే వనంబునకు బోయిననూ!
అతిథి దేవతలవలె నర్చింతురు నాదరింత్రు వనదేవతలున్!
విచిత్రమగు పుష్పంబుల తోడను విమల మంజరీ ధారిణులై!
సీతారాముల నాహ్వానించును జిరతర ప్రీతిని వృక్షములున్! 7

గిరులు కూడ బహు సంతోషంబున జేరవచ్చి శ్రీ రాములకున్!
అకాలమందున గూడ బుష్పముల నందించును ఫలముల తోడన్!
గిరిధారలు జిత్రముగ జారుచును కిలకిల నవ్వుచు రామునకున్!
నిర్మల జలముల నందించును మఱి ధర్మమూర్తికిని 'జయ' మనుచున్! 8

పర్వతాగ్రమున బాదపంబులును బరవశతను గలిగించు మదిన్!
రాముడున్న చోటను భయముండదు రాదు బరాభవ మెన్నటికిన్!
శూరుడు, ధీరుడు దశరథరాముడు సుదూరమును నేగక ముందే!
అనుసరించి పోదము రామునితో నలరుచు మనమును వనమునకున్! 9

అట్టి మహాత్ముండైన రాముని యనుసరింత మిక వేగముననన్!
అతని పాదముల చెంత వసింతము నతని పాదములు దిక్కనుచున్!
ఈ జనమున కంతకును నాథుడును నీ ధరణీ ప్రజ కంతటికిన్!
అతడే నాథుడు నాతడే గతియు నాతడె గమ్య స్థానమునూ! 10

మేము జనకజను సేవించెదమూ మీరును సేవింపుడు రామున్!
ఈ విధముగ యా పౌరస్త్రీలునూ నింపుగ భర్తలతో ననిరీ!
వని నున్నప్పుడు రామచంద్రుడును వరుసగ మీ క్షేమము జూచున్!
సీతాదేవియు మా క్షేమంబును స్థిరముగ జూచును సంప్రీతిన్! 11

ఈ యయోధ్య వాసము బహుకష్టము ఇచటి జనులు బహుదుఃఖితులున్!
కాదు సుఖకరము; దుఃఖకరము నూ! కష్టము! నెవ్వడు నిట నుండున్?

నాధుడులేనీ రాజ్యమైనదీ నయముగ ధర్మ విరుద్ధముగా
కై కేయీ స్వాధీనమైనచో కథకు నంతయును వ్యర్ధంబౌ! 12

ఈ జీవితమున కర్థము లేదిక నీ పుత్రుల ధనముల చేతన్!
ప్రయోజనం బింతయు లేదనుచును బలుమారులు జెప్పగ నేలా?
సంపదకై భర్తను కుమారునీ నింపుగ పరిత్యజించినదీ!
కులపాంసిని కైకమ్మ నెవరి నిక గూరిమి వదలక మంతె యుండున్? 13

కైక యిలను జీవించియుండగా గలనుగూడ నీ రాజ్యమునన్
భృత్యులుగా మే ముండజాల మిక మృత్యువునైనను బొందెదమూ!
మా బిడ్డలపై యొట్టు బెట్టుకొని మానుగ దెలుపుచు నుంటి మిదే!
కైక రాజ్యమున నుండము! నుండము! కమ్మని దనికిని మిదు మొకన్!14

జాలిలేనిదై కడు క్రూరముగా కమ్మని రాముని వనమునకై!
బంపినట్టి యా కైక రాజ్యమున నింపుగ నెవ్వడు సుఖముండున్?
అనాలమ్మమును, ననాయకంబై వినాశనం బగు రాజ్యమునన్!
కైక మూలమున నింత జరుగెనూ! కష్టము లొందుదురును బ్రజయున్!15

రాము డరణ్యము బోయిన పిమ్మట రహి జీవింపడు దశరథుడున్!
నరేంద్రు డంతట మరణించినచో నయముగ విలాపమే మిగలున్!
మీ పుణ్యంబులు క్షీణించినవీ మిగుల కష్టముల మునిగితిరీ!
విషము గలుపుకొని త్రాగుడు జలమును విజనంబునకును బోపొండి!
ఎవరికి తెలియని ప్రదేశంబునకు బర్వులెత్తుచును వెడలండీ! 16

సీతా లక్ష్మణ సమేతుడైనా శ్రీరాముని గపటంబుననూ!
దూరమంపి మనలను బశువులుగా భరతుని వశమును గావించెన్!
మన పుణ్యంబులు క్షీణించుటచే మన నోములు ఫలియింపమిచే
దైవమిట్లు గావించెను మనలను దీనులుగా బలహీనులుగా! 17

నిండుచంద్రునీ మోము గలాడును నీలిమేఘ శ్యాముం డతడున్!
అరిందముండును గూడ జిత్రువును నన్నగారు శ్రీలక్ష్మణుకున్!

మధురముగా మాటాడువాడు మఱి మహాభుజంబులు గలవాడున్!
పద్మాక్షుడు బూర్వాభిభాషియును బన్నుగ మధుర స్వభావుండున్! 18

సత్యవాది మఱి మహాబలుండును సౌమ్యుడు, ప్రియ దర్శనకరుడున్!
చంద్రునివలె బహు చల్లనివాడును నింద్రుడు దేవతలందుననూ!
మహారథుడు పురుషోత్తము దాతడు మదగజంబునకు వలె నడుచున్!
వనములలోపల సంచరించుచును వనముల వెలుగుల నింపు నికన్! 19

అయోధ్య నగరపు బ్రమదలందఱును నీ విధముగ విలపించుచునూ!
మృత్యుభయంబును గలిగినటులుగా మిక్కిలి నేడ్చిరి దుఃఖముననన్!
అయోధ్యపురమున స్త్రీలు నా విధము నా రాముని జింతింపగనూ!
సూర్యుడ స్తమించెను బడమటిదిశ సుందర సంధ్యలు వికసించెన్! 20

అగ్నిహోత్రములు జేయ రెవ్వరును నధ్యయనంబులు నాగె నటన్!
అయోధ్యనగరము జీకటి పూసిన యంధకారముగ కనిపించెన్!
అంగళ్ళన్నియు మూసివేయబడె హర్ష మెచ్చటను గనరాదూ!
నక్షత్రంబులు లేని నింగివలె నా యయోధ్యయును నటులుండెన్! 21

స్త్రీలందఱు దమసుతులు సోదరులు చిరతరముగ దేశమునుండీ!
బహిష్కృతులు గావింప బడినపుడు బ్రబల శోకమున నుండుదురో!
ఆ విధమున రాముని విషయంబున నలత జెంది రోదించిరిగా!
ఔరస పుత్రులకంటె రాముడే యధిక ప్రేమ పాత్రుండయ్యెన్! 22

అపు డా నగరిని యానందంబులు య స్తమించినటు గనిపించెన్!
సంగీతంబులు, నుత్సవంబులును సరస నృత్యములు లేకుండెన్!
ఆనందము గనబడుట లేదెచట యపణంబులు మూతలు వడియెన్!
నీరు దగ్గినా సరితగ యుండెను నిర్మలమగు నా యయోధ్యయున్! 23

అయోధ్యాకాండమున 48వ సర్గము సమాప్తం

★ ★ ★

## నలుబదితొమ్మిదవ సర్గము

(రాముడు గ్రామవాసుల మాటలను వినుచు కోసలదేశమును దాటి పోవుట వేదశ్రుతి, గోమతి, స్యందనా నదులను దాటి సుమంత్రునితో భాషించుట)

పురుషోత్తముడగు రాము డంతటను బొలుపుగ పితృాజ్ఞను దలచీ!
రాత్రిశేషమందే బహుదూరము నయముగ బయనము గావించెన్!
రాము డా విధము బయనము జేయగ రాత్రిగడిచి తెలతెల వారెన్!
సంధ్య నుపాసించెను రాముడు రవి వందనముల గావించె నటన్! 1

తనదేశపు బొలిమేరను దాటుచు దగు దృశ్యములను వీక్షించెన్!
దున్నిన పొలములు గ్రామంబులునూ దూరప్రాంత వన భూములునూ!
పల్లెప్రజల మాటలను వినుచునూ బహు విద్దూరపు జేష్టలునూ!
ఉత్తమాశ్వముల బ్రయాణించుచును నురు పల్లెలను దాటెనుగా! 2

అయ్యో! పాపము! దశరథరాజును నా కామినికిని లొంగెనహో!
కుల పాంసిని కైకేయి రాణి యిక గుల నాశనమును గావించున్!
ధార్మికుడగు శ్రీరామచంద్రునీ తగ వనములకును బంపించెన్!
క్రూరకర్మలకు నొడిగట్టినదీ కుత్సిత బనులకు బూనినదీ! 3

సుఖమున కలవాటును బడినట్టిది సుందరి సీతా జనకసుతా!
దుఃఖము లెటులను ననుభవించునో దొర్బల వనముల గమియందున్!
ప్రజల కిష్టుడును దోష రహితుడును రాముని వనములకును బంపన్!
కోరుచుండె దశరథు డాశ్చర్యము కోరిక కైకను దీర్పంగన్! 4

కోసల యధిపతి యగు శ్రీరాముడు గూరిమి పల్లియుల మాటల్!
వినుచు మదిని సంతోష దుఃఖముల విమల కోసలను దాటెనహో!
అటుపిమ్మట మంగళకరంబునగు మహా వేద శ్రుతినదిదాటీ!
అగస్త్యుండు నివసించునట్టి యా నలరు దక్షిణంబునకు జనెన్! 5

నచటనుండి పయనము గావించెను నా రాముడు బహు దూరంబున్!
శివజలములు, బహుగోవులు గలదియు శివసాన్నిధ్యము గలదియునూ!
సంద్రములోనికి ప్రవహించెడిదీ యింద్ర నీలవర్ణము గలదీ!
గోమతీ నదిని దాటెను రాముడు గూరిమి నాత్మీయుల తోడన్! 6

శీఘ్రగమనమును గల హయములచే శీఘ్రము గోమతి నదిదాటి!
మయూర హంసా యభితంబులగు మానుగ స్యందన నదిదాటీ!
మనువుచేత నిక్ష్వాకున కిచ్చిన మానుగ ఘనతర భూములనూ!
రాముడు జూపెను సీతాదేవికి రమ్యమైన యా రాష్ట్రములన్! 7

మత్త హంస స్వరమును గలిగిన యా మహాత్ముడగు శ్రీరాముండున్!
సూత సుమంత్రుని ప్రేమపూర్వకము సూతా! యనుచును నిటుపలికెన్!

మరలవచ్చి నే తల్లిదండ్రులను మానుగ దర్శనమును జేసీ!
పుష్పిత వనమున సరయూ తీరము బొలుపుగ నే విహరింతునొకో!
అతులమైనదియును వేట రాజులకు నంగీకారం బైనదియున్!
సరయూ వనమున వేటనాడగా సమ్మతింప నే వేటాడన్! 9

అయా కాలము లందు రాజులును నాచరింపవలె నీ క్రీడన్!
ధమర్థరులునై యడవుల యందున దగ నీ క్రీడను నేర్వవలెన్!
మునిజన మానవ రక్షణ కొఱకై మోదముగా వేటాడుదునూ!
విలాసమునకై వేటాడను నే వికృత హింసా వర్తనలన్! 10

ఇక్ష్వాకుడు శ్రీరామ చంద్రుడును నింపుగ నా యా విషయములన్!
మధురమైన వచనములను బలుకుచు మాధుర్యములను జిందుచునూ!
సూత సుమంత్రునితోని దెలుపుచును సుందర ప్రకృతి గాంచుచునూ!
ఆ మార్గమునను ప్రయాణ మాయెను నాత్మ బంధువులతో నపుడున్! 11

(అయోధ్యాకాండము-49వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యాకాండము - ప్రథమ భాగము

## యాబదవ సర్గము

(మార్గమున రాముడు అయోధ్యను వనవాసమునకు అనుమతి గోరుట — శృంగశేరి పురమున గంగాతీరము జేరి రాత్రి యచట విశ్రమించుట — అచట నిషాదరాజగు గుహుడు రాముని సత్కరించుట.)

లక్ష్మణ పూర్వజుడైన రాముడును రమ్య కోసలను దాటుచునూ!
అయోధ్యాభిముఖుడై ప్రాంజలితో యభినందించుచు నిటు లనియెన్!
కకుత్స్థ వంశమునందు జనించిన ఘనులచేత బాలింపబడీ!
నిను నీ యందున నివసించుచు మఱి నిను బాలించెడి దేవతలన్!
అనుమతి గోరుచునుంటి యయోధ్యా! సలరుచు శ్రద్ధాభక్తులతోన్! 1

వనవాసంబును బూర్తిచేసికొని యొనరగ పితృ ఋణంబులనూ!
తీర్చి తల్లిదండ్రులను గూడికొని దీరుగ జూచెద నిను మఱలన్!
అశ్రు పూర్ణ ముఖమున శ్రీరాముడు నచటి జానపదులను గాంచీ
దక్షిణ హస్తమునెత్తి బలికె నిటు దగ నాప్యాయత బొంగారన్! 2

నాయందున దగునట్లుగ మీరును నయము, దయము, జాలియు నిండన్!
మేలిమి మాలిమి జూపించిరిగా మిగుల దుఃఖ మది చెడ్డదిగా!
మీ మీ పనులను జూచుకొనుటకును మిగుల హర్షమున బోవ దగున్!
ధీరుల లక్షణమది కాదు గదా! దీనత నందుట దుఃఖమునన్! 3

పల్లీయులు జేసిరి రామునకు ప్రదక్షిణంబును నంజలితో!
మిగుల నేడ్చుచును రాముని జూచిరి మిగుల ప్రీతి వర్షించుచునూ!
అచ్చ టచ్చటను నిలిచి చూచిరీ హెచ్చగు వృక్షములను నెక్కి!
చెట్టుపుట్టలను నెక్కిజూచిరీ చేరువ గిరులను నెక్కుచునూ! 4

జనులందఱు శ్రీరాముని జూచుచు గనులనీరు నొలుకుచు నుండన్!
సాయం సూర్యుని వలె రాఘవుడును సరగున బోయెను బయనంబై! 5

దనధాన్యంబులు గూడిన దేశము దానశీలు రా ప్రజాళియున్!
ఎప్పటినుండీ భయము లేనిదియు చక్కని దేశము గోసలయున్!

చైత్యంబులు యూపస్తంభములును చిరతర దేవత మందిరముల్!
మామిడి తోటలు యుద్యానములును మానుగ జలాశయంబులునూ! 6

ప్రజలందఱు సంతుష్టులు నచటను బరిపుష్టులుగా నుండిరటన్!
దేశమంతటను గోసమూహములు దిశలు ధ్వనించును వేదములన్!
రమ్యోద్యాన సమాకులమైనా రాజుల కుపభోగ్యంబైనా
అట్టి కోసలను మధ్యదేశమున నారాముడు బయనము జేసెన్! 7

కోసల రాజ్యము దాటిన రాముడు గూడి జానకిని లక్ష్మణుతో!
మూడు మార్గముల బ్రవహించునదీ మూడు లోకముల పుణ్య నదిన్!
మంగళకరమగు జలములు గలదీ మహిమాన్వితులగు ఋషిమునులున్!
సేవించెడి యాగంగను జూచెను శివకరమగు జలతరంగనూ! 8

ఆ గంగానది సమీపంబునను నచట నచటగల యాశ్రమముల్!
ఆ మహానదికి యలంకారముగ యటనుండెను బుణ్యాకృతులన్!
అప్సరసలునూ యాడుచు బాడుచు నటకొత్తురు శ్రద్ధాభక్తిన్!
మంగళప్రదమగు గంగా జలముల జెంగట నాడుదు రాటలనూ! 9

దేవ దానవులు గంధర్వులునూ శివతరమగు గంగానదినీ!
సేవింతురు మది భక్తిశ్రద్ధలను సిందూరంబుల గుంకుములన్!
దేవతలును విహరించు గిరులునూ! దేవనదికి యంతట గలవూ!
ఉద్యానంబులు నూహకు నందని సత్యానంద ప్రదేశములన్!
వందలకొలదిగ నున్నవి యీనది యందముగా నాకస మందున్!
ప్రవహించుటచే దేవనదిగ నిది ప్రసిద్ధి గాంచెను లోకములన్! 10

కొన్ని చోటులను భయంకరముగా గొన్నిచోట్ల నురుగలతోడన్!
కొన్నిచోట్ల జడవలె దీర్ఘము గొన్నిచోట్ల సుడులున్ నుండున్!
కొన్నిచోట్ల నిశ్చలమై లోతుగ కొన్నిచోట్ల వే బ్రవహించున్!
కొన్నిచోట్ల ధ్వని గంభీరంబై కొన్నిచోట్ల భైరవ ధ్వనులన్! 11

దేవతలందఱు స్నానమాడినది తెల్లని కలువలతో నుండెన్!
కొన్నిచోట్ల నిసుకల దిన్నెలునూ కొన్నిచోట్ల నిసుకయు నుండెన్!

హంసలు, సారస, చక్ర వాకములు సంతట విహరించుచు నుండెన్¡
మధ్యభాగమున బ్రతిధ్వనించుచు మదించి యుండెడి పక్షులతో! 12

కొన్నిచోటులను మొలిచిన తరువులు సన్నజాజులా మాలవలెన్!
గంగానదినీ యలంకరించెను సంగతిగా బహు శోభితమై!
కొన్నిచోట్ల వికసించిన కలువలు కొన్ని చోట్ల తామర పూలున్!
పైట చెంగువలె గంగానదికిని బాసించెను శోభితమగుచున్! 13

కొన్నిచోట్ల కలువల గుంపులునూ చిన్న మొగ్గలును నరవిరిసెన్!
నదీమతల్లికి జడలో మాలగ నవ తేజసులను సమకూర్చెన్!
నానా పుష్ప రజస్సుల గూడుక నయముగ రంగును మార్చుకునీ!
జలతరంగములు మత్తెక్కినయుల్ జలజల ప్రవహించుచు నుండెన్! 14

ఎట్టి విధములగు మలినంబులునూ! యెట్టి విధములగు గల్మషముల్!
లేకపోవుటను మహామణికి వలె లీల నిర్మలతను భాసించెన్!
వనగజంబులును, దిశాగజమునును వన్నెల దేవ గజంబులునూ!
గంగయందు దిగి ధ్వనిజేయుటచే రంగుగ వనియును మార్మోగెన్! 15

ఆ గంగానది ప్రాంతమంతయును నలరెను బుష్పఫలంబులతో!
చివురులు, పొదలును, బక్షులగూడుక చిరయతనము నా ప్రాంతంబున్!
అలంకారముల సింగారించిన యతివవోలె నట కనిపించెన్!
అడవి కోతులును, మొసళ్ళు, పాములు నా నది వర్తించుచు నుండెన్! 16

విష్ణుపాదముల బ్రవహించినదీ విపుల తోయములు గలదియునూ!
పాపంబుల దొలగించు నద్దియును భగీరథుని దపసుల జేతన్!
శంకరు జూటము నుండి దూకినది సారస క్రౌంచంబులు గలదీ!
అట్టి గంగనూ రాముడు జూచెను నల శృంగిబేర పురమందున్! 17

తరంగములచే శోభిల్లునదియు దగ సుడులను విలసిల్లునదీ!
నదిని జూచి శ్రీరామచంద్రుడును నయముగ బలికెను సూతునితో!
నే డిచ్చటనే మనము వసింతము నిర్మలమగు నీ ప్రకృతినీ!
ప్రవిమలమగు గంగా నది యొడ్డున బరగ వసింతము ధన్యతనూ! 19

సారధి విను! గంగానది నుండి సమీపముననే గలదింకన్!
బహుపుష్ప ప్రవాళంబులతోడను బహు శాఖలతో గూడికొని!
గారచెట్టు! అదిగో! కనుమింకను గమ్మని గాలులు వీచెనహో!
ఇచ్చటనే నివసింతము నేడును మచ్చికతో నీ ప్రకృతిని! 20

దేవదానవులు, గంధర్వులకును, దేవమునులకును, ఋషులకునూ!
మృగములు, పక్షులు, మానవులకునూ మేల్మి శుభంబులు గూర్చునదీ!
సమ్మాన్యములగు జలములు గలదీ సరిద్వరయు గంగానదినీ!
అట్టి పుణ్యనది తరంగములు గని యానందింతము నేటికినీ! 21

లక్ష్మణుండు మఱి సూత సుమంత్రుడుని లాలిత రాముని వచనములన్!
ఆమోదించిరి రథమును దోలిరి యా వృక్షమునకు దాపునకున్!
రయమున వృక్షము నమీపించిరి రాముడు సీతా లక్ష్మణుడున్!
రథమునుండి నేలకు దిగిరప్పుడు రమ్య పచ్చికల బయలందున్. 22

సుమంత్రుడునూ రథమునుండి దిగి యున్నతాశ్వముల విడదీసి!
వృక్షమూలమున నున్న రామునీ వినయపూర్వకము దరిజేరెన్! 23

రాముని ప్రాణసమానుడు, సఖుడును రహి నిషాదజాతికి జెందున్!
ఆనిషాద జాతికి యతడధిపతి యతి బలవంతుడు, ప్రసిద్ధుడున్!
అతని బిలుతురు గుహుండనుచును మఱి యాతడె రాజు నిషాదులకున్!
నిషాదుడైనను నిర్మలశీలుడు నిఖిల సద్గుణముల ప్రోవతడున్!

తన దేశమునకు రాముడొచ్చెనని విని యా గుహుడు నమాత్యులతోన్!
బంధు మిత్రులను గలిసివచ్చె దా బన్నుగ శ్రీరాముని కడకున్!
నిషాదరాజటు వచ్చుచుండెనని నిర్మల హృదయుడు లక్ష్మణుతో!
రాముడు గుహుని కలిసికొనుటకై రయమున ముందుకు నడుగిడెనూ! 25

ఆర్తుండై యా గుహుడంతట దా యలరి రాము గౌగిలి జేర్చి!
బలికె నిటుల ప్రేమార్ద్రిత తోడుత బల్లవింప నింగులి దరువున్!
రామా! నీకు నయోధ్య యెట్టిదో రహి ఈ నగరము నట్టిదియే!
ఏమి జేయవలెనో వే దెలుపుము! నింత గొదువ లేకుండగనూ!
చేసెద నిప్పుడు నిట్టి యతిథి మఱి జేరవచ్చు? నెవ్వడు బొందున్? 26

అంతట గుహుడునుననేక విధముల యన్నపానముల గొనివచ్చెన్!
మధుర మధుర వాక్యంబులతో ననె మహావీరుడగు రామునితో! 27

మహాబాహూ! నీకిదె స్వాగతమూ! మా నేలంతయు నీదె సుమా!
మే మందఱమును బరివారకులము! ప్రభువుగ నుండుము మాకింకన్!
ఈ రాజ్యంబును బరిపాలింపుము నింపుగ రాముని రాజ్య మనన్!
భక్ష్య భోజ్యములు పేయ లేహ్యములు బహుశయనములను దెచ్చితిమీ!
అశ్వంబులపై యాహారంబును నవిగో దెచ్చితి మన్నియునూ! 28

గుహుని మాటలను వినియు రాముడును గూర్మి స్నేహమున నిటులనియెన్!
కాలినడక నిటు నెదురు వచ్చుటయును గమ్మని స్నేహము జూపుటచేన్!
సర్వ విధములను బూజించితివీ! సర్వాతిథ్యము లందితిమీ!
సంతోషంబును సన్మానంబును సరసరీతి మే మందితిమీ! 29

రాము డా గుహుని ఘనభుజములచే గాఢగౌగిలిని జేర్చుకొనీ!
బలికె నిటుల బహు స్నేహముతోడను బంధువువలె నాతని గాంచీ! 30

నీవు నీదు బంధువులందఱునూ నిర్మల సుఖ మా రోగ్యములన్!
నుండగ నే నిను జూడగలిగితిని మెండుగ బొందుము సుఖములనూ!
మిత్రులకును నీ రాష్ట్రమునకు నీ ధనమునకును సుఖముగదా! 31

వర్పించిన సకల సపర్యలు నీతి విడుడ నే నందితినీ!
ఏఱల నీకు నర్పించుచుంటినీ మానుగ నీ వర్పించినవీ!
ఇచ్చిన వస్తువు ప్రతిగ్రహింపగ సచ్చరిత్ర! నే లేనుగదా!
ధర్మరీతినీ ముని నను సంగతి దగ గ్రహింపు మీ విషయంబున్! 32

కుశ చీరాజినములను ధరించీ కూరిమి ఫల మూలముల దినీ!
వనములందు నివసించు చుంటినీ యనయము ధర్మము దలదాల్చి!
అశ్వంబుల కాహారము మాత్రము యాప్త మిత్రుడా! కోరునదీ!
నీ వది యిచ్చిన సంతోషించెద నిఖిల సపర్యలు నందినటుల్! 33

గంద్రి దశరథున కిష్టమైనవీ తగ నీ యశ్వములును మఱియున్!
అశ్వంబుల మఱి పూజించినచో నలరి నన్ను బూజించినటుల్!

అని పలుకగ రాఘవుడు గుహునితో నాజ్ఞాపించెను నా గుహుడున్!
అశ్వంబుల కాహారము నీరును నతి వేగముగా దెమ్మనుచున్! 34

అంతట రాముడు నారజీరనూ వింతగ భుజమున ధరియించీ!
లక్ష్మణుండు దెచ్చిన యుదకములను గుక్షి నింపె నాహారముగా!
అంత ప్రకృతియు జీకటిచీరను వింతగ గట్టెను దుఃఖముతో!
పశ్చిమ సంధ్యను నుపాసించె వే భక్తి శ్రద్ధలను రాముడునూ! 35

భార్యతోని యాకులపై నేలను బరున్న రాముని పాదములన్
లక్ష్మణుండు గడిగెను సద్భక్తిని లలిత సపర్యల గావించెన్!
గుహుడుగూడ మఱి ధనుర్ధారియై కూరిమి లక్ష్మణ సూతులతో
సావధాన జిత్తముతో రాముని సంరక్షణమును మేలుకొనెన్! 36

బాధ లెన్నడును ననుభవింపని భవ్య గుణుడు శ్రీరాముండున్!
కటిక నేలపై బవ్వళించెనూ కాఱు జీకటిని వనములనూ!
కష్టసుఖంబులు గావడి కుండలు నిష్టసుఖంబుల నందిననూ!
విధి నిర్ణయమును మార్చలేరుగా వీరులు ధీరులు నెవరైనన్! 37

(అయోధ్యకాండమున-50వ సర్గము సమాప్తము)

★ ★ ★

# అయోధ్యాకాండము ప్రథమ భాగము

## యాబదియొకటవ సర్గము

(గుహుని సమక్షమున లక్ష్మణుడు విలపించుట. రాముసాజ్ఞచే గుహుడు నావను దెప్పించుట-సుమంత్రుని యయోధ్యకు బొమ్మనుట)

అన్న రాముని రక్షణ కొఱకై యలరి మేల్కొన్న లక్ష్మణుతో!
అమాయకుండగు గుహుడు వలికెనూ యమిత దుఃఖ వేదన తోడన్!
రాజపుత్ర! యిదిగో సుఖకరమగు రమ్య శయ్య నేర్పరచితినీ!
యథాసుఖముగా నిట నిదురింపుము యథారీతి విశ్రాంతి గనూ! 1

మేమందఱము శ్రమ జీవులమూ మిక్కిలి సుఖవంతుడ వీవున్!
రాముని రక్షణకై మేల్కొందుము రాత్రియంతయును మే మిచటన్!
రామునికంటెను ప్రియమిత్రుం డిల రహి మఱెవ్వరును లేరుసుమా!
ఒట్టు బెట్టి సత్యమును దెలిపెదను గట్టిగ యీతని యంతటనూ! 2

ఈ రాముని దయవలన లోకమున నింపుగ కీర్తిని, ధర్మమునూ!
అర్థంబును మఱి పొందవలయునని యాశించుచు నుంటిని నేనున్!
నేనును, నా బంధువు లందఱునూ నిశితాస్త్రంబుల ధరియించీ!
ప్రియమిత్రుని శ్రీరాము గాచెదము ప్రేమమీర జానకి తోడన్! 3

ఈ ప్రాంతంబున జరించు మాకును నిల దెలియని దేమియు లేదూ!
మహాబలంబులు వచ్చి నప్పటికిని మఱి యెదిరింతుము ధీరతతోన్!
అటుల బలుక గుహు డా లక్ష్మణుడును నలరి బలికె నిటు ఓ గుహుడా!
ధర్మవిదుడవగు నీ రక్షణలో దగ భయమేమియు లేదు సుమా! 4

ఈ విధముగ శ్రీ సీతారాములు నిలపై బరుండి యుండగనూ!
నిదుర యెటులవచ్చును? జీవితమును నిలుచు టెటుల?సుఖమెటు గలుగున్?
దేవాసురులను గూడ యుద్ధమున దీప్తి నడంచునా యా విభుడున్!
సీతతోని తృణములపై నెట్టుల ప్రీతిని నిదురించెనా కనుమా! 5

రాముడు దశరథునకు ప్రియపుత్రుడు రమ్యచరిత్రుడు జ్యేష్ఠుండున్!
మంత్ర దపస్సుల చేత బొందినా మహనీయుండగు వీరుండున్!
అట్టి రాఘవుడు నడవుల కేగగ యారాజును జీవింపడుగా!
కొద్ది కాలమున యా వసుమతియును తథ్యము విధవయు నైతీరున్! 6

స్త్రీలందఱు నట యేడ్చి యేడ్చి మఱి సోలిబోయెదరు నీ సరికిన్!
రాజనివేశనమందు ధ్వనులునూ రహి యణిగెననీ మది దలతున్!
కౌసల్యయు మఱి దశరథేంద్రుడును గడకు మా తల్లి సుమిత్రయున్!
ఈ రాత్రిని జీవించు యుందురని నే దలపను మది సత్యముగన్ 7

నాదుతల్లి శత్రుఘ్నుని కొఱకై సయముగ జూచుచు జీవించున్!
వీరుని రాముని గనిన కౌసల్య మరణించును! తథ్యం బిదియున్!
లోకప్రియావహమైన యయోధ్యయు లోకారాధ్యుడు దశరథుడున్!
మరణించుటచే నశించి పోవును మ్రోగ్గుచు శోక ధ్వనులన్! 8

మహాత్ముడును జ్యేష్ఠుడు ప్రియపుత్రుడు మానుగ రాముడు వనికేగన్
మహితాత్ముడు నారాజు ప్రాణములు మఱి శరీరమున నెటులుండున్!
రాజు మరణమును బొందిన పిమ్మట రాణి కౌసల్య మరణించున్!
అనంతరంబున నా తల్లియు నిక యనంతునొద్దకు జేరుకొనున్! 9

చిరకాలపు దన గోర్కె దీరకను చిరదుఃఖము బొందిన వాడై!
రాముని యభిషిక్తుని జేయకయే రాజు రయముగను మరణించున్!
కాలము వచ్చి గతించిపోయిన ఖర్మగతిని నాతండ్రికినీ
ప్రేతకార్యమును భరతాదులచే ప్రీతిని జేయగ బడు నింకన్! 10

అందమైన ముంగిళ్ళు గలదియును చందమైన బాహ్య మార్గములున్!
మేడలు, మిద్దెలు, ప్రాసాదంబులు మెరసెడి గణికలతో గూడన్!
రథాశ్వగజముల దోడ గూడికొని రమ్య వాద్య ఘోషంబులతో!
జనులందఱు సంతుష్టిగ నుందును సదారోగ్యముల నుందు రటన్! 11

ఆరామోద్యానములతోడ నది యలరును యయోధ్య నగరంబున్!
సమూహములుగా జేరి జను లచట సమాజోత్సవముల జరిపి!

ఆనందముగా సంచరింతు రట! యాపురి కన్నుల బండువుగా
ఆపురి యీ నా డెటుల యున్నదో యందము లెటు లుండెనొ అహా! 12

తండ్రి యింక జీవించున? మేమను దగ వనవాసము బాలించీ!
తిరిగివచ్చి మఱి యామహాత్మునీ తీరుగ జూడగ గలుగుదుమా!
వనవాసంబును బూర్తి చేసికొని వినయవ్రతములను జేసిన యా
దశరథుతోడను యయోధ్యనగరము దగ ప్రవేశమును బొందుదుమా? 13

మహాత్ము డగు నా లక్ష్మణు డప్పుడు మహాదుఃఖమున దేలుచునూ!
దీనాలాపము జేయుచుండ గనె దిక్కులు దూర్పున దెలనయ్యెన్!
ప్రజాహితుండగు లక్ష్మణుండు దా బన్నుగ పలికిన వాక్యములన్!
విని గుహుండు దా దుఃఖముజేతను వేదన చేతను రోదించెన్!
జ్వరబాధను కరివలె గన్నిటిని ధరణి నంతటిని దడిపె నహో! 14

అయోధ్యాకాండములో 51వ సర్గము సమాప్తము

★ ★ ★

## యాబదిరెండవ సర్గము

[తల్లిదండ్రులు మున్నగువారికి దెలుపుటకై సందేశమిచ్చుట— సుమంత్రుడు దానును వనమునకు వత్తునని బలుకగా రాముడు వారించుట- సీతా రామలక్ష్మణులు నావలో గూర్చొనుట- సీతాదేవి గంగను ప్రార్థించుట- వారు గంగను దాటి వత్స దేశమును జేరుకొనుట - సాయంకాలము వారు ఒక చెట్టుక్రింద నిలుచుటకు బోవుట]

తెలతెల వారగ రామచంద్రుడును దీరుగ లక్ష్మణుతో ననియెన్!
భాస్కరోదయపు గాలంబయ్యెను భగవతి నిశయును గడిచినదీ!
తూరుపు దిక్కున విమల సంధ్యలును దోరణంబులను గట్టెనుగా!
సుకృష్ణ విహగంబైన కోకిలయు సుందర స్వనములు విననయ్యెన్! 1

వనమున నెమిళ్లు గూయుచున్న ధ్వని వినబడుచున్నది మధురముగా!
వేగముగా బ్రవహించు గంగ నిక వేగ దాటుదము మనమిపుడే!
అని రాముడు పలుకగ లక్ష్మణుడును నాగుహు సూత సుమంత్రులనూ!
పిలిచి చెప్పె, రాముడు జెప్పినదీ! ప్రీతి నిలిచె రాముని యెదుటన్! 2

రాముని మాటలు విని గుహుండు మటి రమ్యోత్సాహముతో గూడీ!
శీఘ్రముగా దన మంత్రుల బిలిచెను జిందుచు స్నేహము నిటు లనియెన్!
మంత్రులార! మన రాముని కొఱకై మంచి నావ వే దెండిటకున్!
సమర్థులైనా నడుపు వారితో చక్కని చుక్కానియు గలదీ! 3

ఆ గుహు మాటలు విని యమాత్యులును నందమైన నావను దెచ్చి!
గుహునికి జెప్పిరి యా విషయంబును గూర్మితోని శ్రీ రామునికిన్!
అపుడు గుహుడు బ్రాంజలితో మ్రొక్కుచు నారామునితో నిటు లనియెన్!
ఇదే ప్రభూ! అదె నావ వచ్చినది యింక నేమి చేయగవలయున్? 4

'సంద్రముల' నికి బ్రవహించెడి యీ సాంద్రమునగు గంగానదిపై!
నావ సిద్ధముగ నున్నది దాటగ నయముగ నెక్కుము వే వేగన్!'

ఆమాటలు విని రాముడు పలికెను నాగుహుతో నార్ద్రము గాగన్!
కోరినటుల జేసితివి సఖా! యిక గూరిమి యెక్కించుము నావన్! 5

ఆ పిమ్మట శ్రీరామ లక్ష్మణులు నంబుల పొదులును, ఖడ్గములున్!
ధనుర్ధారులై సీతను గూడుక తగ గంగవైపు జనిరపుడున్!
అంత సుమంత్రుడు ప్రాంజలితోడను నా ధర్మజ్ఞుడు రామునితో!
ఏమి చేయవలె నే నటంచుమను నిరపుగ ప్రశ్నించెను రామున్! 6

అటు పిమ్మట శ్రీరామచంద్రుడును నా సుమంత్రుతో నార్ద్రితతో!
ఉత్తమ దక్షిణ హస్తము దోడుత యొసరగ స్పృశించి యిటు లనియెన్!
సూతసుమంత్రా! శీఘ్రము వెడలుము! శుచియగు రాజు సమీపమునన్!
ఏమరుపాటును లేకుండగ నీ విమల ధర్మమున నుండు మటన్! 7

ఇంత సహాయము జేసితివి కదా! యింక మరలుమా పురమునకున్!
రథము విడిచి నే కాలి నడకతో రయమున బోదును వనమునకున్!
అని రాముడు పలుకగ సుమంత్రుడును విని నీరములగు గన్నులతో
పురుషోత్తముడగు రాముని జూచీ! పుట్టెడు వేదన నిటులనియెన్! 8

సోదరు తోడను భార్యను గూడుక సాదరముగ వని నివసింపన్!
బూనితి పిట్టి ఘనకార్యంబును బూను నెవ్వాడీ లోకమునన్!
అట్టి నీకు నీ కష్టము వచ్చుట గట్టిగ యధ్యయనంబునకున్!
బ్రహ్మచర్యమును మృదుత్వమునకును ఫలోదయము లేదని దలతున్! 9

ార్య తోడుతను, దమ్ముని తోడుత దగవనమున నివసింపంగన్!
ాడు లోకముల జయించినట్లుగ మోద సద్గతుల బొందెదవూ!
తభాగ్యులమై నీకు దూరమై యలమటించుచును దుఃఖముతో!
పిని కైకకు వశమై యుందురు పాప కర్మలను జేయుచునూ! 10

త సుమంత్రుడు నీ విధి బలుకుచు సుందర రాముడు నటుబోవన్!
నేపు నేడ్చెను దుఃఖముతో చాల చాల కన్నీ రొలికెన్!
నీరు దగ్గిన సుమంత్రుడును గదగి యాచనమును జేసీ!
ంద్రై యున్న సుమంత్రుని బన్నుగ రాముడు నిటు లనియెన్! 11

ఇక్ష్వాకుల వంశపు రాజులకును నింపుగ నీసరి మిత్రుండున్!
ఎవ్వడు లేడుగ రాజు ననుగూర్చి నొవ్వకుండ జేయుము ప్రీతిన్!
శోకచిత్తుడును వృద్ధ వయస్కుడు సోలిపోయె కామము చేతన్!
అందువలన నే నింతగ దెలిపితి! చందముగా వర్తింపవలెన్! 12

కైకేయీ కోరికల దీర్చుటకు కాముకుడై యే కార్యములన్!
రాజు జెప్పినది చేయవలయు నూ! రయముగ నిస్సంశయముగనూ!
రాజులు రాజ్యము బాలించుట మన రాజ్యమందు సర్వస్వమునూ!
వారి యాజ్ఞలను నడువవలెను గద! వారి యాజ్ఞ యప్రతిహతమున్! 13

నాజ్ఞాపించినదీ వ్యర్థంబని దా ననుకొనకుండగ యుండన్!
దుఃఖ పీడితుడు గాకుండగనూ దూరాలోచన జేయు మికన్!
అదృష్ట దుఃఖితుడగు నా తండ్రిని యలరు బూజ్యుడును వృద్ధుడునూ!
నాపక్షంబున నమస్కరింపుము! నా మాటగ జెప్పుము నిటులన్! 14

అయోధ్య విడిచీ యడవులలోపల యలరి యుంటిమని ఖేదమునన్!
నేనుగాని, తమ్ముడు లక్ష్మణుడును, నీరజాక్షి సీతయుగాని!
కంటనీరు బెట్టుట లేదనియును, యింటి ధ్యాసయును లేదనుమా!
చంటిపాపలుగ విహరింతుము నీ కంటి పాపలము వన మందున్!

పదునాల్గేడులు గడిచిన పిమ్మట బరగ ముఫ్వురము వచ్చెదమూ!
అపుడు నీవు మమ్ములను నిత్యమును నలరి జూచుచుండగ వచ్చున్!
సుమంత్ర! విను! నా తండ్రి తోడుతను సురుచిర వాక్యములను దెలిపి!
మా తల్లిని, మఱి రాజు భార్యలను మాత కైకనూ మఱి మఱియున్! 16

ఆరోగ్యంబును నడిగినట్టుగా నందఱికిని దెలుపుము మఱియున్!
నాదు, సీత మఱిలక్ష్మణమూర్తుల యభివందనముల దెలుపుమికన్
మాతృమూర్తి కౌసల్యకు దెలుపుము మధురవాక్యముల స్పదింపన్!
మాకై దుఃఖము జెందగవలదని మఱి మఱి దెలుపుము శాంతింపన్! 17

మా నమస్కృతుల రాజుకు దెలుపుము మఱి భరతుని వే గొనితెమ్మా!
వచ్చిన భరతుని రాజసమ్మతము మచ్చిక జేయుము నభిషిక్తున్!

భరతుని ప్రేమను గౌగలించుకొని బన్నుగ చేయగ యువరాజున్!
మా సంతాపము దుఃఖంబును మఱి మాయమగును నీ హృదయమునన్! 18

భరతునకును నిటు దెలియబరుపుమా! నరనాథుని యెటు గాంచెదవో!
తల్లులందఱిని భేదము లేకను దగునటు జూచుచు నుండవలెన్!
నీ తల్లిని యెటు జూచెదవో మఱి నిర్మల మతియగు సుమిత్రనూ!
నా తల్లిని కౌసల్యను గూడను నయముగ జూడుము నటువలెనే! 19

తండ్రి యిష్టమున యువరాజైతివి తగు విధమున వర్తించుచునూ!
రెండు లోకముల గలుగు సుఖములను మెండుగ యత్నింపుము పొందన్!
ప్రజాపాలనము బహుకష్టము సుమ! ప్రజలను రంజిలజేయగనూ!
అహోరాత్రములు గృషిజేయగ వలె నలసత్వం బింతయు దగదూ!
అనుచు బలికె శ్రీరామ చంద్రుడును నల సుమంత్రుతో స్నేహమునన్! 20

నివర్త్యమానుండైన సుమంత్రుడు నిర్మల ప్రసన్న వాక్యములన్ !
విని సుమంత్రుడును సుస్నేహంబున వినతిజేసె శ్రీరాఘవుతో!
స్నేహముచే నిర్భయముగ పలికెడు స్నేహ వచనముల నాలించీ!
మనభక్తుండను భావము తోడను మదిని క్షమింపగ వలయు భూసుమీ! 21

నీ వియోగమున బుత్ర శోకమున నిట్టూర్పులు విడిచెడి నగరిన్!
నీవులేక నే నెటుల బోవుదును భావంబున సంతోషమునన్!
రాముడున్న యరదమును జూచి ప్రజ రహి శోకించెను నంతంతన్!
రాముడులేని రథమును జూచుచు రహి శోకించునొ యెంతెంతన్! 22

...నిలో వీరుడు మృతిని బొందగా గని సారథిగల యరదమునూ!
...న్యమువలె నా యయోధ్య గూడను సశోకమున ధైర్యమునందున్!
అయోధ్యలోని ప్రజబందుబునూ యలరి దూరమందున్న నినున్!
...దుట నున్నటుల జింతించెదరూ నిదురాహారములును లేకన్; 23

ప్రవాస సమయంబున ప్రజలును నిలువున నీరై పోయినదీ !
...గి క్షోభ వారల ప్రవర్తనము మఱి జూచితివి కదా రామా !
...జనుదెంచెడి సమయ మందునను వన్నె చఱిగి ప్రజలందఱునూ!

ఆర్తనాదమును జేసిరొ యంతకు నధికముగా జేయుదు రింకన్ !
నన్ను జూచి, నా రథమును జూచి చిన్నవోయి కడు దైన్యమునన్! 24

నీకుమారు నిదె బంపి వచ్చితిని నీ తమ్ముని గృహమున కంచున్
దుఃఖింపకుమని సతి కౌసల్యకు దుష్ట వాక్యమును బలుకుదునా ?
ప్రియమైనను నే నసత్య వాక్యము ప్రీతి దెలియజేయగ జాలన్ !
నీ కుమారునీ వనమున వదినితి నిర్భయముగ యుండుము నను చున్!
అప్రియమగు నీసత్య వాక్యమును నాకౌసల్యకు నెటులను జెపుదున్? 25

నిను సీతా లక్ష్మణులను దెచ్చిన నిర్భయంబులగు నశ్వములున్!
నీవులేని రథమును నవి యేవిధి బోవు నయోధ్యకును లాగుచునూ?
నీవు తోడు లేకుండగ బోనూ! నే నయోధ్యకును నిక్కముగా!
అనుజ్ఞ నిమ్మా! వనవాసమునకు ననుసరించెదను నీ దారిన్! 26

ఇంత నిన్ను యాచించుచున్న నను పంతముతోడుత వదలినచో!
అరదము దోడుత నగ్నిని దూకగ యాలస్యము లేకను నిపుడే!
ఓరామా! యీ వనమున నుండీ యోరిమితో వన మృగములనూ!
నీ తపస్సునకు విఘ్నము లేకను నివారించెదను నరదముచే! 27

అరదము నడిపితి నీ దయచేతను నందితి సుఖమును బహుళముగా!
అనుగ్రహింపుము వనవాసమునకు నా సుఖమును నే నందగమా !
అనుగ్రహింపుము నీసమీపమున యరణ్యమందున నుండగనూ!
నా సమీప మందుండు' మనుచు నే నయముగ నినగా గోరెదనూ! 28

ఈ వనమందున నీవు వసింపగ యీ యశ్వంబులు నిటనుండీ!
నీకు సేవలను జేసినచో నవి నిఖిలోత్తమ గతియును బొందున్!
వని వసించుచును శుశ్రూషల నే ననయము భక్తిని సేయుదునూ!
అయోధ్యకైనను స్వర్గము నైనను నన్ని విధములను నొదిలెదనూ ! 29

పాపాత్ముడు స్వర్గమును జేరనటు బరగ నీవు లేకను నేనున్
అయోధ్యనగరము నందున గాలిడి యానందంబును బొందనుగా

వనవాసము బరిపూర్తి కాగ మఱి వసుధేశ్వర! యీ రథమున నే!
మఱల యెయోధ్యకు గోలిపో గోరెద మదురమైన నా కోర్కి యిదే! 30

పదునాల్గేడులు నీ సన్నిధినీ బన్నుగ క్షణముల వలె నడుచున్!
అటుల కానిచో శత వర్షంబులు నగును జతుర్ధశ వర్షములున్!
భక్త వత్సలా! శ్రీరామా విను! భర్తృ పుత్రగతి పథికుడనూ!
పీ భక్తుండన! నీభృత్యుండను! నిను విడి నేనుండగ జాలన్! 31

ఈవిధముగ నాసూత సుమంత్రుడు ఎన్నో విధముల వినుతింపన్!
భక్తవత్సలుడు రామచంద్రుడును భద్ర వాక్యముల నిటు లనియెన్!
భర్తృవత్సలా! సూత సుమంత్రా! పరమ భక్తి నే నెఱుగుదునూ!
నగరమునకు నిను బంప కారణము నయముగ విను మిక సౌమ్యతనూ!32

నీ వయోధ్యకును దిరిగి వెళ్ళగా నినుగని మా పిన తల్లియునూ!
రాముదరణ్యము బోయినా డనుచు రహి నమ్మకమును గలుగు సుమా!
నే వనవాసము బోవుటచేతను నిర్మల మతియై కైకేయీ!
రాజు నందు శంకయు మది వీడును తమ్య శీలి యని మది దలచున్! 33

పుత్రుడైన భరతునిచే రాజ్యము బొందుగ కైకయు బొందవలెన్!
ఇదియే నా కతి ముఖ్య విషయమును యీవని రాకకు గారణమున్!
రథము దీసికొని నగరము వోయిన రాజుకు నాకును బ్రియమగునూ!
చెప్పిన దంతయు నాచరింపుమా! విన్పి జెప్పితిని నంతయునూ! 34

సువ్రతుడగు నా రాము దంతటను సుమంత్రు తోడను నటుబలికి!
యుక్తియుక్తమగు వాక్యము పలికెను నురుగుణవంతుడు గుహుతోడన్!
గుహుడా! నే జనమున్న వనములో గూర్మి వసింనగ రాదు సుమా!
ఆశ్రమంబునను వసింప వలెనూ! యనఘ! జేయుమా! యేర్పాటున్! 35

పస్వి జనులకు భూషణంబైన తగు నియనుములను గ్రహియించి!
డి మఱియు సీతా లక్ష్మణులయు దగు హితంబు నే కాంక్షించి!
గారినై బోయెద వనికిని సరగువ బోయీ వదమునకున్!
క్షీరములను దెమ్మా! యిక నయముగ జటలను నిర్మింతున్! 36

ఆమాటలు విని గుహుడు వెంటనే యా క్షీరంబుల గొని వచ్చెన్!
మఱ్ఱిపాలతో జటలను దనకును నుతి తమ్మునకును నిర్మించెన్ !
నారజీరలును జటామండలము నయముగ ధరించి సోదరులున్ !
రామలక్ష్మణులు ఋషులు మాదిరిగ రమ్యశోభ వెలుగొందుచునూ! 37

లక్ష్మణుదోడుత రాము దంతటను లాలిత విఖనస ప్రోక్తమునూ!
వైఖానస వ్రత మార్గ దీక్షయును వానప్రస్థమును గ్రహియించెన్!
ఆవ్రతమును పాలించెడి రాముడు యరసి గుహుని యీవిధి బలికెన్! 38

సైన్యము, దుర్గము, ధనాగారమును సహజ దేశ సంస్కృతు లందున్!
ఏమరుపాటును నలక్ష్యంబునూ యేమాత్రము గూడదు ప్రభుకున్ !
రాజ్యము పాలించుట కేవల మది రమ్య విలాసము గాదనియున్!
అసిధారావ్రతమని మది తెలియుము! నప్రమత్తతను నుండదగున్! 39

అటుపిమ్మట యిక్ష్వాకు వర్ధనుడు నా గుహు ననుమతి గ్రహియించీ!
పీడుగొలిపి నిర్మలుడై రాముడు విమలసీత, తన తమ్మునితో
గంగను దాటగ బయలుదేరెనూ కడుశీఘ్రముగా నడుచుచునూ ! 40

తీరమునందున నావను జూచీ ధీరవరుడు శ్రీరాముండున్ !
దాటదలచె యా గంగా నదనీ తమ్ముడు లక్ష్మణుతో పలికెన్ !
తమ్ముడు లక్ష్మణ! తీరమునందున నిమ్ముగ నావయు నిలిచినదీ !
మెల్లగ నెక్కుము! సీతను గూడను నల్లన నెక్కింపుము నావన్ ! 41

ఆత్మవంతుడగు నా లక్ష్మణుడును నన్న చెప్పినది గ్రహియించీ !
ముందు సీత నెక్కించెను నావను పొందుగ పిమ్మట దా నెక్కెన్!
లక్ష్మణ పూర్వజుడైన రాముడును లాలితముగ నావను నెక్కెన్!
నిషాధి పతి యగు నా గుహుడునూ నిజ బంధుల కాజ్ఞాపించెన్ !
నావను నావలి దరిని జేర్పగను నయముగ భద్రమటంచు మతిన్! 42

ధర్మజ్ఞుండగు రామ చంద్రుడును దగ నావను నారోహించీ!
'దైవీ నావమ్' యను మంత్రంబును దా జపించె శ్రద్ధాభక్తిన్!

పిమ్మట రాముడు సీత లక్ష్మణుడు ప్రీతి యథాశాస్త్రము గాగన్!
ఆచమనంబును జేసి యా నదికి యలరి మ్రొక్కిరీ సంప్రీతిన్! 43

అంతట రాముడు గుహుని సుమంత్రుని సంతస మందగ వీడ్కొలిపీ!
నావను గూర్చుని నావ నడుపుమని నావికులను ప్రేరేపించెన్!
కర్ణధారి చుక్కాని బట్టగా గడు బలవంతులు దెడ్డులచే
త్రోయబడినదై నావయు శీఘ్రము దోయములను వే దాటగనూ! 44

ఎట్టి నిందలును నెఱుగని జానకి నట్టనడుమ గంగను దలచీ!
ప్రాంజలితో నా నదీమ తల్లిని బ్రార్థించెను శ్రద్ధా భక్తిన్!
ఓ గంగానది! ఓ భాగీరథి ఓ జాహ్నవి! ఓ సరిద్వరా!
త్రిపథగామినీ! త్రిజగదీశ్వరి నిను త్రిలోక వాసులు బూజింత్రూ! 45

ధీమంతుడు దశరథుని కుమారుడు ధీరవరుడు శ్రీ రాఘవునిన్!
రక్షింపగ వలె నెల్లప్పుడును మఱి రమ్య వీక్షణను జూడవలెన్!
తండ్రి వచనమును నిజమును జేసీ తగ పదునాలుగు వత్సరముల్
వనములనుండీ తిరిగి వచ్చు మఱి వాసిగ నాతో, దమ్మునితో! 46

సుభగే! సుందరి! దీవెనలిమ్మా సురుచిరముగ మే మందఱమూ!
క్షేమముగా మఱి దిరిగివచ్చునటు నేమముగా బూజించెదనూ!
ఓ గంగానది! మూడు లోకములు నోలముగా బ్రవహించుటచే
త్రిపథగామినీ యను నీ పేరును స్థిరమయ్యెను గద లోకములో! 47

మంగళప్రద! నే నమస్కరించెద! మహితాత్ముడు శ్రీరాముండున్!
తిరిగివచ్చి రాజ్యమును జేగొనిన జేతును నీ సంతోసమునకై!
లక్ష గోవులను దానము జేయుదు లక్షణులగు బ్రాహ్మణులకునూ!
వస్త్రదానమును నన్నదానమును వాసిగ జేయుదు విప్రులకున్! 48

నే నయోధ్యకును వచ్చిన పిమ్మట నియమత భక్తి శ్రద్ధలనూ!
వేయి కల్లుకుండలతో మఱియును విమల మాంస రూపాన్నముతో!
పూజించెద నిను నీ తీరముగల పుణ్యదేవతల బూజింతున్!
తీర్థములను మఱి దేవాలయముల తీరని భక్తిని భజయింతున్! 49

అనఘే! గంగే! నా రాముండును నా తోడను, తన సోదరుతో!
తిరిగివచ్చి వనినుండి యయోధ్యను జేరుగాక విజయంబులతో
ఇటుల బలుకుచును సీతాదేవియు నింపుగ దలచుచు జాహ్నవినీ
శీఘ్రముగా దక్షిణ తీరమునకు జేరె నావ పయనించుచునూ! 50

శత్రు భయంకరుడైన రాముడును తీరముజేరిన పిమ్మటనూ!
తమ్ముని తోడను, జానకి తోడను దగ నడిచెను వని జేరగనూ!
పిదప బలికె రాముడు దమ్మునితో ప్రీతిని రక్షణ విషయమునన్!
సజనమైననూ, విజనమైననూ సహజ మెలుకువలు వలయుననీ! 51

పూర్వ మెన్నడును జూడని యడవులు బూర్తి జాగ్రతలు వలయునుమా!
నీవు ముందు నడుపుము! ఓ లక్ష్మణ నీ వెనుకయు సీతయు నడుచున్!
నేను నిన్నునూ, సీతను గాచుచు నే నడిచెద మీ వెనుకగనూ!
ఒకరినొకరు గాపాడుకోవలయు యోరిమితో నీ వనమందున్! 52

జరిగిపోయినా కార్యంబును నిక మఱల జేయగా కాదు గదా!
వనవాసంబున గలుగు కష్టములు వైదేహియు యిక దెలిసికొనున్!
జనసమ్మర్దము గాని యడవిలో సహజముగా మృగ జాతులునూ!
పశు బక్ష్యాదుల గూడియుండునూ పన్నుగ భీకర ధ్వనితోడన్! 53

పొలములు గానీ యుద్యానంబులు బొందుగ నుంచపు నెచ్చటనూ!
మిట్ట పల్లములు లోతగు లోయలు చెట్టు చేమలును గుబురు బొదల్!
అట్టి వనము జానకి యీనాడును యిట్టి ప్రవేశించును భీతిన్! 54

రాము వచనమును విని లక్ష్మణుడును రమణి సీత ముందుగ నడిచెన్!
రాముడు సీతకు వెనుక నడిచెనూ! రక్షణ సేయుచు నిరువురినీ! 55

దీనుడైన యా సుమంత్రుండు నట ధీరత్వంబును గోల్పోయి!
గంగానదినీ దాటిన రాముని గనబడు నంతకు జూచుచునూ!
మార్గము దూరంబై పోవుటచే మఱి రాముడు గనిపింపమిచే!
దృష్టి మరల్చుచు దుఃఖితుడై మఱి కష్టముతో వెనుకకు మఱలెన్! 56

లోకపాల ప్రతిమ ప్రభావుడును లోకంబులకును రక్షకుడున్!
రాముడు జాహ్నవి దాటి నడుచుచును రమ్య సస్య సముదాయముతో!
నిండినదియు మఱి సకల సంపదల దండిగ సమృద్ధ మైనదియున్
వత్సదేశమును జేరెను రాముడు వాసిగ తమ్ముడు జానకితో! 57

ఆకలిగొని శ్రీరామ లక్ష్మణులు నా వనమున ఫల మూలములక!
పరిగ్రహించుచు బయలుదేరగా బన్నుగ సాయంకాలమయెన్!
సంధ్య దీర్చుకొని రాత్రి భగవతిని వందనములు గావించుచునూ!
ఒక వనస్పతిని జేరిరి ముగ్వురు నొప్పుగ విశ్రాంతిని పొందన్! 58

(అయోధ్యాకాండమున 52వ సర్గము సమాప్తము)

* * *

# అయోధ్యకాండము-ప్రథమ భాగము

## యాబది మూడవ సర్గము

(రాముడు లక్ష్మణుని అయోధ్యకు బంప ప్రయత్నించుట. లక్ష్మణుడు తిరస్కరించుట-తిరిగి రాముడతనిని వనవాసమునకు అంగీకరించుట)
మహనీయుండగు రామచంద్రుడును మహా వృక్ష మూలము జేరి!

పడమటి సంధ్యను నుపాసించి మఱి పన్నగ లక్ష్మణుతో ననియెన్!
సుమంత్రుండు మనతోడ లేడుగద! శూన్యమైన నిశి ప్రథమంబున్!
మన దేశంబును దాటి వచ్చితిమి! మన మిక యొంటరి వారముగా!
దుఃఖింపకుమూ! లక్ష్మణ మఱి మన దుఃఖజీవితము మది దలచి! 1

నేటి నుండియును మన మిద్దఱమును నిలిచి మేల్కొనగ వలయు సుమా!
సీత క్షేమమును జూడవలయుగద స్థిరముగ యీ కానన మందున్!
ఏదో విధముగ రాత్రి గడుపుదము నేవో పర్ణాదుల పైని!
ఈ వనస్పతీ మూలము నందున నింపుగ నిదురించుద మిచటే! 2

మహార్హమగు శయనమున బరుండిన మహాత్ముడగు నా రాముండున్!
కటిక నేలపై బరుండి పలికెను గమ్మని మాటల దమ్మునితో!
తమ్ముడు లక్ష్మణ! మహారాజు మఱి దగ నిదురింపడు దుఃఖముచే
కోరిక దీరుటచే బిన తల్లియు గూర్మి సంతసము నిదురించున్ 3

ఆ దేవీ కైకేయి భరతునీ యాగమనంబును గమనించీ!
రాజ్యము కొఱకై యత్నింపదు గడు రాజు ప్రాణముల దీయుటకై
అనాథుడును, వృద్ధుడును, కాముకుడు నందు నేను లేకుంటినిగా!
ఏమి చేయగల డింక రాజునూ నింపుగ కైకేయీ వశమై!

ఈ కష్టంబును రాజు విభ్రమము నింపుగ యాలోచింపగనూ!
అర్థ ధర్మములకంటె కామమే యధికమైనదని మది దలతున్!
ఆడుదాని మాటను విని నన్నును వీడినటులు యే తండ్రియునూ!
తన యాజ్ఞను వర్తించు పుత్రునీ వని బంపదనీ నే దలతున్! 5

కైక కుమారుడు భరతు డొక్కడే ఘనముగ పాలించును ప్రజలన్!
సకల సంపదల కోసలదేశము సార్వభౌముడై సుఖమొందున్!
వయసుచేత రాజును మరణించును వనమున నుంటిని దూరముగా!
అందున భరతుడు రాజ్య మంతకును యధిపతియై రాజిల్లు నికన్! 6

అర్థ ధర్మముల బరిత్యజించి! యలరి కామమును గైకొనుచో!
దశరథరాజుకు వోలె శీఘ్రముగ తగ యాపదలను జిక్కుకొనున్!
దశరథు మరణము, వన గమనమునకు దగ భరతుని రాజ్యంబునకునూ!
కైక తల్లి మన యిల్లు జేరెనని కడు మది భావించుచునుంటిన్! 7

సౌభాగ్యంబున మద మోహితయై సర్వము దెలియక నా వలనన్!
కౌసల్యా దేవిని, సుమిత్రలను గావరమున బాధింపదుగా!
తమ్ముడు లక్ష్మణ! నా మూలంబున దగ సుమిత్ర బాధను బాపన్
ప్రాతఃకాలము లేచి వెడలుమా! వన్నుగ యయోధ్య పురమునకున్! 8

నే నొక్కడనే సీతను గూడుర నిర్జన దండక బోయెదను!
అనాథయగు కౌసల్య మాతకును నార్తి బాపు సంరక్షణచేన్!

నీచ కర్మములు జేయు కైకయును నిరసించును నా తల్లి నికన్!
ధర్మజ్ఞుడు భరతునితో బలుకుము దగ నా తల్లిని జూడుమనీ! 9

సుమిత్రీ నా తల్లి పూర్వమున సతులను దమ పుత్రులనుండీ!
ేటు జేసినది యందు వలననే విపరీతము ప్రాప్తించినదీ!
రకాలము పోషించి పెంచినా దూరమైతి నా తల్లికినీ!
ాందవలసినా సేవలు బొందక యందనంత దూరము నుండెన్! 10

ర్థ జన్మదను గానా లక్ష్మణ? వ్యథను గూర్చితిని తల్లికినీ
ట్టి పుత్రునీ యే తల్లియునూ నింపుగ కనకుండును గాతన్! 11

వనవాసము విని యా శారిక నయముగ చిలుకను జీరుచునూ!
ులుకా! శత్రువు బాదము గొఱుకుము!' జేరి పలికినది నారికయున్!

ఆశారికకును నధిక ప్రీతి మఱి యా కౌసల్యా సతిపైని!
నా కంటెను నధికముగ గల్గి దనుచు నయమ్ముగ దలచుచు నుంటి మదిన్!

నేను దప్ప మఱి పుత్రులులేని నిరుపమానమగు దల్లికిని!
ఏ యుపకారము జేయజాలని యిట్టి సుతుడి లాభంబేమీ?
నే తన దగ్గఱ లేక పోవుటను నిరవధికంబగు దుఃఖముతో!
శోక సాగరము నందు మునిగి నా రాక కెదురు జూచుచు నుండున్! 13

నే గోపించిన నా బాణములను నిఖిల మంత సాధించెదనూ!
ఇది పరాక్రమము జూపెడి సమయము నింపొందగ మఱి కాదుగదా!
పరలోకమునకును, నధర్మమునకును భయపడి సంకోచించుచునూ!
ఆ కారణమున యభిషేకమునకు నలరి దూరముగ నే నుంటిన్! 14

విజనమైన యావనమున రాత్రిని విలపించుచు శ్రీరాఘవుడున్!
అశ్రుపూర్ణ ముఖమును గలవాడై యలరి మౌనమున గూర్చుండెన్!
నిర్వేదంబగు సంద్రము వలెనూ నిదుర వోయినా యగ్ని వలెన్!
మౌనమూనినా రామచంద్రుని మఱి యోదార్చెను లక్ష్మణుడున్!

నీవు విడిచి పోవుటను నయోధ్యయు నిఖిలానందము లుప్తంబై!
చంద్రుడు లేని శర్వరి వలెనూ! సాంద్రదీప్తి యట లేకుండున్!
రామా! నీవిటు దుఃఖము జెందుట రహి యుక్తంబును గాదుగదా!
సీతకు నాకును దుఃఖము గలుగును శీఘ్రము మానుము వేదననూ

నీవులేని సీతయు జీవింపదు నేను గూడ జీవింపను సూ!
నీటి నుండి దీసిన చేపలవలె నిలువలేము! నొక క్షణమైనన్!
నిన్ను విడిచి నే తల్లిని దండ్రిని చిన్ని సోదరుని శత్రుఘ్ను
కోరను మఱి స్వర్గంబునైననూ కోరిక నీవే నీవు సుమా!

ఇటుల బలికి యా లక్ష్మణుండునూ యింపుగ రాముడు లక్ష్మణుడ
మఱ్ఱిచెట్టు మూలమున శయ్యలను మానుగ శయనించిరి వారున్!

శత్రు వినాశకుడగు శ్రీరాముడు సాధు సుందరము నగువాక్కుల్!
ఉత్తమ పుష్కలమగు వచనములను విని రాముడు నిర్ధారించెన్!
వానప్రస్థమును ననుసరింపగా వన వాసము బూర్తిని సేయన్!
పదునాల్గేడులు మునిగా గడుపగ ఫల మూలంబుల భుజించుచున్! 19

మహాబలులు శ్రీరామ లక్ష్మణులు మహారణ్యమున గూడికొనీ!
పర్వత చరియను చరియించుచు బన్నుగ ఘోరారణ్యములో!
రెండు సింహములవలె వర్తించుచు దండి మృగములును భయబడగన్!
సంభ్రమంబు మఱి భయము లేకయును సంచరించి రట ధీరతతోన్! 20

అయోధ్యాకాండములోని 53వ సర్గము సమాప్తము

* * *

## యాబది నాల్గవ సర్గము

(రాముడు ప్రయాగలో గల భరద్వాజాశ్రమమునకు బోవుట భరద్వాజ ముని వారిని సత్కరించుట చిత్రకూటమున రాముని నివసింపుమని జెప్పి దాని మహాత్మ్యమును వర్ణించుట)

మంగళకరమగు రాత్రి యంతయును మహా వృక్షమున నివసించీ!
విమల సూర్యు డుదయించుచుండగా వేగ వదిలి రా భూస్థలినీ!
రాముడు సీతా లక్ష్మణుండునూ రయమున జేరిరి వనమునకున్!
అనేక విధముల భూభాగములను నదృష్ట పూర్వము లైనవియున్! 1

మనోహరంబగు ప్రదేశంబులను మఱి మఱి జూచుచు నచటచటన్!
యమునా గంగా సంగమ స్థలమును నమల తీర్థమునకును జనిరీ!
మెల్లన రాముడు నల్లన నడుచుచు చల్లని యనేక వృక్షములన్!
చూచుచు బోయెను దినము వ్రాలగా ధీరత లక్ష్మణుతో ననియెన్! 2

లక్ష్మణ జూడుము! రమ్యప్రయాగను లాలితముగ చుట్టెత్తయినా!
పూజ్యుడైన యగ్నికి కేతనములు బొలుపుగ ధూమములను గనుమా!
మున్యాశ్రమ మిట యున్నటు దలతును ముని భరద్వాజుడు నిట నుండున్!
వేద ధ్వనులదె వినబడుచున్నవి సాధు యజ్ఞ సౌగంధములున్! 3

గంగా యమునా సంగమ స్థలమును గడు దాపునకు వచ్చితిమీ!
వారి ఘట్టితములగు జలములచే పారిణ శబ్దము వినబడియెన్!
వన్య వస్తువుల జీవించెడి జన వస్తువు లవె కనిపించెడినీ!
మున్యాశ్రమ వృక్షములు గుంపుగా మోదంబున గనిపించెడినీ! 4

ధనుర్ధరులు శ్రీరామ లక్ష్మణులు దగ సుఖముగ పయనము జేసీ!
గంగా యమునా సంగమమునకును జెంగట జేరిరి యాశ్రమమున్!
వారిని జూచీ పక్షులు మృగములు బరుగిడె రయమున భయపడుచున్
కొంతదూర మటు నడిచి రాముడును చెంత భరద్వాజుని జేరెన్! 5

రాముడు సీతా లక్ష్మణుండునూ! రమ్యాశ్రమమును జేరుకొనీ!
మునిని జూడ గోరిక తోడుత నట మోదముగా యుండిరి నిలిచీ!
కఠిన నియమములు గలవాడును మఱి కడు నేకాగ్రత గలవాడున్!
దివ్య దృష్టి గలవాడును మిక్కిలి శిష్య గణము గూడినవాడున్! 6

హుతాగ్ని హోత్రము గలవాడును మఱి మహాభాగుడగు నా ఋషికిన్!
రాముడు సీతా లక్ష్మణుండునూ రయముగ జేసిరి వందనముల్!
రాముడు దెలిపెను భరద్వాజునకు రమ్యరీతి తన విషయంబున్! 7

ఓ భగవంతుడ! భరద్వాజముని యుర్వీశుడు దశరథునకునూ!
పుత్రులమును రాముడు సౌమిత్రియు బొలుపుగ నీమెయు నా సతియున్!
జనకుని కూతురు సీత! పతివ్రత జన శూన్యంబగు వనమునకున్!
అనుసరించి నాతోని వచ్చినది యనుసరింప స్త్రీ ధర్మంబున్! 8

నా తమ్ముడు ధృఢ వ్రతుడు లక్ష్మణుడు నాయం దతి స్నేహము చేతన్!
నన్ను బంపవని దశరథు రాజును నాతో వచ్చెను వనమునకున్!
ఓ భగవంతుడ! తండ్రి యాజ్ఞచే నోర్మి తపో వని వసియించీ!
కంద మూలములు దినుచు గడిపెదము బరగ ధర్మదీక్షను గలిగీ! 9

ధీమంతుండగు రాముని మాటలు ధీనిధియగు మౌనియును వినీ!
[illegible]ధు పర్కంబును నర్ఘ్యోదకముల మౌని రామునకు సర్పించెన్!
[illegible]ర్షియగు నా భరద్వాజుడును మధుర ఫలములను మూలములన్!
[illegible]రసములను నర్పించెను మఱి యాశ్రయంబు బరికల్పించెన్! 10

[illegible]ద్వాజముని జుట్టును మృగములు పక్షులు గుమిగా గూర్చొనగా!
[illegible] రాముని స్వాగతంబుచే మచ్చిక పూజను నిటు లనియెన్!
[illegible]ర్చిన పూజను గ్రహించియును దగ నటు గూర్చుని యుండిన యా
[illegible]తో నా భరద్వాజుడును రమ్యముగా నిటులను బలికెన్! 11

[illegible]మునకు నిటకు వచ్చితిని చిరవాంఛితమును నెఱవేరెన్!
[illegible]మియు లేకుండగ నిను గానకు బంపగ వినియుంటిన్!

మహానదుల సంగమ దేశం బిది మహా పుణ్యప్రద మైనదియున్!
సుందరమైనది నిర్జన మైనది సుఖముగ వసియింపగ వచ్చున్! 12

రఘువంశంబున బుట్టిన వాడును రాముడు ముని వాక్యమును వినీ!
శుభవాక్యంబుల నిటుల బలికెనూ శుభాక్షరంబులు పౌరలంగన్!
ఓ భగవంతుడ! పౌరులు మఱియును యొనరగ వత్తురు జానపదుల్!
ఈ ప్రదేశమున దగ్గఱ నుందురు నిటకు వత్తురిక మము జూడన్! 13

తనకు సీతనూ జూచుట కొఱకును నయముగ వత్తురు బ్రజ లిటకున్!
ఈకారణమున నిట నివసించుట యిష్టబడను నే మౌనివరా!
సుఖార్హురాలగు జనకుని కుమార్తె సుఖముగ క్రీడించుట కొఱకున్!
జనసమ్మర్దము లేని ప్రదేశము వినగ తెలుపు నా యాశ్రమమున్! 13

మంగళకరమగు రాముని మాటలు మౌని సంతసము నందుచునూ!
తగు స్థానంబును దెలియ జేయుచును దన్మయమున నిటులను బలికెన్!
చిత్రకూట మను బర్వత మున్నది చిత్రమైన ప్రకృతి లీలన్!
పదిక్రోసుల దూరమున నున్నదీ బరగ గంధమాదన మనగన్! 15

ఎందఱెదందరో మునులు వశింతురు నింపుగ పుణ్యప్రదమదియున్!
బన్ని వైపులను సుఖ దర్శనమును నానందము గలిగించునదీ!
క్రూర మృగము లట నుండవు నీ వట కూరిమి నివసింపగ వచ్చున్!
అ పర్వతమున వసించు వారలు నందుకొందురు సుఖ సౌఖ్యములన్! 16

చిత్రకూటమున మహాత్ములెందఱొ శిరసులు కపాలములు గాగన్!
వందలకొలంది వత్సరంబు లట వరుసగ తపంబులను జేసీ!
స్వర్గంబునకును బోయిరందఱును సకల శాంతప్రద మా స్థలమున్!
ఏకాంతమునకు దగిన ప్రాంత మది శ్రీకాంతిని గూడుండు మటన్! 17

లేదా మాతో గూడి యుండునూ! మనసున యే చింతయు లేకన్!
వనవాసంబును బూర్తి చేసికొని జనకుని రాజ్యము జేరుకొనూ!
తమ్మునిలో మఱి భార్య తోడుతను దగ ప్రియ మతిథికి రామునికిన్!
స్వాగత మిచ్చెను సర్వ కామముల సహృదయత పూజను జేసెన్! 18

ప్రయాగ క్షేత్రమునందు రాముడును భరద్వాజుతో గూడికొనీ!
అనేక విధముల యనేక కథలను నాలాపించుచు నుండగనూ!
పుణ్య ప్రదమగు రాత్రివచ్చినది పుట్టెడు నల్లని కాటుకతో!
నీలాకాశము జుక్కల దోడుత నిండెను మిలమిల కాంతులతో. 19

సుఖపడుటకు నలవాటు పడిన యా శుభకరులగు నా ముువ్వురునూ!
అలసి సొలసి యారాత్రి సుఖముగా నాశ్రమ మందున శయనించీ!
రాత్రి తెల్లవారిన పిమ్మట నా రమ్య గుణుడు శ్రీరాముండున్!
మహాతేజుడగు భరద్వాజుతో మధురముగా నిటులను పలికెన్! 20

'సత్యవ్రత! ఓ మహామౌని! నట సరగున గడిపితి మీ రాత్రిన్!
మేము బోవుటకు ననుజ్ఞ నిమ్మా మేము వసించెడి స్థలమునకున్! 21

అంతట పలికెను మౌని రాముతో నాదర మేదుర భావమునన్!
చిత్రకూటమున ఫల మూలంబులు శివకరమగు పూవులు మధువున్!
అధికముగా నట దొరుకును బొండని నాదేశించెను రామునకును!
మహావీర! యా చిత్రకూట మది మానిత సుందర నివాసమున్!

నీకు దగిన వాసంబని తలచెద నిర్మలమును నేకాంతంబున్!
వివిధములగు వృక్షముల దోడుతను వివిధ కిన్నెరుల నురగులచే
మయూర నాదములను ధ్వనించునూ మహా గజములును వసియించున్!

కంద మూల ఫలములు లభియించును గడు మధువులు నట లభియించున్
ఆశైలము బహు విచిత్రమైనది యాగిరి బహు రమణీయంబున్!
రామా! యచటను నేనుగు గుంపులు రమ్యములగు మృగ యూథములన్!
వనాంతరంబున సంచరించుటను వాసిగ జూడగ గలవచటన్! 23

నదీ నదంబులు గొండ చరియలును నయముగ గిరి కన్దరములనూ!
సెలయేఱులు ప్రవహించు చుండునట చిన్ని చిన్ని కొలనుల తోడన్!
అట్టి చిత్రకూటమ్మును జూచుచును నిట్టె గడుపగల వట కూర్మిన్!
సీతకూడ యానందము జెందును చిత్రమైన శోభను గాంచీ! 24

మంగళ కరమగు చిత్ర కూటమున మధుర ప్రకృతిని గనగలవూ!
కోయష్టిక పక్షులును, కోకిలలును కూయంచును కూ యనుచుండున్!
అనేక విధముల మృగముల తోడను నలరి మదించిన గజములతో!
రమ్యముగా నుండును నీ వచ్చట రమ్యాశ్రమమున నివసింపన్! 25

(అయోధ్యాకాండమున-54వ సర్గము సమాప్తము)



# రచయిత నూతన గ్రంథములు

డైరెక్టర్ ఆఫ్ హైద్రాబాదు వారిచే ది 25-10-99న
జారీ చేయబడిన సైటేషన్ సెంటర్ల జాబితాలోని

## మా స్వంత పుస్తకములు :

| | | | |
|---|---|---|---|
| 1. | మంచుముత్యాలు | 771/సాతె 700/13754 | రు. 12-00 |
| 2. | శ్రీరామకథా సుధాలహరి | 970/సాతె 800/158 | రు. 20-00 |
| 3. | శ్రీ భగవద్గీత | 276/సాతె 200/101 | రు. 20-00 |
| 4. | శ్రుతిలయలు | 1272/సాతె 800/455 | రు. 12-00 |

## 1999, 2000లో నూతన ప్రచురణలు:

1. కలబోసిన ముత్యాలు (1000 ఆటవెలది గీతపద్యాలు) రు. 20-00
2. ఆనంద యాత్ర (లలిత గీతాలు) రు. 20-00
3. విరహగీతం " రు. 20-00
4. ఆనంద గ్రంథి " రు. 20-00
5. ప్రభాత గీతాలు (హరిపూజ)
(తిరుప్పావై గీతములకు స్వేచ్ఛానువాదము) రు. 20-00
6. హంసధ్వని (లలిత గీతాలు) రు. 20-00
7. శ్రీరామకథా సుధాలహరి (చతురస్ర గీతికలు)
అయోధ్యాకాండము (మొదటి భాగము 240 పే.) రు. 30-00

## వెలువడనున్న గ్రంథములు :

1. శ్రీరామకథా సుధాలహరి (చతురస్ర గీతికలు)
అయోధ్యాకాండము (రెండవ భాగము 260 పే.) రు. 30-00